# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## త్రిమూర్తి
రచన : వసుంధర

## సిగరెట్ కేస్
రచన: టెంపోరావ్

## చచ్చి సాధించాడు
రచన: 'సికిందర్'

## పగవాని కూతురు
రచన: కె. బి. ఎస్. కుమార్

## అడుగు ముందుకు వేస్తే చస్తావ్!
ఎనిమిదవ భాగము—రచన: వసుంధర

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—68**
ఆగస్టు, 1979
వెల: రు. 3-50
ఏడాది చందా 45 రూపాయలు
జీవిత చందా 275 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**



కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

17-7-79

# "త్రిమూర్తి"

## వసుంధర

శాస్త్రి, శర్మ—ఇద్దరూ నిరుత్సాహంగా పార్కులో కూర్చున్నారు.

అప్పటికి వాళ్ళు బియ్యే పాసై మూడేళ్ళయింది. ఇంత వరకూ ఎక్కడా ఉద్యోగం దొరకలేదు. వాళ్ళు చేసిన ప్రయత్నాలన్నీ ఇంచుమించుగా ఫెయిలై పోయాయి.

శాస్త్రికీ శర్మకూ నా అన్నవాళ్ళు లేరు. చిన్నప్పటి నుంచీ దూరపుబంధువుల ఇంట్లో ఉంటూ వాళ్ళింట్లో అడ్డమయిన చాకిరీలూ చేస్తూ వాళ్ళ దయాధర్మ భిక్షంపై జీవిస్తూ—కాలేజీలో కూడా చదువుకుని బియ్యే పాసు అయ్యారు. ఇద్దరికీ కాలేజీలోనే పరిచయమయింది. ఒక లాంటి వాళ్ళమేనని తెలుసుకున్నాక వారిమధ్య స్నేహం దినదినాభివృద్ధి చెందింది.

ఇంటిదగ్గర బ్రతుకలా వున్నా కాలేజీలో రకరకాల కార్య కలాపాలలో పాల్గొంటూ వాళ్ళు మంచి పేరు

సంపాదించుకున్నారు. ఇటు ఆటల్లోనూ, అటు సాంస్కృతిక కార్యకలాపాల్లోనూ పాల్గొంటూ నలుగురి చేతా శభాష్ అనిపించుకుని హీరోల మనిపించుకున్నారు.

బయట ఎంత పేరున్నా వారివారి బంధువుల ఇళ్ళలో వీళ్ళకు బొత్తిగా విలువ, గౌరవం లేదు. ఆ బంధువులు వీళ్ళచేత చేయించుకోని పని వుండేదికాదు. ఇంట్లో పని మనుషులకన్నా నీచంగా చూసేవారు. ఆడపిల్లల కన్నా కూడా బట్టలుతికేవారు. ప్రయాణాల్లో బంధువులకు కూలి అవసరం లేకుండా ఉండేవారు. బియ్యే పాసుకాగానే ఉద్యోగం దొరికి తమ హోదా మారుతుందని యిద్దరూ ఆశించారు కానీ మూడేళ్ళు గడిచినా అలాంటిదేమీ జరక్కపోవడంతో వాళ్ళుబాగా నీళ్ళుకారిపోయారు.

"ఇది పలుకుబడి యుగం. మనగురించి పలుకుబడి వుపయోగించే వారెవ్వరూ ఉండరు. మనం చదివిన చదువుకు వుద్యోగం దొరకదు. డబ్బు సంపాదించడానికి మనం యింకేదయినా దారి వెతుక్కోవాలి" అన్నాడు శర్మ.

"అవును. మన కాలేజీలో మనకెంత పేరుండేది? ఆ పేరంతా ఇప్పుడు బొత్తిగా ఎందుకూ పనికిరాకుండా పోయింది" అన్నాడు శాస్త్రి.

"మనం ఆటలు ఆడగలం. కానీ అవి మనకు జాతీయ స్థాయిలో గుర్తింపుని తీసుకుని రాలేదు. మనం వేషాలు వేయగలం. కానీ నాటకాలకు ఆంధ్రదేశంలో ప్రోత్సాహము లేదు. మనం సినిమా నటులం కాలేము. ఏదైనా చిన్నచిన్న పనులు చేద్దామన్నా ఇలాంటి బ్రతుకు ఎంత కాలం గడుపుతాము?" అన్నాడు శర్మ.

శాస్త్రి శర్మవైపు చూసి, "నాకొకటి అనిపిస్తోందిరా- మన తెలివి తేటలూ, చలాకీతనం ధనసంపాదనకుపయోగి స్తే ఎలా వుంటుంది?" అన్నాడు.

"అందుకే కదా ఉద్యోగంకోసం చూస్తోన్నాము" అన్నాడు శర్మ.

"ఉద్యోగమంటే అది సక్రమమైన మార్గం" అన్నాడు శాస్త్రి ఏదో ఆలోచిస్తూ.

శర్మకు శాస్త్రి ఉద్దేశ్యం అర్థమయింది. "మరో మార్గం మనవల్ల అవుతుందంటావా?"

"నీ బుర్ర—నా బుర్రకలిస్తే తప్పక అవుతుంది—" అన్నాడు శాస్త్రి.

"సరే, అయితే ఇప్పుడే కలిపిచూదాం" అంటూ శర్మ తన బుర్రను శాస్త్రి బుర్రకు ఢీకొట్టించాడు. ఠంగ్ మని శబ్దమయింది.

"మనవి సామాన్యమైన తలకాయలుకావు — రెండూ తగిలితే మెటాలిక్ సౌండ్ అనగా లోహ శబ్దం వస్తోంది" అన్నాడు శాస్త్రి ఆనందంగా.

## 2

ఉద్యోగానికి ఇంటర్వ్యూ వచ్చిందని అబద్ధమాడి శాస్త్రి, శర్మ ఊరువదలి పెట్టారు. టికెట్ లేకుండానే ట్రయిన్ ఎక్కారు. టికెట్ కలెక్టరు వచ్చినపుడల్లా లెట్రిన్ లోదూరి తప్పించుకున్నారు. ఆఖరికి ఒకవూళ్ళో దిగారు. దగ్గరేమీ సామానులేదు. ఇద్దరూ రైలుపట్టాల దారిలో నడిచి ప్లాట్ ఫారం మీంచి ఊళ్ళోకెళ్ళారు.

ఇద్దరికీ మంచి ఆకలేస్తోంది. జేబులో డబ్బుల్లేవు.

"ఏదయినా హోటల్లోదూరి కడుపునిండా భోంచేసి తర్వాత డబ్బుల్లేవన్నావనుకో, మనచేత పిండి రుబ్బించి

తర్వాత బయటకు పంపిస్తారు. అదో పద్ధతి" అన్నాడు శర్మ.

"కానీ అంతా అలా చేయకపోవచ్చు—ఒకో హోటలుకు ఒకోపద్ధతి వుండవచ్చు."

"అయితే ఏ హోటల్‌కు ఏ పద్ధతివుందో యెలా తెలుసుకోవడం?" అన్నాడు శర్మ.

"ఉండు చెబుతాను" అన్నాడు శాస్త్రి. ఈలోగా వాళ్ళను ఓ కుర్రాడు సమీపించాడు. శాస్త్రి సైగను అందుకొని శర్మ అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

"నాలుగురోజుల్నుంచి భోజనం లేదండీ!" అన్నాడా కుర్రాడు.

"నీ ముఖంచూస్తే ఆ సంగతి తెలుస్తోంది" అన్నాడు శాస్త్రి.

"ఒక్క పదిపైసలు ఇప్పిస్తే...." అన్నాడు ఆ కుర్రవాడు.

"పదిపైసలేం కర్మ....కడుపునిండా భోజనం పెట్టిస్తా. ఆకలిబాధ ఎలాంటిదో నాకూ తెలుసు...." అన్నాడు శాస్త్రి.

కుర్రాడి ముఖం వెలిగింది కానీ వాడి ముఖంలో అనుమానంకూడా కనబడింది.

శాస్త్రి వాడి భుజంమీద చేయివేసి దగ్గరలోవున్న హోటల్‌కు తీసుకు వెళ్ళాడు. ఇద్దరూ సుష్టుగా టిఫిన్ తిన్నాక వక్కపొడి తీసుకువస్తానని శాస్త్రి బయటకు వచ్చేసి దగ్గర్లోవున్న శర్మకు జరిగింది చెప్పాడు.

"ఏ ప్రమాదమూ లేకుండా నీ ఆకలి తీరింది—నా సంగతి నేను చూసుకోవాలి" అన్నాడు శర్మ. అతను

నెమ్మదిగా హోటల్లోకి ప్రవేశించి ఆ కుర్రవాడినే గమనిస్తూ కూర్చున్నాడు.

సర్వర్ వచ్చి—"ఏం కావాలిసార్!" అని అడిగాడు.

"ఇంకా ఏమీవద్దు...." అన్నాడు శర్మ. అతడి మాటలకు అర్థం తెలియక సర్వర్ తెల్లముఖం వేశాడు.

శాస్త్రితో హోటల్‌కు వెళ్ళిన కుర్రాడికి సర్వర్ బిల్లు తెచ్చి ఇచ్చాడు. ఆ కుర్రాడు శాస్త్రికోసం ఆత్రుతగా ఎదురు చూస్తున్నాడు. కాసేపటికి అతడి ముఖంలో కంగారు కనపడింది.

ఈలోగా సర్వర్ శర్మను ఇంకోసారి పలకరించాడు. ఇంకా ఏమీవద్దనే జవాబిచ్చాడతను.

ఆ కుర్రాడు మరికాసేపు చూసి దిగులుగాలేచి బిల్లు కౌంటర్ దగ్గరకు వెళ్ళి తన పరిస్థితి చెప్పాడు. ప్రొప్రయిటర్ కోపంగా ఆ కుర్రాడివంక చూసి, "ఇదంతా ఒక నాటకం. మీరిద్దరూ కలిసి ఆడుతున్న నాటకం—" అన్నాడు.

"ఇది నాటకమయితే అయుండొచ్చు కానీ—నాటకమని నాకు తెలియదు" అన్నాడు కుర్రాడు.

"అవన్నీ నాకు తెలియదు. ఎలాగో అలా డబ్బులియ్యి" అన్నాడు ప్రొప్రయిటరు.

"ఎలాగివ్వను సార్. ఇవ్వగలిగే మాటైతే నాలుగు రోజులనుండి ఆకలితో ఎందుకు మాడుతాను?" అన్నాడా కుర్రాడు అమాయకంగా.

"నువ్వు నాలుగు రోజులున్నించి భోజనం లేకుండా వున్నావా? అయితే యింకేం—ఆ ఆకలే నిన్నిపనికి పురికొల్పి వుంటుంది" అన్నాడు ప్రొప్రయిటర్.

"ఏం కావాలి సార్?" అని మళ్ళీ అడిగాడు సర్వర్ శర్మను.

"ఇంకా ఏమీావద్దు" అన్నాడు శర్మ.

"ఎప్పుడు కావాలి సార్!" అన్నాడు సర్వర్ విసుగ్గా.

"నాకులేని తొందర నీకెందుకు?" అన్నాడు శర్మ కోపంగా.

"మీలాంటి వాళ్ళను చూడ్డం నా సర్వీసులో యిదే మొదటిసారి!" అన్నాడు సర్వర్.

"కొత్త విశేషాలు ఎదురయితే కానీ జీవితంలో మజా ఎలా వస్తుంది?" అన్నాడు శర్మ.

ఈలోగా ప్రొప్రయిటర్ ఆ కుర్రాడిమీద పెద్దగా కేకలు వేయడం మొదలుపెట్టాడు.

శర్మ ఈలోగా సర్వర్ని పిలిచి టిఫిన్ ఆర్డర్ చేసేద్భు సాధ్యమైనంతవరకూ వెంట వెంటనే వచ్చేలాంటి ఇడ్లీ, ఉప్మాలాంటివి చెప్పాడు. అతడు టిఫిన్ తింటూంటే కౌంటర్ దగ్గర గోల మొదలయింది.

ప్రొప్రయిటర్ లోపల్నుంచి ఒక మనిషిని పిలిచాడు. వాడు నల్లగా పొడుగ్గా బలంగా వున్నాడు. వాణ్ని చూడగానే మొట్టమొదటగా యెవరికయినా కలిగేది భయం.

"వీడు నా వంటవాడు, పిండి రుబ్బేవాడు" అన్నాడు ప్రొప్రయిటర్. "సాధారణంగా హోటల్లో ఎవరయినా టిఫిన్ తిని డబ్బులివ్వకపోతే వాళ్ళచేత పిండి రుబ్బి స్తాను. ఆ మేరకు వీడి జీతంలో కట్ చేస్తాను. నువ్వు డబ్బులివ్వకపోవడంవల్ల నష్టపోయేది వీడు. అందుచేత ఈ వ్యవహారాలు తనే తేల్చుకుంటానన్నాడు. నేనింక నీతో మాట్లాడను. నువ్వూ వీడూ తేల్చుకోండి."

ప్రొప్రయిటర్ మాట ముగియగానే, "ఏరా డబ్బు లేవూ?" అన్నాడు పిండి రుబ్బేవాడు.

"నిజంగా లేవు. కానీ నేను కావాలని ఇలా చేయ లేదు" అంటూ జరిగింది చెప్పాడు కుర్రాడు.

"ఇలాంటి వాళ్ళను చాలామందిని చూశా" నన్నాడు పిండి రుబ్బేవాడు. పిండి రుబ్బేవాడు ఈ మాటలుపూర్తి చేసి ఒక అడుగు ముందుకువేసి కుర్రాడి డొక్కలో గట్టిగా తన్నాడు. దెబ్బ తింటూనే కుర్రాడు కెవ్వుమని కేకవేసి పడిపోయి మెలికలు తిరిగిపోయాడు. పిండిరుబ్బే వాడు నవ్వుకుంటూ కుర్రాడిని మళ్ళీ సమీపించి ఇంకో తాపు తన్నాడు.

అప్పటికి శర్మ ఇడ్లీ, ఉప్మా తినడం అయింది. అతను చటుక్కున లేచినిలబడి వడివడిగా అడుగులు వేసుకుంటూ "ఇంకో తాపు తంతే ఆ కుర్రాడు చచ్చిపోతాడు. అప్పుడు నువ్వూ, నీ ప్రొప్రయిటరూ జరిగిందానికి జవాబు దారీ ఇచ్చుకోవాల్సి వుంటుంది" అన్నాడు.

"చావకుండా తన్నడం నా ప్రత్యేకత—" అన్నాడు పిండిరుబ్బేవాడు.

"ఇక్కడ జరిగిన నేరాలకు జవాబుదారీ అవసరముం డదు" అన్నాడు ప్రొప్రయిటర్.

"ఇది చాలా మంచి సమాచారం నాకు. నేనుకూడా బిల్లు ఇవ్వకుండా నేరం చేద్దామనుకుంటున్నాను" శర్మ అన్నాడు అక్కడికి తనచేతిలో డబ్బులున్నట్టు.

"చావకుండా చచ్చేలా తన్నడం నా ప్రత్యేకత—" అన్నాడు పిండి రుబ్బేవాడు మళ్ళీ.

"ఏదీ—ఏ ప్రత్యేకత చూపించు చూస్తాను" అన్నాడు శర్మ. అతడిమాట ముగియకుండానే పెడీమని తన్నాడు

పిండిరుబ్బేవాడు. శర్మ మెలికలు తిరిగిపోతూ క్రిందపడి రెండుసార్లు దొర్లాడు.

శర్మ లేచేలోగా పిండిరుబ్బేవాడు మళ్ళీ అతన్ని సమీపించాడు. అతను లేచేలోగా ఇంకోసారి తన్నాడు. శర్మ చాలా వేగంగా దొర్లుకుంటూ ఒక టేబుల్‌కు తగిలి ఆగిపోయాడు. అక్కడ అతను చటుక్కున లేచి నిలబడి అప్పుడే సర్వర్ అక్కడ ఎవరికోసమో పెట్టిన కాఫీగ్లాసు చటుక్కున అందుకుని రెండుగుక్కలు తాగాడు. ఈ లోగా పిండిరుబ్బేవాడు అతన్ని సమీపించాడు.

"ఆగు—" అన్నాడు శర్మ. "ఎలాగూ నేను నీ చేత తన్నులు తినాలి. ఈ కాఫీకూడా తాగనిచ్చేయ్. ఇష్టం వచ్చినట్లు తన్నుదువు గాని."

పిండిరుబ్బేవాడా మాటలను వంట పట్టించుకునేలోగా శర్మ కాఫీతాగేసి గ్లాసు బల్లమీద పెట్టి చకచకా నడుచుకుంటూ ప్రొప్రయిటర్ బల్లదగ్గరకెళ్ళి, "చూడు మిస్టర్! నాకూ కొన్ని ప్రత్యేకతలున్నాయి. నీ పిండిరుబ్బేవాడికిప్పుడు నేను పాఠం చెప్పదల్చుకున్నాను. ఈ హోటల్లోనే చెప్పమంటే నాకు అభ్యంతరంలేదు. అందువల్ల నువ్వు నేనివ్వాల్సిన బిల్లు డబ్బులకంటే బాగా యెక్కువగా నష్టపోతావు" అన్నాడు.

"నేను ఈ హోటల్ మీదే బ్రతకడంలేదు. నీలాంటి వాళ్ళకు పాఠం చెప్పడంకోసం ఎంత నష్టమైనా భరించగలను" అన్నాడు ప్రొప్రయిటర్ ఉదాసీనంగా.

"సరే—అయితే అనుభవించు" అంటూ శర్మ తనను సమీపించబోతున్న పిండిరుబ్బేవాణ్ని చటుక్కున తన్నాడు. వాడు వెళ్ళి దగ్గర్లోవున్న టేబిల్ మీదపడ్డాడు.

టేబుల్ పైన వున్న గాజు గ్లాసులు క్రిందపడి బద్దలు అయ్యాయి. హోటల్లోని జనం భయంతో లేచారు.

శర్మ పదినిముషాల్లో ఆ పిండిరుబ్బేవాడి ఒళ్ళు హూనం చేసి వదిలిపెట్టాడు. వాడు శర్మ కాళ్ళు పట్టుకొని దణ్ణం పెట్టి. "ఇంకెప్పుడూ మీ జోలికిరాను" అన్నాడు.

శర్మ అక్కణ్ణించి కదులుతూ "ఇక్కడ జరిగే నేరాలకు జవాబుదారీ ఉండదుగదా. రోజూ నేను యిక్కడికేవచ్చి టిఫిన్ తిని వెడుతూంటాను" అని దెబ్బలుతిన్న కుర్రాణ్ని తీసుకుని బయటకు వెళ్ళిపోయాడు.

ప్రొప్రయిటర్ కోపంగా పిండిరుబ్బేవాణ్ని చూడ్డానికి వెళ్ళాడు.

# 3

"ఆ హోటల్‌కు మళ్ళీ వెళదామంటావా?" శాస్త్రి అన్నాడు.

"కాలేజీ రోజుల్లో సరదాకు నేర్చుకున్న విద్యలన్నీ పనికొస్తున్నాయి. ఆ హోటల్ ప్రొప్రయిటర్ పెద్ద గ్యాంగ్ లీడరని నాకు అనుమానంగావుంది. వాడిలాంటి వాడు మనను గుర్తిస్తే అంతకంటే అదృష్టమేముంది? మనకేదయినా పని దొరుకుతుంది" అన్నాడు శర్మ.

"పనిచ్చేవాడయితే ఉదయమే ఇచ్చివుండేవాడు" అన్నాడు శాస్త్రి.

"అప్పుడు వాడు షాక్ తిన్నాడు. పిండిరుబ్బేవాడి మీద కోపంగా వున్నాడు. అందులో నా గురించి పట్టించుకోలేదు. ఇప్పుడు మనం మళ్ళీవెడితే తప్పక ప్రయోజన ముంటుంది" అన్నాడు శర్మ.

"ఒకవేళ వాడు మనలను మంచి మాటలతో బంధించి హింసిస్తే?" అన్నాడు శాస్త్రి.

"మనను హింసిస్తే వాడికేమొస్తుంది? వాడేంచెప్పినా చేసేద్దాం" అన్నాడు శర్మ.

"సరే, ఓ రిస్క్ తీసుకుందాం" అన్నాడు శాస్త్రి. అతడికీ ఆకలిగా వుంది.

ఇద్దరూ మళ్ళీ అదే హోటల్లో ప్రవేశించారు. శర్మ తిన్నగా ప్రొప్రయిటర్ దగ్గరకు వెళ్ళి శాస్త్రిని పరిచయం చేసి, "ఇతడు నా స్నేహితుడు. పరాక్రమంలో నా అంతటివాడు. బుద్ధిలో నాకంటె ఘనుడు. ఈరోజు ఉదయం ఆ కుర్రాణ్ని మోసంచేసి నీ హోటల్లో టిఫిన్ తిని వెళ్ళిపోయిన దిశ దే! మళ్ళీ ఆకలి వేస్తోంది. ఈసారి ఇద్దరూ కలిసివచ్చాం. జేబులో డబ్బుల్లేవు" అన్నాడు.

"నా పనివాడు మారాడు" అన్నాడు ప్రొప్రయిటర్ క్లుప్తంగా.

"అయితే వాణ్ని తిని తన్నమంటావా? తన్ని తిన మంటావా?" అన్నాడు శర్మ.

ప్రొప్రయిటర్ వాళ్ళవంక ఆశ్చర్యంగాచూసి—"ఎవరుమీరు? చూడ్డానికి చాలా మర్యాదస్తుల్లావున్నారు. వ్యవహారంచూస్తే పోగరుబోతు రౌడీలకులావుంది. ఎందుకిలా ప్రవర్తిస్తున్నారు?" అన్నాడు.

"నిజానికి మేము మర్యాదస్తులమే. మేము బియ్యే పాసయ్యాం. మూడేళ్ళనుంచి ఉద్యోగంకోసం ప్రయత్నాలు చేసిచేసి విసిగిపోయి మర్యాద విడిచిపెట్టేయాలనే నిర్ణయానికి వచ్చేసాం" అన్నాడు శాస్త్రి.

ప్రొప్రయిటర్ వాళ్ళవంక అదోలాచూసి, "ముందు వెళ్ళి టిఫిన్ తినిరండి మీతో మాట్లాడాలి" అన్నాడు. ఆ మాటలు వింటూనే శర్మ ముఖంలో ఉత్సాహం కన

పడింది. శాస్త్రి ముఖంలో అనుమానరేఖలు కనపడ్డాయి. ఇద్దరూ వెళ్ళి సుష్టుగా టిఫిన్ తిని అక్కణ్నించి ప్రొప్రయిటర్ దగ్గరకు వెళ్ళారు.

"పైన గదివుంది, అక్కడ మాట్లాడుకుందాం—" అన్నాడు ప్రొప్రయిటర్.

"మేము నిజమే చెబుతున్నాం. మమ్మల్ని చంపినా అడిగేవాళ్ళు లేరిక్కడ. ఆపైన మీ ఇష్టం. నా అన్న వాళ్ళు లేనివాళ్ళం!" అన్నాడు శాస్త్రి.

"నేను నిజంగా మీతో మాట్లాడ్డానికే పైకి రమ్మంటున్నాను. మరో దురుద్దేశ్యమేమీ లేదు. మీవల్ల నాకు అపకారాన్ని శంకించడంలేదు. అది మీకు సాధ్యంకాదని నాకు తెలుసు" అన్నాడు ప్రొప్రయిటర్.

ముగ్గురూ అక్కణ్నించి పైకి వెళ్ళారు. ప్రొప్రయిటర్ స్థానంలో మరోవ్యక్తి కూర్చున్నాడు.

గదిలో పెద్ద విశేషాలేమీ లేవు. చాలా సామాన్యమైన గది అది. ప్రొప్రయిటర్ వాళ్ళిద్దరినీ కూర్చోమని, వాళ్ళు కూర్చున్నాక తనూ ఓ కుర్చీలో కూర్చుని—"నా పేరు కృష్ణ!" అన్నాడు.

శాస్త్రి, శర్మ వాళ్ళ పేర్లు చెప్పారు. ప్రొప్రయిటర్ కృష్ణ ఒక నిమిషంపాటు మౌనంగా ఉండిపోయాడు.

"నాకు ఈ హోటల్ పెద్దవిశేషం కాదు. ప్రభుత్వం కళ్ళు కప్పడానికి ఈ హోటల్ నడుపుతున్నాను. ఈ విషయం మీకు తెలిసినా మీరు నన్నేమీ చెయ్యలేరు. నాకు రాజకీయపరమైన పలుకుబడి వుంది. నాకు సంబంధించిన ఇతర వ్యవహారాలద్వారా కోట్లకొద్దీ డబ్బుసంపాదించుకుంటున్నాను. కానీ ఇటీవల నాకు కొన్ని ఇబ్బందులు వచ్చాయి. మాకు పోటీగా ఒక సంస్థవచ్చింది.

వాళ్లు వచ్చేక మా బిజినెస్ దారుణంగా పడిపోయింది. వాళ్ళ ఎత్తులు మాకు అర్థంకావడంలేదు. వాళ్ళ రహస్యాలు తెలుసుకోవాలని మేము చాలా ప్రయత్నాలు చేసి విఫలమయ్యాం. ఇంతవరకూ ఎందరో ఈ పనిమీద వెళ్ళి తమవల్లకాదని తిరిగి వచ్చేశారు. మీరుకూడా ఓ సారి ప్రయత్నం చేస్తానంటే కొన్ని వివరాలు చెబుతాను" అన్నాడు కృష్ణ.

"ప్రస్తుతం మాకు జేబుల్లో పైసాకూడాలేదు. ఇందువల్ల మాకేదయినా లాభిస్తుందా—అందులోనూ యిప్పటికిప్పుడు లాభించాలి. ఎందుకంటే టిఫిన్ కోసం రోజూ ఫైటింగ్ చేయాలంటే కష్టంగదా" అన్నాడు శాస్త్రి.

"మీ ఇద్దరికీ చెరో వెయ్యి రూపాయలూ ఇస్తాను. ఇది ఇంచుమించు ధర్మంలాంటిదే — నేను చెప్పినపని సాధించుకు రాగలిగితే—మీ పని మూడుపువ్వులూ, ఆరు కాయలూగా ఉంటుంది." అన్నాడు కృష్ణ.

"చెప్పండి!" అన్నాడు శర్మ ఉత్సాహంగా.

"మాకు పోటీగా వచ్చిన సంస్థ పూర్తి వివరాలు తెలియవుకానీ కార్యాలయం తెలుసు. గజవీర ఆయుర్వేదం మందుల దుకాణం అన్న పేరుతో ఆ కార్యాలయం స్థాపించబడింది. అక్కడ ఆయుర్వేదం మందులు అన్నీ దొరుకుతాయి. కూర్చుని మందులమ్మే అతని పేరు భాస్కరాచార్యులు. ఆ సంస్థకు అతడే యజమాని అని మా నమ్మకం. వాళ్ళకూ ప్రభుత్వంలో మంచి పలుకుబడివున్నదేమో తెలియదు కానీ తమ వ్యవహారాలను పబ్లిక్‌గా కొనసాగించడానికి వాళ్ళేమీ జంకుతున్నట్లనిపించదు" అన్నాడు.

"మేమేం చేయాలి?" అన్నాడు శర్మ.

"వాళ్ళకు అనుచరులుగా పనిచెయ్యాలి" అన్నాడు కృష్ణ.

"అందువల్ల మీకు ప్రయోజనం?" అన్నాడు శాస్త్రి.

"వాళ్ళ రహస్యాలు మా కందజేయాలి!"—అన్నాడు కృష్ణ.

"ఓ.కే అలాగే!" అన్నారు మిత్రులిద్దరూ.

"మీరు ఓ.కే అన్నంత సులభం కాదీ వ్యవహారం" అన్నాడు కృష్ణ. "భాస్కరాచార్యులికి అనుచరులు కావడం సులభం కాదు. ఆయన చాలా పరీక్షలు పెడతాడు. అవన్నీ నెగ్గితేనే తనకు అనుచరులుగా తీసుకుంటాడు. ఆయన పెట్టే పరీక్షల్లో నెగ్గుకురావడం ఇంచుమించు అసాధ్యమే!"

"అయితే ఏం చేయమంటారు?" అన్నాడు శర్మ.

"ప్రయత్నించండి. నాకు చేతనైనంతవరకూ నేనూ మీకు సాయపడతాను" అన్నాడు కృష్ణ ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ.

"అయితే బయల్దేరుతాం" అన్నాడు శాస్త్రి.

"నన్ను కలుసుకునేందుకు మళ్ళీ హోటల్‌కు రావద్దు. నేను యిచ్చే ఫోన్ నంబర్ నోట్ చేసుకోండి. అక్కడికి సమాచారం అందజేస్తే మనం ఎలా కలుసుకునేదీ తెలియజేస్తాను" అన్నాడు కృష్ణ.

## 4

"నమస్కారమండి. నా పేరు శర్మ. ఇతడు నా మిత్రుడు శాస్త్రి!"

భాస్కరాచార్యులు వాళ్ళిద్దర్నీ ఎగాదిగా చూసి "ఏం కావాలి మీకు?" అన్నాడు.

"మీ దగ్గర పని కావాలి!"

"నేను పసులు అమ్మను. మందులమ్ముతాను" అన్నాడు భాస్కరాచార్యులు.

"తెలుసునండి. కానీ మాకు మందులక్కర్లేదండి. పనే కావాలి!"

"అయితే యిక్కణ్ణుంచి వెళ్ళొచ్చు."

"మీకు మా సంగతి తెలియదండి. మేము చేయలేని పనంటూ ఉండదు. మీరేం పని చెప్పినా చేసేస్తామండి" అన్నాడు శర్మ.

భాస్కరాచార్యులు తీవ్రంగా మిత్రులిద్దర్నీ చూసి "నా దగ్గర పని దొరుకుతుందని మీకెవరు చెప్పారు?" అన్నాడు.

"మీ ముఖంలో దివ్యతేజస్సు" అన్నాడు శర్మ.

"నేను పని ఇస్తాను. కానీ అది చాలా కష్టం" అన్నాడు భాస్కరాచార్యులు.

"ఎంత కష్టమైనదైనా సరే—సాధించగల శక్తి నాకుంది అన్నాడు" శర్మ.

"సరే - అయితే లోపలకు రండి!" అన్నాడు భాస్కరాచార్యులు.

శాస్త్రి, శర్మ ఉత్సాహంగా లోపలకు వెళ్ళారు.

"పెద్దగా దాచవలసిందేమీ లేదు. నా సంగతి మీకు తెలిసే వుంటుంది. రంగరాజు దగ్గర నటరాజశిల్ప మొకటుంది. అది నాక్కావాలి...." అన్నాడు భాస్కరాచార్యులు.

"రంగరాజెవడు? నటరాజ శిల్పమేమిటి?" అన్నాడు శాస్త్రి.

"అది నేను చెప్పను. మీరే తెలుసుకుని సంపాదించి నా కివ్వాలి!"

"ఇస్తే మాకు లాభమేమిటి?"

"చెరో పదివేలూ..." అన్నాడు భాస్కరాచార్యులు.

శాస్త్రి, శర్మ యిద్దరూ అక్కణ్నించి బయటపడ్డారు.

"మనం నక్కని తొక్కినట్లున్నాం!" అన్నాడు శర్మ.

"అలాగే కనబడుతోంది. ఇప్పుడు ఈ రంగరాజెవరో ఆ నటరాజ శిల్పమేమిటో తెలుసుకోవాలి మనం!" అన్నాడు శాస్త్రి.

"మన కృష్ణ వున్నాడు గదా-అతడే సాయపడాలి మనకు" అన్నాడు శర్మ.

శాస్త్రి కృష్ణకు ఫోన్ చేశాడు.

"భాస్కరాచార్యులు చాలా పెద్ద ఎత్తే వేశాడు. ఆ నటరాజశిల్పం ఖరీదు పదిలక్షలు. రంగరాజు మంచి బేరం కోసం చూస్తున్నాడు. దానికోసం మేము కూడా ప్రయత్నిస్తున్నాం కానీ సాధించలేకపోతున్నాం" అన్నాడు కృష్ణ.

"అసలింతకీ ఈ రంగరాజెవడు?"

కృష్ణ టెలిఫోన్లో రంగరాజు చిరునామా చెప్పి "ఆ శిల్పం పురాతన కాలంది. ఫారిన్ కంపెనీ వాళ్లో కళ్ళు దాన్ని చూసి మోజుపడుతున్నారు. రంగరాజు ఎలాగో దాన్ని సంపాదించి తన ఇంట్లో దాచాడు. ఎక్కడ దాచాడో తెలియడం లేదు. ఆయన ఇంట్లో చాలా పటిష్టమైన ఏర్పాట్లున్నాయి. ఆ విగ్రహం జోలికి రాకుండా వుండడానికి రంగరాజు నాకు యాభై వేల రూపాయలు యిచ్చాడు" అన్నాడు.

"సరే-మా ప్రయత్నం మేము చేస్తాం" అన్నాడు శాస్త్రి.

## 18

"చిన్న సలహా. శిల్పం ఒకవేళ మీ చేతికి చిక్కితే అది వెంటనే భాస్కరాచార్యులకిచ్చేయకండి. నాకోసారి చెప్పండి" అన్నాడు కృష్ణ.

శాస్త్రి దానికి అవును, కాదు అని జవాబు చెప్ప కుండా "ఉంటాను మరి" అంటూ ఫోన్ పెట్టేశాడు.

ఫోన్‌లో సంభాషణ వివరాలు విన్నాక "ఇది చాలా కష్టమైన పనే అయ్యుంటుంది. లేకపోతే భాస్కరాచార్యులు మనకిది అప్పగించి వుండేవాడు కాదు" అన్నాడు శర్మ.

"ఇందులో మనకు పోయినదేముంది? కష్టపడి ప్రయత్నిద్దాం. శిల్పం దక్కిందా-చెరో పదివేలూ కాక భాస్కరాచార్యులు దగ్గర ఉద్యోగం-లేదా-తర్వాత ఆలోచిద్దాం!"

"అయితే ఒక పని చేద్దాం. రంగరాజు దగ్గర వ్యవహారాన్ని చాలా ఫ్రాంక్‌గా నడిపించేద్దాం" అన్నాడు శర్మ.

## 5

కాలింగ్ బెల్ మ్రోగించగానే ఒకాయన వచ్చి తలుపు తీశాడు.

"రంగరాజు కోసం వచ్చాం" అన్నాడు శర్మ.

"నేనే రంగరాజును" అన్నాడాయన.

"నమస్కారం" అన్నారు మిత్రులిద్దరూ.

"రండి-లోపలకు" అంటూ రంగరాజు వాళ్ళను పిలిచి లోపల కూర్చునే ఏర్పాట్లు చేశాడు-"ఇప్పుడు వివరంగా చెప్పండి!"

"నా పేరు శర్మ-వీడి పేరు శాస్త్రి. మేమిద్దరమూ స్నేహితులం. ఈ ప్రపంచంలో మాకు అసాధ్యమైనది లేదు" అన్నాడు శర్మ.

"అలాగా-మీకు నాతో ఏం పని?"

"మీ దగ్గర పదిలక్షలు విలువచేసే నటరాజశిల్పం ఒకటుంది. దాంతో మాకు పని పడింది" అన్నాడు శాస్త్రి.

"నా దగ్గర నటరాజ శిల్పముున్నది కానీ ధర తెలియదు. దాంతో మీకున్న పని ఏమిటి?" అన్నాడు రంగరాజు.

"భాస్కరాచార్యులు అనే ఆయనకు అది కావాలట. మేము సంపాదించి పెడతామని మాట యిచ్చాం" అన్నాడు శాస్త్రి.

"అలాగా" అని నవ్వాడు రంగరాజు.

"ఈ విషయంలో మీ సాయం కావాలి!"

"ఆ విగ్రహం తీసుకొచ్చి మీకివ్వాలా?" అన్నాడు రంగరాజు వెటకారంగా.

"మా మనసులోని మాటను చాలా బాగా చెప్పారు" అన్నాడు శర్మ.

"మీరు చాలా మూర్ఖులలా వున్నారు, నేనా శిల్పాన్ని తీసుకువచ్చి మీకిస్తానని ఎలా అనుకుంటున్నారు?" అన్నాడు రంగరాజు విసుగ్గా.

"అందువల్ల చాలా ప్రయోజనాలున్నాయి" అన్నాడు శాస్త్రి. "ఈ శిల్పాన్ని భాస్కరాచార్యులుకిస్తే ఆయన మమ్మల్ని తన అనుచరులుగా తీసుకుంటాడు. మీకు మేము స్నేహితులం. భాస్కరాచార్యుల అనుచరులు మీకు

స్నేహితులుగా వుండడం చాలా అదృష్టం కదా—
ఆలోచించుకోండి."

"ఆ అదృష్టం కావాలనుకుంటే నేనే స్వయంగా ఆ శిల్పం తీసుకువెళ్ళి ఆయనకిచ్చి వుండేవాణ్ణిగా-మధ్య మీరెందుకు?" అన్నాడు రంగరాజు.

"మీరా పని చేయలేరు. అందుకు మీకు కొన్ని హద్దులున్నాయి. మాకెలాంటి హద్దులూ లేవు. పైపెచ్చు మా తెలివితేటలు అధికం కూడా" అన్నాడు శాస్త్రి.

"అలాగా" అని రంగరాజు వెటకారంగా నవ్వాడు.

"అలా నవ్వకండి రాజుగారూ!" అన్నాడు శర్మ "మీకు గరుత్మంతుడి కథ తెలుసు కదా"

"తెలుసు కానీ-ఇప్పుడా ప్రసక్తి ఎందుకు?"

"గరుత్మంతుడు దేవతల దగ్గర అమృతం తీసుకొచ్చి పాములకిచ్చాడు. పాములా అమృతం తాగేలోగానే దేవతలు అమృతభాండాన్ని తీసుకుపోయారు. అలాగే మీరు కూడా దయతో మాకా శిల్పాన్నిప్పించండి. మేమది భాస్కరాచార్యుల కందజేస్తాం- ఆయన అది ఎలా దాచాడో ఎక్కడ దాచాడో మీకు చెబుతాం. మీరప్పుడది తీసుకుపోవచ్చు. ఆ విధంగా మీ కార్యమూ మా కార్యమూ కూడా సిద్ధిస్తుంది."

రంగరాజు ఆలోచనలోపడ్డాడు. భాస్కరాచార్యులు ఆయనకూడా ఎన్నో విషయాల్లో అడ్డు తగులుతున్నాడు. ఆ సమస్యకు పరిష్కారం దొరక్క కొట్టుకు చస్తున్నాడు తను. అయితే వీళ్ళను తను నమ్మవచ్చా? శిల్పం కొట్టేయడానికి భాస్కరాచార్యులు పన్నిన పన్నాగమేమో ఇది!

రంగరాజు అనుమానాలను శాస్త్రి కొంత వరకూ చదవగలిగాడు "మా గురించి మీకేమైనా అపనమ్మకా

లుంటే శారదా హోటల్ ప్రొప్రయిటర్ కృష్ణకు ఫోన్ చేయండి!"

రంగరాజు వెంటనే కృష్ణకు ఫోన్ చేసాడు. కృష్ణ చెప్పిందాన్నిబట్టి శర్మ, శాస్త్రి భాస్కరాచార్యుల మనుషులు కాదని ఆయనకు అర్థమయింది. అయితే వీళ్ళు కృష్ణ మనుషులేమో!

కృష్ణ మనుషులైతే రంగరాజుకు భయంలేదు. వాళ్ళను సులభంగా మోసగించగలనన్న ధైర్యం ఆయనకు వుంది. ఆయనకు బాగా వున్న భయమల్లా భాస్కరాచార్యులు గురించే! ఒక పర్యాయం భాస్కరాచార్యులు చేతిలో పడిన శిల్పం మళ్లీ తనకు చేజిక్కుతుందా?

రంగరాజు ఆలోచిస్తూ కూర్చుంటే శర్మ, శాస్త్రి మాట్లాడకుండా ఆయనవంకే చూస్తున్నారు. ఆయన తప్పకుండా తమకు విగ్రహాన్నందివ్వగలడని వాళ్ళకు ఆశపుట్టింది. చెరో పదివేలూ అప్పుడే చేతచిక్కినట్లు వాళ్ళకళ్ళు ఆశతో మెరుస్తున్నాయి.

రంగరాజు బుర్రలోకి బ్రహ్మాండమైన అయిడియా వచ్చింది. ఆయన మిత్రులిద్దర్నీ కూర్చోమని లోపలకు వెళ్ళాడు. అక్కడ ఒక్క నిముషం తటపటాయించి గోడలోకి వున్న రహస్యపుటరను తీశాడు.

గోడలో అక్కడ అలాంటి అర వున్నట్లు వూహించడం చాలా కష్టం. ఆ అరలోంచి మిలమిల మెరిసే బంగారు నటరాజ శిల్పాన్ని తీశాడు. ఆ విగ్రహం సర్వాభరణభూషితమై అత్యంత సుందరంగానే కాక భారంగా కూడా వుంది. ఆ అరలోనే ఒక చిన్న వజ్రం కూడా వుంది. ఆ వజ్రాన్ని జాగ్రత్తగా విగ్రహంలో అనువైన చోట అతికించాడు రంగరాజు.

'ఇప్పుడీ విగ్రహం యెక్కడున్నా నాకు తెలుస్తుంది. భాస్కరాచార్యులు కీలకస్థానాలన్నీ నాకు తెలుస్తాయి. ఈ దెబ్బతో వాడి ఆటకట్టు అవుతుంది' అనుకున్నాడు రంగరాజు.

ఆయన ఆ అరను మూసివేసి విగ్రహంతో సహా శాస్త్రి, శర్మల దగ్గరకు వచ్చాడు. మిత్రులిద్దరూ ఆ విగ్రహాన్ని చూసి సంభ్రమించిపోయారు. అంత సులువుగా ఆ విగ్రహాన్ని తమకు ఇస్తున్నాడంటే రంగరాజు ఏదో మోసాన్ని తలపెట్టి వుంటాడనీ-బహుశా అది నకిలీదయుండవచ్చుననీ శాస్త్రి అభిప్రాయపడ్డాడు.

రంగరాజు, శాస్త్రికి విగ్రహాన్ని అందించి "ఇంత సులభంగా ఇది మీకు అందినట్లు భాస్కరాచార్యులకు చెప్పకండి. నా ఇంటికి వచ్చి నాకు స్పృహ తప్పించి ఇల్లంతా వెతికితే మాసినబట్టలు వేసే కొయ్యపెట్టెలో అడుగున దొరికినట్లు చెప్పండి!" అన్నాడు.

"మీకు చాలా కృతజ్ఞులం. ఈ శిల్పం మళ్లీ వెనక్కు సంపాదించుకునేందుకు సాయపడతాము" అన్నాడు శర్మ.

"ఆ ఇబ్బంది మీకు అక్కర్లేదు. అవన్నీ నేను చూసుకోగలను. ఎలాగొచ్చి అత్యాశకుపోయి తెలివితక్కువ పనులు చేశారా-చాలా చిన్నవయసులో మీకు నూరేళ్ళు నిండుతాయి."

శాస్త్రి, శర్మ ఆ విగ్రహాన్ని జాగ్రత్తగా ఒక అట్టపెట్టెలో పెట్టుకుని ఆ ఇంట్లోంచి బయట పడ్డారు. వాళ్ళు ఇల్లు కదలగానే రంగరాజు టెలిఫోన్ తిప్పాడు.

"హలో! సుందరమేనా మాట్లాడుతూంట. భాస్కరాచార్యుల్ని ట్రాప్ చేయడంకోసం చాలా పెద్ద రిస్కు తీసుకుంటున్నాను. నువ్వు ట్రాక్ 33ని ఫాలో అవు

తూండు. ఎంతో ముఖ్యమైన వస్తువుకు ట్రాన్స్మిటర్ అంటించాను. ట్రాప్ కెకెలో వచ్చే సిగ్నల్స్‌ను బట్టి వివరాలన్నీ తెలుస్తుంటాయి నీకు" అన్నాడు రంగరాజు.

## 6

భాస్కరాచార్యులు కళ్ళు మెరిశాయి. నటరాజ శిల్పాన్ని అందుకుని బాగా పరిశీలించి సంతృప్తిగా నిట్టూర్చి "శభాష్!" అన్నాడు.

"ఇది మేము ఎలా సాధించామంటే....?" అని శర్మ ఏదో చెప్పబోతూండగా భాస్కరాచార్యులు వారించి "మీరెలా సాధించారన్నది నాకు అనవసరం. నేను అడగను. మీరు చెప్పినా వినను. అలాగే నా పద్ధతులు కూడా మీరు అడిగినా చెప్పను. నాక్కావలసిందల్లా పని జరగడం. మీకు చెరో పదివేలూ ఇవ్వడమే కాదు' మిమ్మల్ని నా అనుచరులుగా చేసుకుంటున్నాను. మీకు నేనిచ్చే జీతం-ఇద్దరికీ కలిపి నెలకు నాలుగువేలు. నచ్చి బాటేనా?" అన్నాడు.

శర్మ ఉత్సాహంగా ఈలవేసి "ఇదంతా మా అదృష్టం!" అన్నాడు.

భాస్కరాచార్యులు అభిమానంగా శర్మవంక చూసి "ఎలా సాధించారో తెలియదు కానీ మీరు సాధించినది చాలా అద్భుతమైన కార్యం. మీరు నిజంగానే అసాధ్యుల్లాగున్నారు. మీకు నేను ఒక ముఖ్యమైన పని అప్పగించాలనుకుంటున్నాను" అన్నాడు.

"చెప్పండి!" అన్నాడు శాస్త్రి.

"చెప్తేముందు-ఒక చిన్నపని వుంది. అది పూర్తి చేసుకురండి" అంటూ భాస్కరాచార్యులు విగ్రహాన్ని తీవ్రంగా పరిశీలించి చూసి తనలో తను ఏదో గొణు

కున్నాడు. తర్వాత జేబులోంచి పెన్నులాంటి సాధనాన్ని తీసి విగ్రహమంతా నడిపించాడు. ఏం తెలిసిందో కానీ విగ్రహం నుంచి ఒక వజ్రంలాంటిదాన్ని పెకిలించి- అది తీసుకుని లోపలి గదిలోకి వెళ్ళి అయిదు నిమిషాల్లో తిరిగి వచ్చాడు.

"భాస్కరాచారులుతో వ్యవహారం కత్తిమీద సాము లాంటిది. నేను చెప్పినపని చెప్పినట్లు చేయాలి. అలా జరక్కపోతే ప్రమాదం. నాకు అనుచరులైన వాళ్ళు మరొకరితో చేతులు కలిపితే పులినోట్లో దూరినట్టే లెక్క. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకుని నేను చెప్పిన పని చేయండి" అని ఆ వజ్రాన్ని వాళ్ళ చేతికిచ్చి "దీన్ని ఏదో విధంగా కృష్ణ ఉండే గదికి చేర్చండి. ఆ విషయం అతడికి తెలియకూడదు" అన్నాడు.

శాస్త్రి, శర్మ ఆ వజ్రాన్ని అందుకుని "ఇదేమిటి?" అన్నారు ఆశ్చర్యంగా.

"ఇది రంగరాజు తీసుకున్న జాగ్రత్త. అతడీ భాస్కరాచార్యుల్ని చాలా తక్కువ అంచనా వేశాడు" అని నవ్వాడు భాస్కరాచార్యులు.

మిత్రులిద్దరూ కొంతవరకూ విషయాన్నూహించగలిగారు. రంగరాజు విగ్రహాన్ని దానిమూవ్‌మెంట్సునూ ట్రేస్ చేయడానికి ఏదో ఏర్పాటు చేసుకున్నాడు. అది భాస్కరాచార్యులు గ్రహించి దానిని కృష్ణకు అంటగట్టి, రంగరాజును తప్పుదారి పట్టించనున్నాడు.

ఇప్పుడు తానేం చేయాలి? అసలు విషయం కృష్ణకు చెప్పాలా? చెప్పకుండా భాస్కరాచార్యులకు సహకరించాలా?

వజ్రంతో సహా ఇద్దరూ హోటల్‌కు వెళ్లారు. కృష్ణను పలకరించేముందు యిద్దరూ యేం చేయాలో చర్చించుకున్నారు. "ఇంతకూ మనం ఎవరికి అనుచరులం? కృష్ణకా భాస్కరాచార్యులకా, రంగరాజుకా? భవిష్యత్తులో మనం ఏం చేయబోతున్నాం?" అన్న విషయం యెంత ఆలోచించినా వారికి తెగలేదు.

"మనమిప్పుడు తెగిన గాలిపటాలవంటి వారం. ఎటు పోతున్నామో మనకు తెలియదు. ప్రస్తుతానికి బాగా డబ్బులు కిడుతున్నాయి. ఈ పరిస్థితి ఎక్కువకాలం కొనసాగనివ్వడం మంచిదికాదు. రెండు ప్రమాదకరమయిన ముఠాలమధ్య పనిచేస్తూ ఇద్దరికీ మిత్రులుగా ఉండాలనుకోవడంవల్ల సాధించే ప్రయోజనం—ఇద్దరికీ శత్రువులుగా కావడం మాత్రమే!" అన్నాడు శాస్త్రి. అతడి బుర్రలో భాస్కరాచార్యులు హెచ్చరిక మెదుల్తోంది.

కృష్ణ వీళ్ళనుచూసి, "ఏమిటిలా డైరెక్టుగా వచ్చేశారు? ఇది మీకూ నాకూ కూడా మంచిదికాదు—" అన్నాడు.

"లేదు. చిన్న పనుండి వచ్చాము. పైకి వెడదాం—" అన్నాడు శర్మ.

ముగ్గురూ పైకి వెళ్ళారు.

"మేమిప్పుడు భాస్కరాచార్యులు అనుచరులం. ఆయన కోరిన నటరాజ శిల్పాన్ని సాధించుకు వచ్చాం. అయితే నువ్వు కోరినట్లుగా అది నీ కందజేయలేదు. తిన్నగా భాస్కరాచార్యులకే ఇచ్చాం. ఆయన మమ్మల్ని మెచ్చి ఈ వజ్రాన్నిచ్చాడు. మాకు ఐదువేలు యిస్తే యిది నీ కిచ్చేస్తాం." అన్నాడు శర్మ.

కృష్ణ ఆ వజ్రాన్నందుకొని "ఇది భాస్కరాచార్యులిచ్చిన వజ్రం కాబట్టి, అమూల్యమైనదిగానే భావించాలి. మీరు కోరిన అయిదు వేలూ ఇవ్వడానికి నా శక్యం తరము లేదు కానీ ఎంతో ఖరీదయిన ఆ నటరాజ శిల్పాన్ని మీరెలా సంపాదించగలిగారు?" అన్నాడు.

"మా పద్ధతులు మాకున్నాయి. అయినా భాస్కరాచార్యులికి మిమ్మల్ని అనుచరులుగా చేయాలని చాలమంది సరదా పడుతున్నారు" అన్నాడు శాస్త్రి.

"రంగరాజు దగ్గర్నుంచి ఆ విగ్రహాన్ని హేమాహేమీలే సంపాదించలేక పోయారు. అలాంటిది మీరు అతి స్వల్పకాలంలో అది సాధించగలిగారంటే నిజంగా మీరు హేమాహేమీలై వుండాలి. మిమ్మల్ని చూస్తూంటే నాకు భయంగాకూడా వుంది. రంగరాజు మిమ్మల్ని మోసం చేశాడనుకోవాలన్నా భాస్కరాచార్యులు అంత సులువుగా మోసపోయే రకం కాదుగదా! అంతా మిస్టరీగా వుంది" అన్నాడు కృష్ణ.

"మరి మేము సెలవు తీసుకోవచ్చా?"—అన్నాడు శర్మ.

"మీరు భాస్కరాచార్యులు అనుచరులయితే మాత్రం నాకిచ్చిన వాగ్దానం మరచిపోకూడదు" అన్నాడు కృష్ణ.

## 7

"ఎవర్నువ్వు?" అన్నాడు కృష్ణ.

"రంగరాజు తెలుసుగదా నీకు" అన్నాడా వ్యక్తి.

తెలుసునన్నట్టుగా తలాడించాడు కృష్ణ.

"ఆ రంగరాజు వంటిమీద దోమ వాలితే దాన్ని వెలికి పట్టుకుని నలిపి చంపేస్తాను."

"అయితే రంగరాజు వంటిమీద వాలినదోమ యేద యినా ఈ గదిలోకి వచ్చిందా? నా గదిలో దోమలు బ్రతకవు. ఎవరూ చంపకుండా వాటంతటవే చస్తాయి" అన్నాడు కృష్ణ.

"ఇక్కడ దోమ లేదుకానీ రంగరాజు ప్రాణప్రదంగా చూసుకొనే నటరాజ శిల్పం వుంది. అదిచ్చేస్తే నేను వెళ్ళిపోతాను."

"ఇవ్వకపోతే వెళ్ళవా?" అన్నాడు కృష్ణ.

"వెళ్ళను...."

"ఫూల్—కృష్ణ అంటే ఎవరనుకున్నావ్?" కృష్ణ అన్నాడు కోపంగా.

"నేను రంగరాజు గురించితప్ప ఇతరుల గురించి ఆలోచించను. కానీ నా సంగతి నువ్వు తెలుసుకోడం చాలా మంచిది. నా చేతికి ఇనుపగుండు ఇస్తే పిడికిలితో నొక్కి పిండి చేయగలను" అన్నాడా వ్యక్తి.

కృష్ణ నవ్వి "చాలామందికి చాలా శక్తులుంటాయి. అన్నీ అందరికీ వుపయోగించవు. నాకయితే గుండును పిండిచేసేవారుకాక, పిండిని గుండుచేసేవారితో పనుంది" అన్నాడు.

"నీ పనితో నాకు నిమిత్తం లేదు. నా పని నాదే. అర్జంటుగా నటరాజ శిల్పం నాకిచ్చి నీ ప్రాణాలు రక్షించుకో" అన్నాడు.

"ప్రాణాలు రక్షించుకోవడం కోసం నటరాజశిల్పం నీ చేతిలో పెడితే నేను చచ్చినవాడి కిందే లెక్క. అంచేత అలాంటి బెదిరింపులు నాకొద్దు" అన్నాడు కృష్ణ.

"శిల్పం ఇయ్యవా?" అన్నాడా వ్యక్తి. అంటూనే అతడు జేబులోంచి పెన్ టార్చిలాంటిదిది తీశాడు "ఇదేమిటో తెలుసా?"

"తెలియదు."

"అయితే చూడు" అంటూ ఆ వ్యక్తి ఆ పెన్‌టార్చ్‌ని బల్లమీదకు ప్రసరింపజేశాడు. అతడు స్విచ్ నొక్కగానే సన్నని కాంతిరేఖ బల్లమీద ప్రసరించింది. అతడు టార్చ్‌ని కదుపుతూంటే ఆ కాంతిరేఖ కదులుతోంది. కాంతిరేఖ ప్రసరించినంత మేరా బల్ల రంపంతో కోసినట్లు, అయిపోయింది.

"ఇలాంటిదేదో సినిమాలో చూసినట్లు గుర్తు!" అన్నాడు కృష్ణ భయాన్ని దాచుకుంటూ.

"కానీ ఇది సినిమా కాదు. నేనడిగినదివ్వకపోతే ఇలాగే బల్లను కాకుండా మనిషిని చీరేస్తాను" అన్నాడా వ్యక్తి.

కృష్ణ ఆ మనిషి ముఖంలోకి చూశాడు. అన్నమాట అక్షరాలా పాటించే వ్యక్తిలా కనిపించాడు వాడు. అప్పటికతను పొగరు వదిలిపెట్టి "నావద్ద శిల్పంలేదు. దాని గురించి నాకు తెలియనే తెలియదు" అన్నాడు.

"శిల్పం నీ వద్దనే వుంది. తిరుగులేని సమాచారం ఇది" అన్నాడు ఆ వ్యక్తి.

"ఏమిటా తిరుగులేని సమాచారం?" అన్నాడు కృష్ణ.

"నువ్వలా చూస్తూవుండు. నేను విగ్రహాన్ని చూపిస్తాను" అన్నాడు ఆ వ్యక్తి. అతను నెమ్మదిగా అక్కడున్న బల్ల సొరుగు లాగాడు. అందులో మిలమిల మెరుస్తూన్న వజ్రాన్ని వెలికి తీసి నిశ్చేష్టుడైపోయాడు.

చిత్రంగా కృష్ణవంక చూస్తూ "దీని రహస్యం నీకెలా తెలిసింది?" అన్నాడు.

"శాస్త్రి, శర్మ అనే యిద్దరు మిత్రులు నాకిచ్చారు దీన్ని. అయిదువేలిచ్చి కొన్నాను. దీనిలో ప్రత్యేకత యేమిటో నేను తెలుసుకోవచ్చా?" అన్నాడు కృష్ణ.

ఆ వ్యక్తి ఆ వజ్రాన్ని జేబులో వేసుకుని "అయితే అయిదువేలు నష్టపోయావు నువ్వు. ఇది రంగరాజు ట్రాప్ నెంబర్ 33. ఇదెక్కడున్నా నాకు తెలిసిపోతుంది. అయితే దీన్ని నటరాజ శిల్పానికి అతికించాడు రంగరాజు. ఇది విడిగా నీ దగ్గర కెలావచ్చిందో అర్థంకావడంలేదు. నువ్వే విషయం తెలుసుకుని విగ్రహాన్ని, వజ్రాన్ని వేరు చేశావా?" అన్నాడు.

"విగ్రహం భాస్కరాచార్యులవద్ద వుంది. అతడి అనుచరులిగ అమ్మారు" అన్నాడు కృష్ణ.

"వాళ్ళ అడ్రసు చెప్పగలవా?" అన్నాడా వ్యక్తి.

కృష్ణ చెప్పాడు. ఆ వ్యక్తి అదోలా నవ్వి "నా దగ్గరున్న పెన్ టార్చి తెలుసుగా. నిన్ను క్రూరంగా వళ్ళు చీరేయగలను. నీ మాటలు నిజమని నమ్మి వెడుతున్నాను" అని అక్కణ్నించి కదిలాడు.

# 8

"ఎవరు?" అంటూ లేచివెళ్ళి తలుపు తీశాడు శర్మ. సుడిగాలిలా లోపలికి దూసుకు వచ్చిన ఆ వ్యక్తి "నా పేరు సుందరం. నేను చాలా ప్రమాదకరమైన వ్యక్తిని. నన్నాట్టే విసిగించకుండా నటరాజశిల్పం గురించిన వివరాలు నాకు చెప్పండి."

"నటరాజ శిల్పమా? అదేమిటి?" అన్నాడు శర్మ.

"అలాంటి ప్రశ్నలేవీ వద్దు" అన్నాడు సుందరం.

శర్మ చటుక్కున సుందరం రెండు భుజాలమీదా కొట్టాడు. సుందరం నిలువునా నేల కూలాడు "ఇప్పుడు చెప్పు-ఏమిటి కథ!" అన్నాడు శర్మ.

సుందరం నెమ్మదిగా లేచి నిలబడి జేబులోంచి పెన్ టార్చి తీసి "ఇది ఆన్ చేశానంటే నిలువునా దహించి వేస్తుంది-జాగ్రత్త!" అంటూ దాని ప్రభావాన్ని సోదాహరణంగా నిరూపించాడు ఓ బల్ల పెన.

శర్మ వెనక్కు తగ్గి "నాకు నటరాజ శిల్పం గురించి ఏమీ తెలియదు.అది రంగరాజే నాకు ఇస్తే నేను భాస్కరాచార్యులికిచ్చాను" అన్నాడు.

సుందరం వివరాలు అడిగి తెలుసుకున్నాడు. వాళ్ళు చెప్పినది నిజమేనని అతడికి తోచింది. "అయితే నటరాజ శిల్పం మీంచి ఆ వజ్రాన్ని తొలగించి కృష్ణకు యెందుకిచ్చావ్? అందువల్లనే నేను తప్పుదారి పట్టాను" అన్నాడు సుందరం.

"మాకేమీ తెలీదు. భాస్కరాచార్యులు శిల్పంమీంచి తనే స్వయంగాతీసి మాకో వజ్రాన్ని బహూకరించాడు. అది మాకెందుకు? కృష్ణకు అయిదు వేలకు అమ్మాం అంతే!" అన్నాడు శర్మ.

"సరే-అయితే మీ సమాచారంలో ఏదైనా తప్పున్నదంటే నేను ఈ పెన్‌టార్చి వుపయోగించి నిన్ను నిలువునా చీరేస్తాను. ప్రస్తుతానికి వస్తాను. భాస్కరాచార్యులికి మూడింది" అంటూ అక్కణ్నించి కదిలాడు సుందరం. సుందరం వెళ్ళగానే మంచం అడుగునించి లేచి శాస్త్రి వచ్చి "ఇప్పుడు మన మెక్కడున్నామంటావ్?" అన్నాడు.

"మహాసముద్రం మధ్యలో!" అన్నాడు శర్మ.

వాళ్ళకి ఏం చేయాలో తోచడంలేదు. ఇద్దరికీ ఆ తర్వాత నిద్రపట్టలేదు. చాలా సులభంగా కొందరు పెద్ద వాళ్ళను బోల్తా కొట్టించగలిగారు. అందుకు కారణం తమ తెలివి తేటలో, పరిస్థితులో లేక ఆ పెద్దవాళ్ళు తమను చదరంగంలో పావులుగా వాడుకుంటున్నారో అర్థం కావడంలేదు.

మర్నాడుదయం యిద్దరూ త్వరగా తెమిలి భాస్కరా చార్యులు దగ్గరకు వెళ్ళి "తమరు చెప్పిన పని పూర్తి చేశాం" అన్నారు.

"మీ మకాం ఎక్కడ?"

"హోటల్లో!" అన్నాడు శాస్త్రి.

"మీ వల్ల నాకు చాలా వుపకారాలు జరిగాయి. అపూర్వమైన శిల్పంతో పాటు ఎన్నో లాభాలు జరుగుతున్నాయి. మీ సామర్థ్యం పైన నాకు నమ్మకం కుదిరింది. మీకు చాలా ముఖ్యమైన పని చెప్పబోతున్నాను. రెండు రోజులు విశ్రాంతి తీసుకోండి" అన్నాడు భాస్కరా చార్యులు.

"ఏం పని చేయాలి?" అన్నాడు శర్మ.

"ఒక స్పెషల్ ఫయిలు మరో ఊళ్ళోని నా మనిషికి అందజేయాలి" అన్నాడు భాస్కరాచార్యులు యేదో ఆలోచిస్తూ.

"అందుకు రెండురోజులు విశ్రాంతి ఎందుకు?" అన్నాడు శర్మ.

"ఈ పని మీరనుకున్నంత సులభమైనది కాదు. బాగా ఆలోచించి పథకం వేసుకోవాలి. ఈ ఫయిలు కాజేయాలని యెందరో చూస్తుంటారు. మీ చేతు ఊరు చేరేలోగా దాన్ని కాజేయడానికి శతకోటి ప్రయత్నాలు జరుగు

తాయి. అవన్నీ గడిచి నా మనిషికి మీరా రా ఘయిలు అందించ గలిగితే మీ చేత యింకో ఊళ్ళో నా బ్రాంచి ఓపెన్ చేయిస్తాను. జీతం నెలకు అయిదు వేలుంటుంది" అన్నాడు భాస్కరాచార్యులు.

"ఆ పని యిప్పుడే చెప్పండి-ఫరవాలేదు" అన్నాడు శర్మ.

"లేదు. రెండురోజుల విశ్రాంతి ఈ పనికి ఎంతైనా అవసరం" అన్నాడు భాస్కరాచార్యులు ఖచ్చితంగా.

"మేము క్షణాల మీద ఎంతో విలువైన నటరాజ శిల్పాన్ని కాజేసుకువచ్చాము. మాకీ పని ఒక లెక్కలోనిది కాదు" అన్నాడు శాస్త్రి.

"అప్పుడు మీకు పరిస్థితులు కలిసొచ్చాయి. అదే మీ సామర్థ్యమనుకుని విర్రవీగారంటే ముందుముందు చాలా ఇబ్బందులుంటాయి. నా అనుచరులకు గర్వముండడం సహించను నేను. ఆత్మవిశ్వాసం మంచిదే కానీ అహంకారం మంచిదికాదు. రంగరాజు కావాలని ఆ విగ్రహాన్ని మీ చేతిలో పెట్టాడు. తద్వారా నా కార్యకలాపాలు ట్రాక్ చేయాలనుకుని పప్పులో కాలేశాడు. మీ మీద కూడా అతడికి చాలా ఆశలున్నాయి. మీరు చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి" అన్నాడు భాస్కరాచార్యులు.

"అవును. రాత్రి రంగరాజు మనిషి నటరాజ శిల్పం కోసం మా గదికి వచ్చి బెదిరించాడు. అది మీ వద్దనే ఉన్నదని చెప్పి తప్పించుకున్నాం. మిమ్మల్ని సమీపించే సాహసం వాడికుందని నేను అనుకోను—" అన్నాడు శాస్త్రి.

"వాడికి సాహసమైతే వుందికానీ—నన్ను తప్పించుకొనే తెలివితేటలు లేవు...." అంటూ భాస్కరాచా

ర్యులు డ్రాయర్ సొరుగు తెరిచి, "మీకింక వాడి భయం లేదు. వాడి కోరలు పీకేశాను" అంటూ సొరుగులోంచి ఒక పెన్ టార్చి తీశాడు.

దాన్ని చూస్తూనే మిత్రులిద్దరూ తెల్లబోయారు. రాత్రి శర్మను సుందరం అదే టార్చితో బెదిరించాడు.

"మీకేం అనుమానం అవసరంలేదు. ఇది సుందరం వస్తువే! ఇలాంటిది ఇండియా మొత్తంమీద ఒక్కటే వుంది. నిన్నటిదాకా సుందరం దగ్గర—ఆ తర్వాతనుంచి నా దగ్గర!" అంటూ భాస్కరాచార్యులు దాని ప్రభావాన్ని పక్కనున్న బల్లపై చూపించాడు.

"ఈ భాస్కరాచార్యులు చాలా ప్రమాదకరమయిన మనిషి!" అనుకున్నారు మిత్రులిద్దరూ.

# 9

కృష్ణ, రంగరాజు, శర్మ, శాస్త్రి ఆ గదిలో తలో కుర్చీలో కూర్చుని వున్నారు.

"ఇన్నాళ్ళకు మనిద్దరం చేతులు కలిపాము" అన్నాడు కృష్ణ ఆనందంగా.

"భాస్కరాచార్యులు సంగతి మనకు చాలా ఆలశ్యంగా తెలిసింది. లేకపోతే ఎప్పుడో చేతులు కలిపి వుండేవాళ్ళం. తెలివితక్కువగా మనలో మనం పోటీపడి ఆ భాస్కరాచార్యులుకు సహకరిస్తున్నాం. మన కారణంగానే వాడు విర్రవీగిపోతున్నాడు" అన్నాడు రంగరాజు.

"ఏమిటి వాడి విశేషం?" అన్నాడు కృష్ణ.

"వాడు పోలీసుల మనిషని నా అనుమానం" రంగరాజు అన్నాడు.

అక్కడున్న మిగతా ముగ్గురూ ఉలిక్కిపడ్డారు.

"అవును. వాడు పోలీసుల మనిషికాబట్టే అన్ని పనులూ వాడికి అవలీలగా అయిపోతున్నాయి. స్మగ్లింగ్ పేరిట మనపోటీవాళ్ళ రహస్యాలన్నీ తెలుసుకుంటున్నాడు. పోటీ పేరిట మన వ్యాపారాన్ని పడగొడుతున్నాడు. మనని పట్టివ్వటంలేదు కానీ మన అక్రమవ్యాపారాలను అరికడుతున్నాడు. తను ఏమీ చేయకుండా ఏదో చేస్తున్నట్లు నటిస్తున్నాడు" అన్నాడు రంగరాజు.

"నిజమేనంటావా?" అన్నాడు కృష్ణ అనుమానంగా, భయంగా.

"ఇవన్నీ నా అనుమానాలు. వీటిలోని నిజానిజాలు తెలుసుకుంగుకు ఆ స్పెషల్ ఫైలుపయోగపడుతుంది. ఆ ఫైలు సాధించగలిగితే వాడి రహస్యాలన్నీ బయట పడతాయి. ఈ విషయంలో మనకీ శర్మ, శాస్త్రి ఉపయోగపడతారు" అన్నాడు రంగరాజు.

"ఏ విధంగా?" అన్నాడు శర్మ.

"భాస్కరాచార్యులు ఆ ఫైలు మీ కివ్వడమేమిటి దాన్ని వెంటనే మీరు మాకివ్వాలి. దాంతో అన్ని సమస్యలూ పరిష్కరించబడతాయి" అన్నాడు రంగరాజు.

"భాస్కరాచార్యులు స్పెషల్ ఫైల్ సంపాదించడం సామాన్యమైన విషయంకాదు కానీ ఆయన పోలీసుల మనిషేనన్న విషయం నాకిప్పుడు ధృవపడుతోంది—" అన్నాడు కృష్ణ.

"ఎలా?" అన్నాడు రంగరాజు.

"ఆయన దగ్గర్నుంచి స్పెషల్ ఫైల్ కదిలినప్పుడల్లా కొంతమంది నేరస్తులు పట్టుబడుతూ వచ్చారు. ఆయన తన స్పెషల్ ఫైల్ పంపడానికి ఒకోసారి ఒకో పద్ధతి

ఎన్నుకుంటూంటాడు. ఈ సారికి ఈ శాస్త్రి, శర్మలను వెతుక్కున్నా డన్నమాట!" అన్నాడు కృష్ణ.

"అదే మన అదృష్టం!" అన్నాడు రంగరాజు. "నేను నటరాజ శిల్పం విషయంలో ఊరికే రిస్కు తీసుకోలేను. ఇలాంటి అవకాశమేదో వస్తుందనే నా ఆశ. ఆ ఫైలు ఏదో విధంగా మీరిద్దరూ మాకు చేర్చాలి."

"మా ప్రయత్నం మేం చేస్తాం. కాని భాస్కరాచార్యులంటే మాకు చాలా భయంగావుంది. ఏదయినా పొరపాటు జరిగితే మీ సుందరంలా మాయమైపోతామేమో!" అన్నాడు శర్మ.

సుందరం పేరు వినగానే రంగరాజు ముఖం అదోలా గయిపోయింది. "నా సుందరం చచ్చిపోడు. యేదో రోజున బయటకువచ్చి అంతకు అంత ప్రతీకారం తీర్చుకుంటాడు. మీరు మాత్రం స్పెషల్ ఫైలు నాకు అందజేయాలి."

"ఇంతవరకూ మేమా ఫైలు ఎక్కడ అందజేయాలో తెలియదు. మీకు మేము ఎలా సాయపడగలమో అర్థం కావడంలేదు" అన్నాడు శాస్త్రి.

"ఉపాయముంది" అన్నాడు రంగరాజు. "మీకా స్పెషల్ ఫైలు అందాక భాస్కరాచార్యులు మిమ్మల్నో కంట కనిపెట్టే వుంటాడు. అందువల్ల ఈవ్రాళ్లో మమ్మల్ని కలుసుకోనే అవకాశం మీకిక ఉండదు. అయితే భాస్కరాచార్యులు ఎదురుగానే మీరా విషయాన్ని నాకు తెలిపే అవకాశమున్నది" అంటూ రంగరాజు తన జేబులోంచి ఒక నోట్ బుక్కూ, బాల్ పెన్నూ తీసి శర్మకు అందించి "ఇవి చూస్తూంటే మీకు ఎలాగుంది?" అన్నాడు.

మిత్రులిద్దరూ పరీక్షించి చూశారు వాటిని. అందులో వారికి ఏ విశేషమూ కనిపించలేదు.

"గుడ్!" అన్నాడు రంగరాజు. "నా వద్ద ఇటువంటి విచిత్ర వస్తువులు చాలా ఉన్నాయి. మీలో యెవరో ఒకరు ఈ నోట్ బుక్కులో ఈ బాల్ పెన్నుతో ఏదైనా వ్రాస్తే అది టెలిగ్రాఫిక్ సందేశంగా నా ఇంటికి చేరుతుంది. భాస్కరాచార్యులు చెప్పినప్పుడు మీరు ఆ వూరి పేరు నోట్ చేసుకుంటున్నట్లుగా ఇందులో రాయండి."

శాస్త్రి, శర్మ ఆశ్చర్యంతో కళ్ళు తేలవేశారు.

"ఈసారి భాస్కరాచార్యులు స్పెషల్ ఫైలు మన చేతికి చిక్కక తప్పదు" అన్నాడు కృష్ణ ఉత్సాహంగా.

"ఊరి పేరు చెబుతాం కానీ ఆ తర్వాత ఆ ఫైలు మీరెలా అందుకుంటారు? మాకైతే మేమువచ్చి దాన్ని మీకు అందివ్వం" అన్నాడు శర్మ.

"ఊరి పేరు చెబితే మిగతా సంగతులు మేము చూసుకుంటాం" అన్నాడు రంగరాజు.

# 10

చిన్న బ్రీఫ్ కేసు శర్మకు అందించి—"ఇందులో వున్నది స్పెషల్ ఫైలు. దీని తాళం తీయడం నా మనిషికి తప్ప సాధ్యంకాదు. ఇతరులెవ్వరయినా దీన్ని బలవంతంగా తెరవడానికి ప్రయత్నిస్తే చిన్న బాంబు పేలి—పెట్టె, మనిషికూడా పేలిపోతారు. అలా జరగడం నా కిష్టముండదు. ఎందుకంటే ఎంతో కష్టపడి సేకరించిన సమాచారముందీ ఫయిల్లో" అన్నాడు భాస్కరాచార్యులు.

"అయితే ఏ బాధా లేదు" అన్నాడు శాస్త్రి.

"అలా తేలిగ్గా మాట్లాడవద్దు. ఈ ఫయిల్ కోసం త్రిమూర్తి అన్నవాడు ప్రయత్నిస్తున్నాడు. ఇంతవరకూ

ఈ ఊర్నించి నేను ఆయిగుసార్లు స్పెషల్ ఫయిలుపంపేను. రెండుసార్లు అది త్రిమూర్తికి చిక్కింది. వాడెప్పుడు ఎక్కణ్నించి వస్తాడో తెలియదు. డేగలా యెగరేసుకు పోతాడు" అన్నాడు భాస్కరాచార్యులు.

"నాకు అటువంటి భయంలేదు. డేగల్ని వేటాడు తాను" అన్నాడు శర్మ.

"ఈ బ్రీఫ్‌కేసు త్రిమూర్తి చేతిలో పడితే మాత్రము వేటాడేవంతు నాది. ఇంతవరకూ ఇద్దరు ఘోరమయిన చావు చచ్చారు" అన్నాడు భాస్కరాచార్యులు.

"అంతే?"

"ఓ, అంబాసిడార్ కారూ, చాకులాంటి డ్రయివరూ మీ అధీనంలో వుంటారు. క్షేమంగా నేను చెప్పినచోట ఆ బ్రీఫ్‌కేసును అందజేయాలి. ఈ పని మీవల్లకాక పోయిందా—ఇక మీరుండరు. అంతే!" అన్నాడు భాస్కరాచార్యులు.

తర్వాత భాస్కరాచార్యులు ఫయిలు చేరవలసిన ఊరి పేరూ, ఇంటి అడ్రసూ చెప్పాడు. శర్మ తనజేబులోంచి నోట్‌బుక్ తీసి ఆ వివరాలు నోట్ చేసుకున్నాడు.

భాస్కరాచార్యులు అనుమానంగా శర్మవంక చూసి, "మీకోసం రంగరాజు, కృష్ణ యెదురుచూస్తుంటారని నాకు తెలుసు. ఈ కాగితాన్ని బహుశా ఏదో సంకేత స్థలంలో జారవిడిచి వాళ్ళకు సహకరించాలనుకుంటున్నారేమో, అదేం సాగనివ్వను" అంటూ ఆ పుస్తకాన్నీ, పెన్ననూ తీసుకుని తనదగ్గర వుంచుకున్నాడు.

"మీకు మాపైన నమ్మకమున్నట్లులేదు. అలాంటప్పుడు ఎంతో రహస్యమైన ఈ పని మాకెందుకు అప్పజెబుతున్నారు?" అన్నాడు.

"మీలో సునురత వుంది. ఆ త్రిమూర్తి గాణ్ని ఎదు ర్కోవడం మీ కే చేతనౌను. కానీ మీకింకా సిరచి త్తం లేదు. మనసు చలించకుండా కొన్ని కట్టుదిట్టాలు చేస్తు న్నాను. అదీ సంగతి!" అన్నాడు భాస్కరాచార్యులు.

ఇప్పుడు శర్మ దగ్గరగానీ, శాస్త్రి దగ్గరనునీ ఒక్క కాగితం లేదు. పెన్ను లేదు. అంతవరకు సంపాదించుకొన్న డబ్బుమాత్రం వుంది.

భాస్కరాచార్యులు వాళ్ళకు కారు డ్రయివర్ని పరి చయంచేసి "వీడో పెద్ద కరాటే ఎక్స్పర్టు. త్రిమూర్తి నెదుర్కోనేందుకు మీకూ్కడా వీడు సాయపడతాడు. అయితే త్రిమూర్తిని తరిమేబాధ్యత వీడిదికాదు, మీదే. మీ ప్రయత్నంలో ఏ మాత్రం ఫెయిలయినప్పటికీ— మిమ్మల్ని దారుణంగా వేటాడుతాను" అన్నాడు.

భాస్కరాచార్యులు అదేపనిగా హెచ్చరించడం చూసి శర్మకూ, శాస్త్రికీ త్రిమూర్తి గురించి భయం వేసింది. ఈ భాస్కరాచార్యులు చాలా తెలివైన వాడి లాగున్నాడు. అటువంటి వాడివద్దనే రెండు పర్యాయాలు స్పెషల్ ఫయిల్ సంపాదించాడంటే వాడు ఇంకా అఖండుడై వుండాలి.

మిత్రులిద్దరి బుర్రల్లోనూ ఒకరకమైన సంతృప్తీ, అసం తృప్తీ కదలాడుతున్నాయి. తామెక్కడికి వెడుతున్నదీ సమాచారం రంగరాజుకు అందింది. ఈ పాటికి అతడి మనుషులు ఆ యిల్లు చేరే ప్రయత్నంలో వుండివుంటారు. ఇకమీదట తమకు రంగరాజుతో మాట్లాడే అవకాశం లేదు. ఇప్పుడు తామేం చేయాలి? త్రిమూర్తి బారినుంచి తప్పించుకున్నాక ఆ ఫయిలు రంగరాజుకు అందజేస్తే భాస్కరాచార్యులు తమను వేటాడక మానడుకదా!

ఇంతవరకూ జరిగిందాన్నిబట్టి చూస్తూంటే రంగరాజు వద్ద సాక్ష్యాలున్నాయి కానీ భాస్కరాచార్యులతో పోలిస్తే అతడు చాలడనే అనిపిస్తోంది. అదీగాక భాస్కరాచార్యులు పోలీసుల మనిషన్న అనుమానమున్నది. నేరం చేసినా అది పోలీసుమనిషయితే ఫరవాలేదుగదా! భాస్కరాచార్యులుకు సాయపడడమే వుభయతారకంగా వుంటుందనిపిస్తోంది.

అయితే రంగరాజు తమను సులభంగా వదుల్తాడా? అతడి బారినుంచి ఎలా తప్పించుకోవాలి? రంగరాజు తమను వేటాడకుండా భాస్కరాచార్యులు కాపాడగలడా?

భాస్కరాచార్యులు మళ్ళీ ప్రారంభించాడు. "మీరు వెళ్ళవలసిన చోటుకు అందరికీ తెలిసినవి మూడుదారులు వున్నాయి. మీరుమాత్రం ఎవరికీ తెలియని చుట్టుదారిన వెడతారు. ఈ ఫయిలు ఈరోజు బయలదేరుతున్నట్టుచాలా మందికి తెలిసినట్టు నా అనుమానం. మీరు మాత్రమెంతో జాగ్రత్తగా వుండాలి."

శర్మ, శాస్త్రి, డ్రయివరు బ్రీఫ్ కేస్ తో సహా భాస్కరాచార్యులవద్ద సెలవు తీసుకున్నారు.

"శుభం. వెళ్ళండి" అన్నాడు భాస్కరాచార్యులు.

కారు బయల్దేరింది. నిజం చెప్పాలంటే అప్పుడు తామెక్కడున్నారో శర్మకూ, శాస్త్రికీ తెలియలేదు. పరిసరాలను గుర్తుపెట్టుకున్నారుగానీ అవేమిటో తెలుసుకోలేకపోయారు.

కారు శరవేగంతో దూసుకుపోతుంటే "స్పీడు చాలా ఎక్కువగా వుందనుకుంటాను" అన్నాడు శాస్త్రి.

"నేను కారు నడుపుతూంటే గమ్యస్థానం చేరేవరకూ

స్పీడు తగ్గదు, బ్రేకుపడదు" అన్నాడు డ్రైవర్ గొప్పగా. మరుక్షణంలోనే కీచుమని చప్పుడు చేస్తూ కారు ఆగింది.

"బ్రేకు వేసినట్లున్నావు?" అన్నాడు శర్మ.

"అవును. రోడ్డుకు అడ్డంగా రాళ్ళు...." అన్నాడు డ్రైవర్.

"వాటిమీంచే పోనియ్యవలసింది—" అన్న శర్మ సగంలో వాక్యాన్నాపేశాడు. రోడ్డుకడ్డంగావున్న రాళ్ళు యశ్ళలా కాక గోడలా వున్నాయి.

"రాళ్ళు మేమే తీసేస్తాంగాని-మీ దగ్గరున్న బ్రీఫ్ కేస్ ఇలాగివ్వండి" అన్న మాటలు వినిపించాయి. శర్మ తన చేతిలోని బ్రీఫ్ కేస్ బలంగా పట్టుకున్నాడు.

"ఎవరది?" అని అరిచాడు శాస్త్రి.

"నా పేరు త్రిమూర్తి!" అన్న మాటలు వినబడ్డాయి. శాస్త్రి చటుక్కున కారుడోరు తెరుచుకుని బయటకు వచ్చాడు.

అక్కడ ఒక మనిషి నిలబడి వున్నాడు. నల్లగా, బలంగా, యెత్తుగా వున్నాడు. వాడి చేతులో తుపాకీ వుంది.

"నాకు దయాదాక్షిణ్యాలు లేవు" అంటూ త్రిమూర్తి శాస్త్రిని గురిచూసి కాల్చాడు. శాస్త్రి కుప్పలా కూలి పోయాడు. అదే ఊపులో అతడు కారు డ్రైవర్నూ, శర్మనూ కాల్చి వాళ్ళిద్దరూ నేలకూలాక కారులోవున్న బ్రీఫ్ కేసు తీసుకుని అక్కడ నిలబడ్డ మరి నలుగురు మనుషులతో రాళ్ళు తొలగించమని చెప్పాడు. వాళ్ళు రాళ్ళు తీసేశాక ఆ అయిదుగురూ కలిసి అక్కణ్ణించి క్షణాల పైన మాయమైపోయారు.

తర్వాత అయిదునిముషాలకు శాస్త్రికి మెలకువ

వచ్చింది. నటుక్కున లేచి శర్మను కూడా లేపాడు. ఇద్దరూ వెంటనే బ్రీఫ్ కేస్ కోసం చూసుకున్నారు. అది కనబడలేదు. ఇద్దరికీ గుండెలు గుభేలుమన్నాయి. భాస్కరాచార్యుల హెచ్చరిక వాళ్ళ చెవుల్లో గింగురుమంటోంది.

"ఇప్పుడు మనను వేటాడేవాళ్ళు ఇద్దరు. అటు భాస్కరాచార్యులు. ఇటు రంగరాజు. కృష్ణతో చేతులు కలిపినట్లే రంగరాజు భాస్కరాచార్యులుతో కూడా చేతులు కలిపాడంటే మన పని ఇంతే సంగతులు" అన్నాడు శర్మ.

"ప్రస్తుతానికి ఒక్కటే వుపాయం కనబడుతోంది నాకు. ఆ స్పెషల్ ఫయిల్ మనక్కావలసిన యిద్దరికీ కాక మూడో వాడి పరమయింది. పలాయన మంత్రం పఠించడం మినహా మరో వుపాయం లేదు. కనీసం కొంత కాలమైనా ప్రాణాలు దక్కించుకోవడానికి ఈ ప్రదేశానికి వీలైనంత దూరంగా పారిపోదాం" అన్నాడు శాస్త్రి.

"ఇంక ఈ స్మగ్లింగ్ వ్యవహారాలూ అవీ వదిలిపెట్టి ఉన్న డబ్బుతో ఏదైనా వ్యాపారం ప్రారంభిద్దాం. దాంతో మనకు సుఖంగా గడిచిపోతోంది" అన్నాడు శర్మ.

"ఆ సంగతి తర్వాత ఆలోచిద్దాం. ఆ త్రిమూర్తిగాడు మనకు స్పృహపోగొట్టి పారిపోయాడు. అదృష్టవశాత్తు ఈ డ్రైవర్ గాడి కింకా స్పృహరాలేదు. త్వరగా పద" అన్నాడు శాస్త్రి.

ఇద్దరూ అక్కణ్నించి కనపడ్డ అడ్డదారిన పరుగు మొదలెట్టారు. కొంతదూరం అలా పరుగులెట్టి ఆగి ఆయాస పడుతూ కూర్చున్నారు.

"మనం అనవసరంగా అడ్డదారిపడుతున్నామేమో—

దగ్గర చాలా డబ్బుంది. కానీ మనుషులు యెక్కువగా సంచరించే ప్రాంతం చేరడం మంచిది" అన్నాడు శాస్త్రి.

"ప్రాణభయం సంగతి మరిచిపోయావా?" అన్నాడు శర్మ.

"లేదు. కానీ మనకు భాస్కరాచార్యుల్నించిగానీ, రంగరాజునించి గానీ భయపడవలసిన అవసరమేమీ లేదనిపిస్తోంది. ఫయిలు మన దగ్గర్నుంచి మరో త్రిమూర్తి కొట్టేసే మనమేం చేయగలం? ఈ విషయమే రంగరాజును అడగవచ్చు...." అన్నాడు శాస్త్రి.

"మరి భాస్కరాచార్యులు సంగతి!"

"స్పెషల్ ఫయిలు సరైనచోటుకి చేరడానికి ఆయన మనతోపాటు త్రిమూర్తిని కూడా ఎన్నుకున్నాడేమో ననిపిస్తోంది" అన్నాడు శాస్త్రి.

శర్మ ఆశ్చర్యంగా "అదెలా సాధ్యం?" అన్నాడు.

"మనకు పని అప్పజెప్పాడు భాస్కరాచార్యులు. మన గమ్యస్థానంవద్ద రంగరాజు మనుషులుంటారని ఆయనకు అనుమానముండవచ్చు. అందుకే త్రిమూర్తిని సృష్టించాడు. మన సమాచారం ఎప్పటికప్పుడు త్రిమూర్తికి అందజేస్తూ వచ్చాడు. మనం పారిపోవడం కోసమే ఆ డ్రైవర్ గాడు తనకు స్పృహలేనట్లు నటించాడేమోనని నా అనుమానం. ఆ భాస్కరాచార్యులు పోలీసుల మనిషే అయుంటాడు. అందుకే యెవరికీ ప్రాణహాని వాటిల్లకుండా జాగ్రత్తపడ్డాడు."

"మరి త్రిమూర్తి గురించి మనకు అంతలా యెందుకు హెచ్చరించాడు?"

"మన ఆలోచనలను తప్పుదారిని మళ్ళించడానికి___"

"అసలు నీకీ అనుమానమెలా వచ్చింది?"

"ఇదివరలో బ్రీఫ్ కేసు రెండుసార్లు త్రిమూర్తి పట్టుకెళ్ళాడన్నాడు. బ్రీఫ్ కేస్ తన వాళ్ళు తప్ప యింకెవరు తెరవడానికి ప్రయత్నించినా బాంబు పేలి నాశనమైపోతారన్నాడు. త్రిమూర్తి ఆతడి మనిషి కాని పక్షంలో అతడు మూడుమార్లు దొంగతనానికి ఎలా ప్రయత్నించగలిగాడు?" అన్నాడు శాస్త్రి.

అంతవరకూ భాస్కరాచార్యులు వేస్తూ వచ్చిన పథకాలనుబట్టీ, తాను చూసి గ్రహించిన ఆతడి సమర్థతను బట్టీ-శాస్త్రి ఆలోచన నిజమే అయుండవచ్చునని శర్మ అనుకున్నాడు. మిత్రులిద్దరూ ఈ ఆలోచన తర్వాత కాస్త మనసు తేలికపర్చుకున్నా దూరప్రాంతాలకు పోయి వ్యాపారం చేసే ఉద్దేశ్యం వదిలిపెట్టలేదు.

స్పెషల్ ఫయిలు పంపినప్పుడల్లా కొందరు నేరస్థులు అరెస్టవుతారన్న కృష్ణ మాటలు నిజం చేస్తూ-ఆ తర్వాత పదిరోజులకు కృష్ణ, రంగరాజు అరెస్టయినట్లు పత్రికల్లో పడ్డ వార్తను మిత్రులిద్దరూ చదివి నిట్టూర్చారు. వారి సమస్య తీరిపోయింది.

—: ఐపోయింది :—

# సిగరెట్ కేసు

## టెంపోరావ్

గంగాధర్, నిక్సన్, మస్తాన్, సూర్యదేవ్, పుష్ప-రాజు అమీన్ కేఫ్ కాబిన్‌లో కూర్చున్నారు. టైం తొమ్మిది దాటింది.

కాబిన్‌లో వున్న ఫ్లోర సెంట్ లైటు వెలుగుతోంది. వాళ్ళు గాడ్ ఫాదర్ సినిమా చూసి అటుపైన అమీన్ కేఫ్‌కి చేరుకున్నారు. అందరికీ ఆకలిగా వుంది.

బేరర్ లోపలకు వచ్చాడు. అతడివైపు గంగాధర్ సూటిగా చూశాడు.

"మొదట కూల్ వాటర్ పట్రా. ఐదు ఖాళీగ్లాసులు కావాలి. తర్వాత టండూరీ చికెన్, మటన్ బిర్యానీ!" గంగాధర్ ఆర్డరిచ్చాడు.

బేరర్ వెళ్ళిపోయాడు. కాస్సేపట్లో అతడు తిరిగొచ్చి ఐదు గ్లాసులను టేబిల్ మీద వుంచాడు. పెద్ద స్టెయిన్ లెస్ స్టీల్ పాత్రలో నీళ్ళు పెట్టి, తలుపు తెర్చుకొని వెళ్ళిపోయాడు.

మూసుకుపోయిన తలుపువంక ఒకసారిచూసి గంగాధర్ తన ప్యాంటుజేబులోంచి ఒక హాఫ్‌విస్కీ బాటిల్ని బయటకు తీశాడు. ఐదు గ్లాసుల్లోనూ విస్కీని సర్ది పోశాడు. వాళ్ళు గ్లాసుల్లో కొంచెం నీళ్ళుపోసుకున్నారు. అందరూ గ్లాసులను ఎత్తిపట్టుకున్నారు.

"చియర్స్!" అని అందరూ తాగడం ప్రారంభించారు.

గంగాధర్ తన గ్లాసులోని విస్కీని గడగడా తాగేసి ఖాళీగ్లాసును టేబిల్ మీద వుంచి, పెనామా సిగరెట్ వెలిగించాడు. సిగరెట్ పాకెట్‌ను టేబుల్ మీద పడేశాడు.

తతిమావాళ్లు మెల్లిగా తాగుతున్నారు. వాళ్లుకూడా సిగరెట్లు వెలిగించారు. గంగాధర్ పొగనువదుల్తూ అందరి వైపూ చూశాడు.

"మనకి గాడ్‌ఫాదర్ లాంటివాడు కావాలి! అంతవరకూ మనదేశం బాగుపడదు!" అన్నాడు గంగాధర్ తన బొంగురు కంఠంతో.

తతిమావాళ్ళు అతడివంక చూశారు. గంగాధర్ పొడుగ్గా, బలంగా వుంటాడు. బి. ఎ. పాసయ్యాడు కాని వుద్యోగం లేదు. మూడేళ్ళపాటు వుద్యోగంకోసం వెతికి, వెతికి విసుగెత్తి అతడు వుద్యోగం గురించి ఆలోచించడం మానుకున్నాడు.

"నువ్వే గాడ్‌ఫాదర్!" అన్నాడు సూర్యదేవ్.

"నేనూ ఒప్పుకుంటున్నాను!" అన్నాడు పుష్కరాజు.

"ఐ అగ్రీ," అన్నాడు నిక్సన్.

నిక్సన్ యాంగ్లో యిండియన్ యువకుడు. అతడి వయస్సు యిరవై దాటింది. తెల్లగా, చక్కగా వుంటాడు.

తండ్రి ఎలక్ట్రికల్ కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. బి. ఎ. చదువుతూ నిక్సన్ కాలేజీకి వెళ్ళడం మానేసేడు. అతడికి ఇంగ్లీషు సినిమాలంటే పిచ్చి!

"నువ్వు గాడ్ ఫాదర్‌లా రూపొందగలవు!" అన్నాడు మస్తాన్.

"మీరందరూ నన్ను గాడ్ ఫాదర్ చేసి నా బాధ్యత పెంచారు," అన్నాడు గంగాధర్.

బేరర్ గదిలోకొచ్చి ప్లేట్లను టేబిల్ మీద వాళ్ళ ముందు పెట్టాడు. కొందరు యింకా తాగుతున్న గ్లాసులవైపు చూశాడు. అదోలా కనుబొమ్మల్ని ఎగరేస్తూ బేరర్ బయటకు వెళ్ళాడు.

మరో హాఫ్ బాటిల్ని గంగాధర్ జేబులోంచి తీసి టేబిల్ మీద పెట్టాడు. రమ్! బాటిల్ని తెరిచి నిక్సన్ రమ్‌ను అన్ని గ్లాసుల్లోనూ సమానంగా పోశాడు. నీళ్ళు కలిపి వాళ్ళు తాగడం ప్రారంభించారు.

బేరర్ అమాంతంగా కాబిన్‌లోకి వచ్చాడు.

"సార్, యిక్కడ తాగకూడదు. మేనేజర్కి తెలిస్తే నా వుద్యోగం వూడుతుంది!" అన్నాడతను.

"చెప్పకు!" అన్నాడు గంగాధర్.

"చెప్పకపోతే నన్ను తిడ్తాడు!"

గంగాధర్ అతడి చేతిలో ఒకరూపాయి పెట్టాడు.

బేరర్ దాన్ని దాచుకున్నాడు.

"ఖాళీ బుడ్లీలు యిక్కడ వదలకండి. పట్టుకెళ్ళి ఎక్కడేనా పారేయండి," అన్నాడతను.

"డోంట్ బాదర్! నిన్ను కష్టంలో యిరికించం!" గంగాధర్ జవాబిచ్చాడు.

బేరర్ బయటకు కదిలాడు. తలుపు మూసుకుపోయింది.

"ప్రొహిబిషన్!" అని అందరూ పకపక నవ్వారు.

రమ్ తాగడం పూర్తిచేసి వాళ్లు తిండిలో నిమగ్నులయ్యారు. నిక్సన్ ఏదో చెప్తున్నాడు. గంగాధర్ ఆకలితో తింటున్నాడు. తినేటప్పుడు గంగాధర్ యెక్కువగా మాట్లాడడు. ఆ సమయంలో యితర్లు చెప్పేది వింటాడు.

తినడం పూర్తయింది. బేరర్‌ని పిల్చి, బిల్లు తెప్పించి గంగాధర్ డబ్బు చెల్లించాడు. ఐదుగురూ సిగరెట్లు పీలుస్తూ కూర్చున్నారు.

"మైడియర్ ఫ్రెండ్స్ ఇక్కడనుంచి యెవరిండ్లకు వాళ్ళు వెళ్ళిపోవాలి. రేపు మన సెంటర్‌లో కలుసుకుందాం. ఒక కొత్త పథకాన్ని గురించి మనం ఆలోచించాలి," అన్నాడు గంగాధర్.

"ఓ.కే. బాస్," అన్నాడు నిక్సన్.

కాబిన్‌లోంచి అందరూ బయటకు నడిచారు. ఆమీన్ కేఫ్ బయటకొచ్చాక వాళ్ళు విడిపోయారు.

## 2

సూర్యదేవ్ రెండుసార్లు బి. ఏ. పరీక్ష రాసి, ఫెయిలయి చదువు మానుకున్నాడు. అతడి తండ్రికి పదెకరాల భూమి, ఒక పెద్దతోట వున్నాయి.

ప్రొద్దుటే ఎనిమిదింటికి వాళ్ళు తోటలో కలుసుకున్నారు. తోటలో వివిధ రకాల చెట్లు వున్నాయి. తోట మధ్యలో ఒక పాకవుంది. ఐదుగురూ ఆ పాకలో గుమికూడారు. చాపమీద అందరూ కూర్చున్నారు. వాళ్ల సమావేశాలకు అది రహస్య కేంద్రం.

సంవత్సరం క్రితం మొదటిసారిగా వాళ్ళు అక్కడ

కల్సుకున్నారు. గంగాధర్‌ని బాస్‌గా తతిమ్మా నల్గురూ భావించసాగారు.

గంగాధర్ వాళ్ళకు సక్రమంగా శిక్షణ యిచ్చి అనేక దొంగతనాలు జయప్రదంతా చేయించాడు. చేతికొచ్చినది అతడు అందర్కీ సమానంగా పంచేసేవాడు. అందర్కీ కావలసిన విస్కీ, రమ్, సిగరెట్ల ఖర్చులకు కొంత మొత్తాన్ని వేరే తీసివుంచేవాడు.

గంగాధర్ పాంట్, శ్లాక్‌లో వున్నాడు. అందరితోనూ కలిసిమెలిసి వున్నా అతడిని చూస్తే తతిమ్మా నల్గురూ లోలోన భయపడేవారు.

"నేను చెప్పేది వినేముందు మనం డ్రింక్స్ సేవిద్దాం" అన్నాడు గంగాధర్.

ప్లాస్టిక్ బాగ్‌లోంచి ఒక రమ్‌బాటిల్ తీసి చాపమీద పెట్టాడు. సూర్యదేవ్ బయటకు పరిగెత్తాడు. ఐదు నిమిషాల తర్వాత అతడు పాకలోకి తిరిగొచ్చాడు. ఐదు గ్లాసులనూ, కుండలో నీళ్ళనూ తెచ్చాడతను.

నిక్సన్ బాటిల్ తెర్చి గ్లాసుల్లో రమ్ పోసి, నీళ్ళు కలిపాడు. వాళ్ళు గ్లాసులను అందుకున్నారు. "చియర్స్!" అన్నారందరూ.

గంగాధర్ గడగడ రమ్ తాగేసి సిగరెట్ వెలిగించాడు. పొగ వదులూ అందరివైపూ చూశాడు.

"మై డియర్ ఫ్రెండ్స్. ఇంతవరకూ మనం చేసిన దొంగతనాలు బాగా లాభించాయి. పోలీసుల దృష్టిలోకి మనం వెళ్ళలేదు. పెద్దమనుషుల్లా జీవించగల్గుతున్నాం. నిన్న సినిమా చూశాక నాకొక ఆలోచన తట్టింది. దాన్ని గురించి మీకు చెప్తాను. అంతా విని మీ సలహాలు యివ్వండి!"

పార్కులో నిశ్శబ్దంగా వుంది. చల్లటిగాలి వీస్తోంది. అందరూ నాయకుడి వైపే చూస్తున్నారు.

"ఈ పరిసరాల్లో ఎన్నో నగరాలు లేచాయి. అంబేద్కర్ నగర్, చైతన్యనగర్, రాజానగర్, గణపతినగర్, యిలా ఎన్నో వున్నాయి. ఒక్కొక్క నగర్‌లో కనీసం 100 యిళ్లు పైన వుంటాయి. ఆ యిళ్ళల్లో వుండే వాళ్ళందరూ మధ్య తరగతి కుటుంబీకులు. కంపెనీలిచ్చిన అప్పు డబ్బుల్తో వాళ్ళు యిళ్లు కట్టించారు. ఈ ప్రాంతంలో పోలీసుస్టేషన్ లేదు. రాత్రిళ్ళు యిక్కడ దొంగతనాలు జరగొచ్చు! ఏ మాత్రం డబ్బు పోయినా యీ ఇళ్ళల్లో వుండేవాళ్ళు చాలా కష్టపడవలసివస్తుంది."

"యూ ఆర్ రైట్," అన్నాడు నిక్సన్.

"ఈ నగరాల్లోని ప్రతి యింటికీ మనం రక్షణ యిస్తాం. దొంగలు యిళ్ళలో పడకుండా మనం చూస్తాం. ప్రతి యింటి యజమానీ నెలకు మనకు యిరవై రూపాయలు చెల్లించాలి! ఈ నగరాల్లో వెయ్యి యిళ్ళుంటాయి. మనకు నెలకు యిరవై వేలు ఆదాయం వస్తుంది!"

ఇరవై వేలు! అందరూ వుద్రేకంతో గంగాధర్ వైపు చూశారు. గొప్ప స్కీము!

"కాని అందరూ యిస్తారా?" అడిగాడు పుష్కరాజు అనుమానంగా.

"ఇవ్వకపోతే వాళ్ళ ఖర్మ! ఇవ్వని వాళ్ళ యిళ్లల్లో దొంగలు పడ్తారు!"

"గుడ్ ఐడియా! మనమే ఆ దొంగలం!" అన్నాడు నిక్సన్.

"మనం ప్రతియింటికీ వెళ్ళి అడుగుదాం. కొందరు

వెంటనే సమ్మతిస్తారు. కొంతమంది ఆలోచించి చెప్తామంటారు. మరికొందరు మన స్కీములో చేరడానికి అంగీకరించకపోవచ్చు! వెంటనే డబ్బు చెల్లించినవారి ఇళ్ళకు రక్షణ వుండేట్లు చూద్దాం."

"రాత్రిళ్ళు మనం కాపలా వుండాలి," అన్నాడు మస్తాన్.

"దేశంలో వుద్యోగాలు లేని యువకులు యెందరో వున్నారు. నెలకు 100 రూపాయలు జీతం మీద యాభై మంది యువకులను నియమించుతాం. ఈ నగరాల్లో వాళ్లు రాత్రిళ్ళు గస్తీ తిరుగుతూ వుంటారు."

"చాలా బాగుంది. మనం నెగ్గుతాం," అన్నాడు సూర్యదేవ్.

మళ్ళా గ్లాసుల్లో రమ్ పోయమని గంగాధర్ సౌజ్ఞ చేశాడు. నిక్సన్ రమ్‌పోసి, నీళ్ళు కలిపాడు. తన గ్లాసులోని రమ్‌ని గంగాధర్ వేగంగా తాగేశాడు.

నవ్వుతూ వాళ్ళ వైపు చూశాడు.

"ఈ స్కీమ్ జయిస్తే మనం ఒక యింటిని అద్దెకు తీసుకుందాం. ఇటుపైన అక్కడే మనం కల్సుకోవచ్చు!"

"ఫయిన్!" అన్నాడు నిక్సన్.

"ముందుగా మనం కొంతపని చెయ్యాలి. ఇక్కడున్న నగరాలకు మనం వెళ్ళి వీధుల పేర్లూ, యింటి నెంబర్లూ రాసుకురావాలి. ఆటుపైన మనం యింటి యజమానుల్ని కల్సుకోవచ్చు."

"వెంటనే పని ప్రారంభించుదాం," అన్నాడు సూర్యదేవ్.

"మనం జయిస్తాం!" అన్నాడు గంగాధర్.

# 3

రిజర్వ్ బ్యాంకి ఆఫీసరు కేసవన్ గుమ్మం బయట నిలబడివున్న యువకుడివైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"మీతో మాట్లాడాలి!" అన్నాడతను.

"ఏ విషయం? చిరిగిపోయిన నోట్లు ఏమైనా వుంటే తిన్నగా బ్యాంకికి వెళ్ళు!"

చిరిగిపోయిన నోట్లను చుట్టుపక్కల వాళ్ళు అతడికిస్తూ వుంటారు. రిజర్వ్ బ్యాంకిలో వాటిని మార్చి అతడు మంచినోట్లు తెచ్చి యిస్తూ వుంటాడు. సాధారణంగా ఆ పనిమీదే తన కోసం మనుషులు వస్తారని అతడి అనుమానం!

"నా దగ్గర చిరిగిన నోట్లు లేవు!"

"కమిన్!" అన్నాడు కేశవన్.

హాల్లో పేము సోఫాలున్నాయి. కేశవన్ వయస్సు యాభై వుంటుంది. సన్నటి మనిషి. లుంగీ, బనియన్‌తో వున్నాడు.

"మిస్టర్ కూర్చో!"

"నా పేరు గంగాధర్. ఈ గణపతి నగర్ పట్నానికి దూరంగా వుంది. ఇక్కడున్న యిళ్ళకు దొంగల భయం లేకుండా చేయాలనే వుద్దేశంతో మేం ఒక స్కీం పెట్టాం. దానిలో మీరు చేరొచ్చు. నెలకు 20 రూపాయలు మాకు చెల్లించాలి. మీ యింటికి రక్షణ యిచ్చే బాధ్యత మాది," అన్నాడతను శరవేగంగా.

"దొంగల్ని మీరు ఎలా ఆపగలరు?"

"రాత్రిళ్ళు మా మనుషులు గస్తీ తిరుగుతూ వుంటారు."

కేశవన్ సూటిగా గంగాధర్ వంక చూశాడు.

"గణపతి నగర్‌లో ఎంతమంది నీ స్కీములో

చేరారు?"

"యాభైమంది చేరారు. నేను వెళ్ళి అడగవలసిన ఇళ్ళు యింకా చాలా వున్నాయి."

"సులభంగా డబ్బు గడించడానికి మంచిపద్ధతి ఆలోచించావు!" అన్నాడు కేశవన్ బుల్లెట్‌లా.

తన ఐడియా మంచిదని కేశవన్ అన్నందుకు అతడు లోలోపల సంతోషించాడు. కాని తన సంతోషాన్ని పైకి కనబర్చలేదు.

"ఇందులో మా కంపెనీకి ఎక్కువగా మిగలదు సార్. నిరుద్యోగులకు ఉద్యోగం యివ్వాలనే ఉద్దేశంతో యిది చేస్తున్నాం. రాత్రిళ్ళు గస్తీ తిరగడానికి అనేక మంది యువకుల్ని మేం నియమిస్తున్నాం. వసూలయే డబ్బు చాలా మటుకు వాళ్ళ జీతాలకు పోతుంది," అన్నాడతను వినయంగా.

"ప్రతి సంస్థకీ ఖర్చులుంటాయి!" అని కేశవన్ మరో సారి అతడివంక చూశాడు.

"మిస్టర్, నేను గాంధీగారి శిష్యుడిని. ఇంట్లో దొంగలు పడ్తారనే భయం నాకు లేదు. దొంగలు పడ్డా మా ఇంట్లో ఏముంది పట్టుకుపోడానికి? నీ స్కీమ్ బాగానేవుంది. కాని అందులో నేను చేరలేను!"

గంగాధర్ నవ్వుతూ అతడి వైపు చూశాడు.

"ఇంట్లో పోటానికి ఏముందిలే అని అనేక మంది అనుకుంటారు. ఈ రోజుల్లో వస్తువు విలువ యెక్కువ, డబ్బు విలువ తక్కువ. స్టెయిన్‌లెస్ స్టీల్ కంచాలూ, తదితర పాత్రలూ దొంగలు ఎత్తుకుపోతే మీకు వేలమీద నష్టము స్తుంది. ఈ పరిసరాల్లో దొంగతనాలు మహా జరుగుతాయి!"

"నాతో వాదించి లాభంలేదు. పక్క యింటికి వెళ్ళి మాట్లాడితే నీకు మరో మెంబరు దొరకొచ్చు!"

గంగాధర్ పేపుసోఫాలోంచి లేచాడు.

"కొన్ని నిమిషాలపాటు నాతో మాట్లాడినందుకు మీకు నా థాంక్స్. మా కంపెనీ కార్డు మీ దగ్గర వుంచండి. తర్వాత మా స్కీమ్‌లో మీరు చేరదలిస్తే మాకు ఫోన్ చేయండి. వెంటనే మా మనిషి మిమ్మల్ని కల్సుకుంటాడు" అని ఒక కార్డును అతడికిచ్చాడు.

కేశవన్ కార్డును చూసి, టేబుల్ మీద పడేశాడు. గంగాధర్ బయటకు వెళ్ళాడు. వీధిలో నిలబడి కేశవన్ యింటివైపు చూశాడు.

చిన్న డాబా యిల్లు. అందంగా కట్టబడింది. డాబా పైనున్న టి.వి. యాంటెనా మీదకు అతడి చూపు వెళ్ళింది.

కేశవన్‌కి టి.వి. వుంది. అతడు పేదవాడు కాదు. పిసినారై వుండాలి! ఆలోచిస్తూ గంగాధర్ వేగంగా నడవసాగాడు.

వీధి చివర తను ఆపిన స్కూటర్ దగ్గరకు చేరుకున్నాడు. స్కూటర్ని స్టార్ట్ జేసి పోనిచ్చాడు.

స్కూటర్ రోడ్డమ్మట దూసుకుపోతోంది. అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. తను అనుకున్నట్లు వెయ్యిమంది మెంబర్లు కావాలి! అంతవరకూ తను నిర్విరామంగా పాటుపడాలి.

రాజానగర్‌లోని గుడిముందు అతడు స్కూటర్ ఆపి, సిగరెట్ పీలుస్తూ చెట్టునీడన నిలబడ్డాడు.

ఐదు నిముషాల తర్వాత అతడివైపు నిక్సన్ గబగబా వచ్చాడు. నిక్సన్ కళ్ళు మెరుస్తున్నాయి.

"ఇక్కడెలా వుంది?" అడిగాడు గంగాధర్.

"ఆల్ సక్సెస్! ఇరవైమంది మెంబర్లుగా చేరారు. వద్దన్నవాడు కనపడలేదు!"

"ఫయిన్!"

స్కూటర్ స్టార్ట్ చేసి గంగాధర్ కూర్చున్నాడు. అతడి వెనకవే నిక్సన్ చోటు చేసుకున్నాడు. స్కూటర్ రోడ్డమ్మట దూసుకుపోయింది.

## 4

శ్రీనివాస నగర్‌లో ఒక మేడను గంగాధర్ అద్దెకు దీసుకున్నాడు. కొత్తగా నిర్మించిన మేడ. ఇంటిచుట్టూ ప్రహారీగోడ వుంది. ఇల్లు కట్టించిన వ్యక్తి ఢిల్లీలో ఉద్యోగం చేస్తున్నాడు.

ప్రహారీగోడ మీద ఎత్తుగా పెదబోర్డును గంగాధర్ పెట్టించాడు. హోమ్ సెక్యూరిటీ సర్వీసెస్ అని పెద్ద అక్షరాల్లో బోర్డ్ మీద చిత్రించబడివుంది.

మేడమీద హాలు పక్కనే విశాలమైన మరో గది, బాత్ రూమ్, లావట్రీ వగైరా వున్నాయి. నూతినీళ్ళు ఓవర్ హెడ్ టాంక్ నుంచి కావలసిన చోట్లకు సప్లయి చేయబడుతున్నాయి:

మేడమీద హాల్లో కుషను కుర్చీలో గంగాధర్ కూర్చుని వున్నాడు. పైన ఫాన్ తిరుగుతోంది. అతడి ముందు గాడ్ రేజ్ స్టీల్ టేబిల్ వుంది. అతడి కెదురుగా నాలుగు కుర్చీల్లో మస్తాన్, నిక్సన్, సూర్యదేవ్, పుష్కరాజు ఆసీనులై వున్నారు.

తళతళ మెరుస్తోంది మొజెయిక్ ఫ్లోర్. గంగాధర్ వాళ్ళవైపు నవ్వుతూ చూశాడు.

"మైడియర్ ఫ్రెండ్స్. విస్కీతో మన సమావేశం

ప్రారంభించుదాం" అన్నాడతను.

మెక్ డోవల్స్ విస్కీ బాటిల్ని నిక్సన్ తెచ్చాడు. సూర్యదేవ్ ఐదు గ్లాసులను టేబుల్ మీద వుంచాడు. వాటిలో విస్కీ పోసి, సోడా కలిపాడు నిక్సన్. అందరూ గ్లాసులను అందుకున్నారు.

తన గ్లాసులోని విస్కీని గంగాధర్ గడగడ తాగేశాడు. కింగ్ సైజ్ ఫిల్టర్ సిగరెట్ వెలిగించి వాళ్ళ వంక చూశాడు.

"కామ్రేడ్స్, తోటలోని పాకనుంచి నెలరోజుల్లో మనం చాలాదూరం ప్రయాణం చేశాము. ఇప్పటివరకూ ఐదువందల మంది మన స్కీములో చేరారు. పదివేలు మన చేతికొచ్చింది. ప్రతినెలా పదివేల రూపాయలు మనకు వస్తుంది. ఇంకా 500 పైన ఇళ్ళు యీ వివిధ నగరాల్లోనూ వున్నాయి. కొందరు మేం చేరమని ముక్కుసూటిగా చెప్పేశారు. మరికొందరు ఆలోచిస్తున్నారు. ఎన్నిసార్లు వెళ్ళినా కొన్నియిళ్ల యజమానులు మనకు దొరకలేదు. అదీ పరిస్థితి."

గదిలో కొంతసేపు నిశ్శబ్దంగావుంది. టేబుల్ మీద వున్న ఫోన్ మ్రోగింది. గంగాధర్ రిసీవరెత్తి మాట్లాడాడు. రిసీవర్ని పెట్టేసి సూర్యదేవ్ వంక చూశాడు.

"నటేశ మొదలియార్, నంబర్ 10, లక్ష్మీనగర్ మెంబర్‌గా చేరటానికి నిశ్చయించుకున్నాడు. రేపు పొద్దుట నువ్వెళ్ళి మన ఫారంమీద సంతకం పెట్టించి, ఒకమాసం డబ్బు అడ్వాన్స్‌గా వసూలు చెయ్యి!" గంగాధర్ అన్నాడు.

"అలాగే, బాస్."

గంగాధర్ ఆలోచిస్తూ పొగ పైకి వదిలాడు.

"మొదట్లో అతడు మెంబర్‌గా చేరనన్నాడు. మొన్న రాత్రి అతని సైకిల్ పోయినందువల్ల మెంబర్‌గా చేరాలనే వుద్దేశం అతడికొచ్చివుంటుంది. తన సైకిల్ దొంగతనం గురించి అతడు నీతో చెప్తాడు. సైకిల్ దొంగ కోసం వెతుకుతామని చెప్పు. రెండురోజుల తరువాత సైకిల్‌ని అతడికి పట్టుకెళ్ళి ఇచ్చేయి. పరుష వాకంలో సైకిల్ అమ్మబోతుండగా దొంగను పట్టుకున్నట్లు చిత్రించు. దొంగ పారిపోయాడని చెప్పు! తన సైకిల్ తిరిగివచ్చినందుకు నటేశముదలియార్ చాలా సంతోషిస్తాడు."

"అంతా నేను చూసుకుంటాను," అన్నాడు సూర్యదేవ్.

గంగాధర్ చూపు పుష్కరాజు మీదకి వెళ్లింది.

"మెంబర్లు అవడానికి నిరాకరించినవారి లిస్టు తయారు చేశావా?"

పుష్కరాజు ఒక పత్రాన్ని టేబిల్ మీద వుంచాడు.

"అందులో 120 మంది పేర్లు వున్నాయి" అన్నాడు పుష్కరాజు.

విస్కీని నిక్సన్ ఐదు గ్లాసుల్లోనూ మళ్ళా పోసి, సోడా కలిపాడు. గంగాధర్ తన గ్లాసును అందుకొని విస్కీ తాగేశాడు.

"మైడియర్ ఫ్రెండ్స్, ఆ లిస్టులోని వాళ్ళు త్వరలో మెంబర్లు అయేటట్లు మనం చూడాలి. ఇనపకడ్డీ వంచితే వంగదు. దాన్ని కొలిమిలో పడేసి, బాగా వేడిచేశాక అదే వంగుతుంది. కొందరు మనుషులు కూడా అలాగే వుంటారు."

అందరూ గంగాధర్ వైపు మౌనంగా చూశారు.

"ఇంతవరకూ మనం ఎంతమంది యువకులకు ఉద్యోగాలు

యిచ్చాం?"

"ఇరవై మందికి," అన్నాడు మస్తాన్.

"రాత్రి తొమ్మిదినుంచి పొద్దుటదాకా వాళ్ళు గస్తీ తిరగాలి. వాళ్ళు ఏం చేస్తున్నదీ మనంవెళ్లి రహస్యంగా గమనించాలి. మన కార్యక్రమాలు గురించి వాళ్ళకు యే మాత్రం ఎన్నడూ తెలియకూడదు!" అన్నాడు గంగాధర్.

"వాళ్ల గురించి మనకు బెంగలేదు," అన్నాడు మస్తాన్.

"ఆ లిస్టులోవున్న వాళ్ల గురించి మనం తీవ్రంగా కృషి చేయాలి. మన స్కీములో చేరనివాళ్లు యీ పరిసరాల్లో నివసించడం కష్టమని తెల్సుకోవాలి. అందుకేం చేస్తే బాగుంటుందో మనం ఆలోచించాలి. మనం చేసేది ఒకే విధానంలో వుండకూడదు. అలావుంటే మన్ని వాళ్ళు అనుమానిస్తారు. అనేక విధాల ప్రయత్నించి మనం వాళ్లను లొంగదీయాలి!"

"యూ ఆర్ రైట్! మన పద్ధతుల్లో వైరైటీవుండాలి. అప్పుడే సక్సెస్!" అన్నాడు నిక్సన్.

## 5

పద్మావతి బట్టల్ని జాగ్రత్తగా డెట్ సోప్ పౌడర్లో వులికి, ఇంటి వెనుకనున్న నైలాన్ తాళ్ళమీద ఆరేసింది. గాలికి ఎగిరిపోకుండా వాటికి క్లిప్పులు పెట్టింది.

పనిమనిషి వెళ్లిపోయాక ఆమె ఒంటరిగా భోజనం చేసి పడగ్గదిలోకివెళ్లి పరుపుమీద వాలింది. వేసవికాలపు ఎండలు! వేడిగాలి కిటికీలోంచి గదిలో కొస్తోంది.

ఆమె ఫాన్‌వైపు చూసింది. ఫాన్ వేసుకుంటే చల్లటిగాలి రావచ్చు. కానీ ఎలక్ట్రిసిటీ బిల్లు యెక్కువ

అవుతోంది. గతమాసంలో వచ్చిన ఇరవై రూపాయల బిల్లుచూసి భర్త రెండురోజులు తిండి మానేశాడు. అది అంతా గుర్తుకు తెచ్చుకుంటూ ఆమె నిద్రపోయింది.

సాయంత్రం పాలమనిషి వచ్చి పిల్చినదాకా ఆమెకు మెలకువ రాలేదు. ఆమెలేచి పాలుతీసుకుంది. చన్నీళ్లతో మొహం కడుక్కొని వెనకవైపుకు వెళ్లింది. బోసిగావున్న నైలాన్ తాళ్లనుచూసి ఆమె తృళ్లిపడింది.

తను ఆరేసిన బట్టలు మటుమాయం అయ్యాయి. చీరలు పాంట్లు, చొక్కాలు, జాకెట్లు! ఆమె కొంతసేపు చలనము లేకుండా వుండిపోయింది.

కళ్ళు తుడుచుకుని మళ్ళీచూసింది. నేలమీద ఒక బనియన్, రెండు జేబురుమాళ్లు పడివున్నాయి. ఆమె వాటిని ఆత్రంగా అందుకొంది. తతిమ్మా వాటికోసం అన్నివైపులా తిరిగి చూసింది.

నూతిపక్కనే ఆమె ఆగింది. ఎవరో దొంగిలించి పట్టుకు పోయారు. అన్ని దుస్తులను ఒక్కసారి కొనాలంటే కనీసం ఐదారు వందలు ఖర్చవుతుంది.

ఆమె పడగ్గదిలోకి వెళ్లి ఏడుస్తూ కూర్చుంది. భర్త యింటికి రాగానే తనకు చీవాట్లూ, దెబ్బలు తప్పవు! ఆమె భర్తకు కోపం ఎక్కువ.

“విలువయిన బట్టలు బయట ఆరేసి, నేలకూలిన అరటి బోందలా పడుకున్నావా, పాపిష్టిముండా!” అని భర్త తిట్టాడు.

సాధారణంగా భర్త వుపయోగించే తిట్టు పదాలన్నీ ఆమె చెవుల్లో మ్రోగుతున్నాయి. విచారంలో క్రుంగిపోయిన పద్మావతి కాఫీగురించి పూర్తిగా మర్చిపోయింది.

సరిగ్గా ఆరింటికి ఆమె భర్త కేశవరావు గబగబా

లోపలకొచ్చాడు. పడగ్గదిలోకి వెళ్ళి ఆమెవైపు చూసేడు.

"ఏమయిందే? కన్నీళ్ళలో ఈదుతున్నావు!" అన్నాడతను.

ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది. మంచం మీద కూర్చుని అతడామెవంక చిరాకుగా చూశాడు,

"మీా నాన్న పోయాడని ఉత్తరమొచ్చిందా?" అడిగాడు.

"నాన్న బతికే వున్నాడు!"

"అయితే ఎవరు చచ్చారు?"

"నేను ఆరేసిన బట్టల్ని ఎవరో ఎత్తుకుపోయారు," అని ఆమె ఏడ్వసాగింది.

"నువ్వు చూస్తూ వూరుకున్నావా?"

"ఎండవేడికి నాకు నిద్ర పట్టేసిందండి. ఎవరు పట్టుకుపోయారో నాకు తెలియదు," అందామె.

కేశవరావు ఆమె తలమీాద రెండుసార్లు మొట్టి, గట్టిగా జుత్తు పట్టుకున్నాడు.

"పందిలా తిని, వూరగాయి జాడీలా నిద్రపోతే దొంగలు రాకుండా వుంటారా, గాడిద ముండా! నిన్ను చంపినా పాపంలేదు!"

చేతో అనేక చోట్ల ఆమెను కొట్టసాగాడతను. "రేపు ఆఫీసుకి ఎలా వెళ్ళనే! ఈ మురికి గుడ్డల్లోనే వెళ్ళాలా!" అరుస్తూ అతడామెను వాయిస్తున్నాడు.

"నాకు బుధ్ధివచ్చింది. ఇంకెప్పుడూ నిద్రపోను. నన్ను మన్నించండి," బ్రతిమాలిందామె.

అతను వెనక్కి పరుగెత్తాడు. నైలాన్ తాళ్ళవైపు చూశాడు. వెనుదిరిగి వంటగదిలోకి వెళ్ళాడు. పాల చుక్కలు నేలమీాదున్నాయి. పాత్ర పక్కకు పడివుంది.

పిల్లి తటాలున కిటికీలోంచి బయటకు దూకింది.

అతడు వ్యగ్రుడై పడగ్గదిలోకి వెళ్ళాడు.

"పాలది పాలు పోసిందా?"

"పాలు వంటగదిలో పెట్టాను," అందామె.

"గుడ్డల్ని దొంగ లెత్తుకుపోతే పాలను పిల్లి తాగేసింది. నీలాంటి గాడ్డుముండని పెళ్ళాడం నా తప్పులే!" అని వూరుకున్నాడతను, పక్కింటి ఆచారి తనవైపు చూడ్డం గమనించి.

ఇంతకుముందు ఎన్నిసార్లో కేశవరావు భార్యను కొడు తుంటే ఆచారి జోక్యం చేసుకొని అతడిని మందలించేడు.

"కేశవరావు, నువ్వు చిన్నవాడివి. ఆడదాన్ని ఎన్నడూ కొట్టకూడదు. మనిషై పుట్టాక యేదో తప్పు చేస్తూ వుంటాం. తప్పును సరిదిద్దుకోవమ్మ్చు" అని లెక్చర్ ఇస్తూవుంటాడు ఆచారి.

ఎవరో బయటనించి పిలవడం విని కేశవరావు వీధి గుమ్మంవైపు వెళ్ళాడు. అక్కడ నిలబడిన వ్యక్తివైపు అతడు ఆశ్చర్యంగా చూశాడు. అతడిచేతిలో యెన్నో గుడ్డలున్నాయి.

"ఇవన్నీ మీవేనా?" అడిగాడు మస్తాన్.

"మావే! నీకెలా దొరికాయి?" అడిగాడు కేశవరావు.

"మేం యీ ప్రాంతాల్లో తిరుగుతూ వుంటాం. మా కంపెనీ పేరు మీరు వినేవుంటారు, హోమ్ సెక్యూరిటి సర్వీసెస్."

"విన్నాను. ఇంతకీ ఏమైందో చెప్పు!"

"ఒక పన్నెండేళ్ళ కుర్రాడు యీ బట్టల్ని పట్టుకొని రైలు పట్టాలమ్మట పోతున్నాడు. అనుమానం వచ్చి వాడిని ఆపి, రెండు దెబ్బలేశాక, నిజం చెప్పాడు. అవి

పట్టుకొని యిలా వచ్చాను."

"వాడిని పోలీసులకు అప్పగించావా?"

మస్తాన్ నవ్వాడు.

"వాడిని పోలీసులకు అప్పగిస్తే నాకొచ్చే మెప్పును వాళ్ళు కొట్టేస్తారు. ఆ కుర్రాడిని చితకబాది వదిలేశాను. మళ్ళా యిటువైపు రాడు!" అన్నాడు మస్తాన్.

"మిస్టర్, నువ్వు చేసిన సేవకు నా ధన్యవాదాలు," అని కేశవరావు భార్యవైపు తిరిగాడు.

"అన్నీ వున్నాయో లేవో చూడవే!"

పద్మావతి అన్నిటినీ చూసింది.

"అన్నీ వున్నాయండీ. దేవుడిలా పట్టుకొచ్చి ఇచ్చాడు," అందామె.

అతడు భార్యవైపు చురచుర చూసాడు.

"పక్కింట్లో కొంచెం పాలు తీసుకుని మా యిద్దరికీ కొంచెం కాఫీ పొయ్యి! అంత సేవ చేసిన వాడిని కాఫీ యేనా యివ్వకుండా వెళ్ళమంటే బాగోదు!"

"ప్లీజ్, కాఫీ నాకు వద్దండీ. నా డ్యూటీ నేను చేశాను. నాకు మీరు ఏమీ ఇవ్వనక్కర లేదు."

కేశవరావు నవ్వుతూ అతడివంక చూశాడు.

"ఆ మధ్య మీ కంపెనీ మనిషివచ్చి నన్ను మెంబరుగా చేరమన్నాడు. అతడు మళ్ళా రాలేదు!"

"మళ్ళా అతడిని రమ్మంటారా?"

"అదే నా వుద్దేశం. మెంబర్ గా చేర్తాను. అతడిని ఇక్కడకు రమ్మను."

"మా కంపెనీ అధికార్లకు చెప్తాను," అని మస్తాన్ సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

కేశవరావు వెనక్కు తిరిగాడు.

"ఇవాల్టికి నల్లకాఫీ తాగేద్దామండి. పాలు అప్పు తీసుకోవలసిన అవసరం వుండదు," అందామె.

"నలుపో, తెలుపో, ఏదో తొందరగా తగలేయి!" అర్చాడతను విసుగ్గా.

# 6

రత్నపాప కింకా ఐదేళ్ళు నిండలేదు. బంగారం బొమ్మలా వుంటుంది. డాన్‌బాస్కోలో యు. కె. జి. చదువుతోంది. ప్రతిరోజూ రిక్షాలో స్కూలుకు వెళ్ళి, సాయంత్రం అదే రిక్షాలో ఆమె ఇంటికి తిరిగివస్తుంది.

రిక్షాలో ఆమెతో మరో పదిమంది స్కూలుపిల్లలు కూడా వుంటారు.

టైమ్ నాలుగు దాటింది. సుమతి తన పాప రాక కోసం ఎదురుచూస్తోంది. అప్పుడామెకు పిడుగులా ఒక విషయం గుర్తుకొచ్చింది.

"సాయంత్రం నేను రానమ్మా. మీరు ఎల్లి బిడ్డను తెచ్చుకోవాలి," అన్నాడు రిక్షావాడు.

స్కూలు నాలుగింటికి మూసేస్తారు. అక్కడికి నడచి వెళ్ళడానికి కనీసం యిరవై నిమిషాలు పడుతుంది. ఏం చెయ్యాలో తోచక సుమతి ఇంటిముందు పచార్లు చేస్తోంది.

సైకిల్‌మీద పోతున్న రాజా తండ్రిని ఆమె ఆపింది.

"స్కూలుకేనా వెళ్తూంట?" అడిగిందామె.

ఆతడు తలాడించాడు. రాజా, రత్నపాప వొకే స్కూల్లో చదువుతున్నారు.

"మా పాపనుకూడా తీసుకురండి. అక్కడికెళ్ళడానికి ఎవ్వరూ లేరు," అందామె.

"అలాగే," అని రాజా తండ్రి సైకిల్ని వేగంగా తొక్కాకు పోయాడు.

రాజా తండ్రి సైకిల్ కోసం ఎగురుచూస్తూ సుమతి ఇంటిముందు పచార్లు చేస్తోంది.

పదిహేను నిమిషాల తర్వాత రాజా తండ్రి సైకిల్ తిరిగి వచ్చింది. ముందు సీటుమీద రాజా కూర్చునున్నాడు. "మీ పాప అక్కడలేదు. ఎవరితోనో ఆమె వెళ్ళిపోయి వుంటుంది. కాస్సేపట్లో ఇంటికి రావచ్చు," అని రాజా తండ్రి సైకిల్ తొక్కుకుపోయాడు.

సుమతికి పిచ్చి పట్టినట్లయింది. రత్న పాపను యెవరు తీసుకెళ్ళి వుంటారు? ఎవరు తీసుకువెళ్ళినా యీ పాటికి తీసుకొచ్చి యింట్లో దింపేయాలిగా?

సుమతి, ఆమె అత్త స్కూలుకు వెళ్ళారు. స్కూలు మూసేసివుంది. అక్కడ ఎవ్వరూ లేరు. అనేకచోట్ల వెతుకుతూ వాళ్ళిద్దరూ యింటికి తిరిగి వచ్చారు.

సుమతి, ఆమె అత్త ఇంటిముందు నచ్చుమీద అలసటతో కూర్చుండిపోయారు. ఇంతలో సుమతి భర్త రామన్ సైకిల్ దిగాడు.

"స్కూలునుంచి పాపయింకా రాలేదండీ!" అంది సుమతి.

"వెళ్ళి చూడనా?" అడిగాడు రామన్.

"మేంవెళ్ళి చూసొచ్చాం. రత్నపాప అక్కడలేదు" అంది అతడి తల్లి.

రామన్ స్వతహా భయస్తుడు. గాభరాగా భార్య వైపు చూశాడు.

"సుమతీ, మన పాప ఏమై వుంటుంది?"

"భయపడకండి. మనకు తెలిసినవాళ్ళెవరో దాన్ని యింటికి తీసుకెళ్ళి వుంటారు. కాస్సేపట్లో దాన్ని మనకు

అప్పగిస్తారు," అంది సుమతి.

భర్తను భయపెట్టడం ఆమె కిష్టంలేదు. ఈ మధ్యనే అతడు టైఫాయిడ్ జ్వరంతో బాధపడి, చచ్చి బ్రతికి మెల్లిగా కోలుకున్నాడు.

"అలా మన స్నేహితుల ఇళ్ళకు వెళ్ళి చూసివస్తాను," అన్నాడు రామన్.

"నేనూ వస్తాను, పదండి" అని ఆమె వెనుకనున్న కేరేజ్ మీద కూర్చుంది.

ఆయాసపడ్తూ రామన్ సైకిల్ని పోనిచ్చాడు. ఏడెనిమిది ఇళ్ళకు వెళ్ళి వాళ్ళు నిరాశతో తిరిగి వచ్చారు.

"ఎక్కడా లేదా?" అడిగింది తల్లి రామన్ వైపు చూస్తూ.

"లేదు!" అన్నాడతను, తల్లివైపు చూడకుండా.

గచ్చుమీద కూర్చున్న సుమతి కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి. రామన్ ఆమెపక్కనే చతికిలపడ్డాడు. ఇరుగు పొరుగువాళ్ళు పరామర్శించడానికి వచ్చే ప్రయత్నంలో వున్నారు.

అదే సమయంలో మెరుపులా ఇంటిముందు స్కూటర్ ఆగింది. దాని మీదనుంచి నవ్వుతూ దిగింది రత్నపాప.

స్కూటర్ దిగిన వ్యక్తి వైపు రామన్ కృతజ్ఞతతో చూశాడు.

"నా పేరు గంగాధర్," అన్నాడతను.

రామన్ అతడితో కరచాలనం చేశాడు.

"ప్లీజ్, లోపలకు రండి," ఆహ్వానించాడు రామన్.

హాల్లోని సోఫాల్లో గంగాధర్, రామన్ కూర్చున్నారు. రత్నపాప బొమ్మతో ఏదో చెప్తోంది.

వచ్చీరాని మాటలు! సుమతి రెండుకప్పుల్లో కాఫీ

తెచ్చి వాళ్ళకిచ్చింది. గంగాధర్ కాఫీతాగి సిగరెట్ పాకెట్ తీశాడు. రామన్‌కి ఒక సిగరెట్ యిచ్చాడు. ఇద్దరూ సిగరెట్లు వెలిగించారు.

"పాపను గురించి మేము చాలా గాభరా పడ్డాం. అది మీకెలా దొరికింది?" అడిగాడు రామన్.

"రిక్షావాడు రాలేదట. ఒంటరిగా రోడ్డమ్మట వెళు తోంది. పాపనుచూసి నేను స్కూటర్ మీద కూర్చో బెట్టుకున్నాను. చాక్లెట్లు కొనిచ్చాను. చాలాసేపు పాప నోరు తెరిచి మాట్లాడలేదు. నాతో అలవాటైనాక మాట్లాడింది. మీ పేరూ, అడ్రసూ కనుక్కొని వెంటనే ఇక్కడకు తీసుకువచ్చాను," అన్నాడు గంగాధర్.

"చాలా థాంక్స్, మీరు ఏం చేస్తున్నారు?"

"ప్రజాసేవ. నేను హోమ్ సెక్యూరిటీ సర్వీసెస్ అనే కంపెనీ అధిపతిని."

"మీ కంపెనీలో నేను మెంబర్ కావాలి" అన్నాడు రామన్.

"మీరు మెంబర్ కాదా?" అడిగాడు గంగాధర్ ఆశ్చర్యాన్ని ప్రదర్శిస్తూ.

"మీ కంపెనీ మనిషి నన్ను కలుసుకున్నాడు. కాని అప్పట్లో నేను మెంబర్ కాలేకపోయాను."

"డోంట్ బాదర్. రేపు మా మనిషిని పంపుతాను" అని గంగాధర్ లేచాడు.

రత్న పాపను ముద్దెట్టుకొని, గంగాధర్ తన స్కూటర్ మీద వెళ్ళిపోయాడు.

"సుమతీ, చూశావా! ఈ రోజున వాళ్ళ స్కీములో చేరడం వేస్టన్నావు! చివరికి ఆ కంపెనీ అధిపతే మన

బిడ్డను మన కప్పగించి వెళ్ళాడు," అన్నాడు రామన్.

"నన్ను చెప్పకండి. వెటనే మెంబరవండి. నేను వద్దన్నానా," అంది సుమతి సంతోషంగా.

# 7

ఉమాపతి కుంటుతూ పోలీస్ స్టేషన్ వైపు అడుగులు వేశాడు. రెండు నెలల క్రితం జరిగినది అతడికి జ్ఞాపికి వస్తోంది.

ఆనాడు ఆదివారం. అతడు స్నేహితుడితో నైట్ షో కెళ్లి ఒంటరిగా అంబేద్కార్ నగర్ లోవున్న తన ఇంటికి వెళుతున్నాడు. సిటీ లిమిట్ దాకా అతడు ఆటోలో వచ్చాడు. అటు పైన యింటివైపు నడవక తప్పలేదు.

రైలుపట్టాల ప్రక్కన ఉమాపతి కదులుతున్నాడు. ఆకాశంలో చంద్రుడు లేడు. చుట్టూ చీకటిగా వుంది. జనసంచారంలేసి తోవది.

కొంచెం దూరం వెళ్ళాక ఎదురుగా వస్తున్న మూడు ఆకారాలు అతనికి కనిపించాయి. తను ఒంటరిగా లేనని అతడు మొదట్లో సంతోషించాడు. కాని మరుక్షణంలో అతడి సంతోషం మాయమైపోయింది.

ఎదురుగా వస్తున్నవాళ్ళు అతనికి దగ్గరయ్యారు. అమాంతంగా ఇద్దరు అతడిని పట్టుకున్నారు. మూడో అతడు కత్తితో ఉమాపతిని బెదిరించాడు.

"ఉన్నదంతా మాకిచ్చేసి ఇంటికిపో! లేకపోతే నిన్ను చంపి ఆ నూతిలో పారేస్తాం," అన్నాడతను.

సమీపంలో, పట్టాలకు పక్కనే నుయ్యి వుందని అతడికి తెలుసు. ఉమాపతి వణుకుతూ వుండిపోయాడు.

ఎదురుగా వున్నతను ఉమాపతి జేబులు వెతికాడు. ఉన్నదంతా తీసేసుకున్నాడు, నాలుగువందల యిరవై

అయిదు రూపాయలు, రిస్ట్ వాచ్, పెన్ వగైరా ఉమాపతి నష్టపోయాడు. అతడి జేబులోవున్న సిగరెట్ కేసును కూడా దొంగ లాక్కున్నాడు.

"ఆ సిగరెట్ కేసు వుంచండి. ఇంత రాత్రివేళ సిగరెట్లు దొరకవు." అని ఉమాపతి బ్రతిమాలాడు.

దొంగ సిగరెట్ కేసును అతడి జేబులో పడేశాడు.

"తొందరగా యింటికి పో! నోరు మూసుకుని పడుకో! పోలీసు రిపోర్టిస్తే నీ తోలు వల్చేస్తాను," అని భయపెట్టాడతను.

వాళ్ళు వెళ్ళిపోయారు. ఉమాపతి యింటికి వెళ్ళలేదు. కిలోమీటర్ దూరంలోవున్న పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి రిపోర్టు యిచ్చాడు.

ఇన్‌స్పెక్టర్ మురుగన్ వుషారైన వ్యక్తి.

"వాళ్ళను గురించి వర్ణించండి," అన్నాడు యిన్‌స్పెక్టర్.

"వాళ్ళు ముగ్గురూ మాస్కులు ధరించారు. నాతో మాట్లాడిన వ్యక్తి వాళ్ళ నాయకుడై వుండాలి. అతడిది బొంగురు కంఠం. అంతకంటే మరేమీ చెప్పలేను." అన్నాడు ఉమాపతి.

ఇన్‌స్పెక్టర్ మురుగన్ తల పంకించాడు.

"వాళ్ళను పట్టుకోడానికి వుపయోగపడే క్లూ ఏదేనా వుంటే గుర్తు తెచ్చుకోండి!"

ఉమాపతికి డిటెక్టివ్ కథలంటే ఎంతో పిచ్చి. ఆ క్షణంలో జేబులో వున్న సిగరెట్ కేసు అతడికి గుర్తొచ్చింది.

"వాడు నా సిగరెట్ కేసును తీసుకుని మళ్ళీ నా జేబులో పడేశాడు. దానిమీద అతడి వేలిముద్రలు

వుంటాయా?"

ఇన్‌స్పెక్టర్ వుషారుగా పైకి లేచాడు.

"అటువంటి క్లూ కోసమే మేం చూస్తున్నాం. ఆ కేసు మీద వేలిముద్రలు వుంటాయి. దాన్ని రుమాల్తో పట్టుకుని మెల్లిగా టేబుల్ మీద పడేయండి."

ఉమాపతి రుమాల్తో సిగరెట్ కేసును తీసి టేబుల్ మీద పడేశాడు.

"వేలి ముద్రలున్నాయో లేదో మేం చూస్తాం," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

రెండురోజుల తర్వాత ఉమాపతి ఇన్‌స్పెక్టర్ని కల్సుకున్నాడు.

"మీ వేలిముద్రలు కాక మరో వ్యక్తి వేలిముద్రలు ఆ కేసుమీద వున్నాయి. ఆ వేలిముద్రల ద్వారా ఆ దొంగ మాకు తప్పక దొరుకుతాడు," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

అప్పటి నుంచీ అప్పుడప్పుడు పోలీస్ స్టేషన్‌కి ఉమాపతి వెళ్ళి ఏదేనా తెలిసిందేమో కనుక్కుంటూ వుంటాడు.

ఇన్‌స్పెక్టర్ మురుగన్ నవ్వుతూ ఉమాపతి వంక చూశాడు.

"మా పరిశోధన పడవ కదల్లేదు. ఉన్నచోటే వుండి పోయింది! ఏదేనా తెలిస్తే మీకు వార్త పంపుతాను," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అనేకమంది దొంగల వేలిముద్రలు మీ దగ్గర వుంటాయి. వాటితో పోల్చి చూశారా?"

"పోల్చి చూశాం. ఇతడు కొత్త దొంగై వుండాలి. అందువలన అతడెవరో తెల్సుకోడానికి కొంత టైం పడ్తుంది," అన్నాడు యిన్‌స్పెక్టర్.

"వాళ్ళు నన్ను ఆపిన స్థలం పరిసరాల్లో గూండా

లాంటి వాళ్ళు ఎందరో గళ్ళలుంగీలు కట్టుకుని తిరుగుతూ వుంటారు. వాళ్ళ వేలిముద్రలు మీరు తీసుకోవాలి," సలహా యిచ్చాడు ఉమాపతి.

"మీరు తొందరపడకండి. మనిషిలో దొంగగుణం ఏర్పడితే అది పోదు. గాని మూలంగా దొంగ మనకు చిక్కుతాడు!" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"ఇన్ స్పెక్టర్, ఆ నాటి రాత్రి నాకు జరిగినది మరెవ్వరికీ జరగకూడదని నా తాపత్రయం. పోయిన డబ్బు నాకు తిరిగి రావాలని నేను ఆశించడం లేదు. డబ్బును నేను సంపాదించగలను. ప్లీజ్, నా కేసు గురించి మీరు దర్యాప్తు చెయ్యాలి. ఏదో తెల్సినదాకా మీరు వూరుకోకూడదు," అని ఉమాపతి కుర్చీలోంచి లేచాడు.

ఇన్ స్పెక్టర్ మురుగన్ కి నమస్కరించి అతడు బయటకు నడిచాడు. సమీపంలోవున్న బస్ స్టేండు వైపు అతడు అడుగులు వేశాడు. అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. పోలీసులు శ్రద్ధతో కృషి చేస్తే దొంగతనాలు తగ్గుతాయి. కాని వాళ్ళు అంతగా శ్రమించరు. ఏదో పొరపాటు చేసి దొంగ వాళ్ళకు చిక్కాలిగాని, వాళ్ళు దొంగను పట్టుకొంటారనే నమ్మకం అతడిలో లేదు!

# 8

హోమ్ సెక్యూరిటీ సర్వీసెస్ అఖండంగా సాగుతోంది. వెయ్యిమంది పైన మెంబర్లుగా చేరారు. ప్రతినెలా ఇరవై వేలపైన ఆదాయం వస్తోంది.

మెల్లెక్కి పైకి చేరుకున్న గంగాధరంలో వచ్చిన మార్పును తలిమ్మా నల్గురూ గుర్తించారు. మునపటిలా అతడు తలిమ్మా నలుగురితో కలిసి తాగడం మానేశాడు. అఫీసు మేడమీద ఏర్ కండిషండ్ గదిలో అతను

వుంటాడు. అవసరాన్నిబట్టి తలిమ్మా నలుగురినీ పిల్చి
సుకసరిగా మాట్లాడి పంపేస్తాడు. ఒకనాడు వాళ్ళను
బంధించిన స్నేహభావం యిప్పుడు లేదు.

గంగాధర్ ఫియట్ కారులో తిరుగుతాడు. తలిమా
నలుగురికీ స్కూటర్లు కొనియిచ్చాడు. యీ భైమందిని గస్తీ
తిరగడానికి అతడు నియమించాడు.

ఐదుగురు మనుషులు నూరు యిళ్ళకు కాపలాగా
వుంటారు. మొత్తం యీ భైమంది వెయ్యిఇళ్ళకు కాపలాగా
వుంటున్నారు.

రొటేటింగ్ కుర్చీలో కూర్చున్న గంగాధర్ సీరి
యస్‌గా నిక్సన్ వైపు చూశాడు.

"ఆ మాధవయ్యగాడిని మీరు లొంగదీయలేక
పోయారు!" అన్నాడు గంగాధర్.

విజయానగర్‌లో మాధవయ్య స్వంత యిల్లు కట్టించు
కున్నాడు, కాని అతడు వాళ్ళ స్కీములో చేరలేదు!

"దొంగలా! నా యింట్లో అడుగుపెట్టడానికి దొంగకు
ఎన్ని గుండెలుండాలో తెలుసా? ఒకసారి అడుగుపెట్టి
చూస్తే వాడికే తెలుస్తుంది!" అన్నాడు మాధవయ్య
నిర్లక్ష్యంగా.

"బాస్, మనకు వెయ్యిమంది పైన మెంబర్లు వున్నా
రుగా! ఒక్క మాధవయ్య లేకపోతే పోయిందేమిటి?"
అన్నాడు నిక్సన్.

గ్లాసులోవున్న స్కాచ్ విస్కీని గంగాధర్ గడగడ
తాగేశాడు.

"నిక్సన్, నీది మట్టిబుర్ర! నాకు కావలసింది
మాధవయ్య యిరవై రూపాయలు కాదు. నన్ను ఒకడు
ఎదిరించగలిగాడనే భావం మాధవయ్య పేరు గుర్తుకొచ్చి

నప్పుడల్లా వేధిస్తూవుంటుంది. నీకు రెండురోజులు టైమ్ యిస్తున్నాను. మాధవయ్యను వంచి మన తోవకు ఈడ్చుకు రావాలి!"

"ప్రయత్నిస్తాను." అన్నాడు నిక్సన్.

"నాకు కావలసింది ప్రయత్నం కాదు, ఫలితం! మాధవయ్యను జాడించలేకపోతే నీకీ సంస్థలో స్థానం లేదు!" అర్చాడు గంగాధర్.

నిక్సన్ కోపంతో లేచాడు.

"బాస్, నువ్వు గతాన్ని మర్చిపోతున్నావు!"

గంగాధర్ పళ్ళు యికిలించాడు.

"గతాన్ని అంటిపెట్టుకుని బ్రతికేవాళ్ళకు భవిష్యత్తు వుండదు!"

నిక్సన్ ఏదో చెప్పాలనుకున్నాడు. కాని ధైర్యం చాలక వూరుకున్నాడు. కాని అతడి మనస్సు విరిగింది. సూటిగా గంగాధర్ వంక చూస్తూ వుండిపోయాడు.

"ఏమిటలా పిచ్చాడిలా చూస్తున్నావు?"

"నీ కొమ్ములు ఎంత పైకి లేచాయో చూస్తున్నాను. నా కిక్కడుండాలనే వుత్సాహం లేదు. ఐయామ్ లీవింగ్!"

గంగాధర్ వ్యంగ్యంగా నవ్వాడు.

"నిక్సన్, యీ సంస్థనుంచి ఎవ్వరూ వెళ్ళిపోలేరు. బతికున్నంత కాలం ఇక్కడ పాటుపడాలి! ఇక్కడనుంచి పోడానికి ఒక్కటే మార్గం—డెత్!"

గాభరాగా చూశాడు నిక్సన్. గంగాధర్ దేవాంతకుడు. అతడిని ఎదిరిస్తే ఏమైనా చేస్తాడు.

"నేను మన రహస్య కార్యక్రమాలను గురించి ఎవ్వరికీ చెప్పనని హామీ యిస్తాను. లెట్ మి గెటవుట్!"

"నేనెవర్నీ నమ్మను!"

గంగాధర్ బజ్జర్ నొక్కాడు. మస్తాన్, సూర్యాదేవ్ గదిలోకి పరుగెత్తుకొచ్చాడు.

"వీడిని తీసుకెళ్ళి వెనుక నున్న గదిలో పడేసి తాళం వేయండి. నేను వచ్చి తర్వాత కార్యక్రమం చెప్తాను," గర్జించాడు గంగాధర్.

మస్తాన్, సూర్యదేవ్ అతడిని యిరువైపులా పట్టుకున్నారు.

"కామ్రేడ్స్, మనందరం కలిసి బాస్ మీద పడాలి! వాడు పోతే మనకు శని విరగడవుతుంది!"

గంగాధర్ అతడివైపు కదిలాడు. చేత్తో అతడి చంప మీద బలంగా కొట్టాడు. పెనుతుఫానులో విరిగి పడిన చెట్టులా నిక్సన్ నేలమీద పడిపోయాడు.

"వాడిని గదిలో పడేయండి!" అర్చాడు గంగాధర్.

# 9

గంగాధర్ గదిలోకి అతడు మెల్లిగా వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. అతడి వయసు యాభై దాటివుంటుంది. పాతకాలపు సూట్‌లో వున్నాడు. బట్టతల.

"నా పేరు విలియమ్స్. మా అబ్బాయి నిక్సన్ రెండు రోజుల నుంచి యింటికి రావడంలేదు. అతడు ఏమైనాడో మీకు తెలుసా?" అడిగాడతను.

"అతడు ఇక్కడకూ రాడంలేదు. లీవ్ లెటర్ కూడా పంపలేదు!" అన్నాడు గంగాధర్.

"పోలీస్ రిపోర్ట్ యివ్వడం మంచిదేమో!"

"మంచిదని తోస్తే వెంటనే ఇవ్వండి!"

స్ప్రింగు తలుపు తోసుకుని సూర్యదేవ్ లోపలకు

వచ్చాడు. దగ్గరగా వెళ్ళి ఏదో చీటీని గంగాధర్ కి యిచ్చాడు. ఆ చీటీని చదివి అతడు సూర్యదేవ్ వైపు తిరిగాడు.

"అతడు ఎప్పుడు ఫోన్ చేశాడు?"

"ఇప్పుడే, బెంగుళూర్ నుంచి డైరక్ట్ డయిలింగ్ చేసి నాతో మాట్లాడాడు," అన్నాడు సూర్యదేవ్.

"ఇదంతా ఆయనతో చెప్పు!" అన్నాడు గంగాధర్.

సూర్యదేవ్ యెదురుగావున్న విలియమ్స్ వైపు చూశాడు.

"మీరు నిక్సన్ తండ్రేనా?"

అతడు తలాడించాడు.

"మీ అబ్బాయి నిక్సన్ ఏదో రేప్ కేసులో యిరు కున్నాడట. అతనికోసం పోలీసులు గాలిస్తున్నారు. అతడు బెంగుళూరు పారిపోయాడు. అక్కడి నుంచి మరెక్కడికో పోతాడట! ఈ వార్త మీకు కూడా చెప్ప మని అతడు నాకు ఫోన్ లో చెప్పాడు. పోలీసులు మీ యింటికి వస్తే నిక్సన్ ఎక్కడున్నదీ తెలియదని మిమ్మల్ని చెప్పమన్నాడు" అన్నాడు సూర్యదేవ్.

"గుడ్ గాడ్, వాడిలా పాడైపోతాడని నేననుకో లేదు!" అన్నాడు విలియమ్స్.

"డోంట్ బాదర్! అయిందేదో అయింది. పరిస్థితులు బాగుపడ్డాక అతడు వెనక్కి తిరిగొస్తాడు" అన్నాడు గంగాధర్.

విలియమ్స్ కుర్చీలోంచి లేచాడు.

"ఈ వార్త మరెవ్వరికీ తెలియకుండా దయచేసి చూడండి. ఎంత హీనదశకు వాడు దిగజారినా, నిక్సన్ నా కొడుకే!"

"ఎవ్వరికీ చెప్పం. అతను యిక్కడ పని చేసేవాడు. మా కంపెనీకి చెడ్డ పేరు రావడం మాకూ మంచిదికాదు," అన్నాడు గంగాధర్.

విలియమ్స్ గదిలోంచి బయటకు వెళ్ళిపోయాడు. స్ప్రింగ్ తలుపు అతడి వెనకనే మూసుకుంది.

"వెల్ డన్, సూర్యదేవ్! నిక్సన్ శవాన్ని ఎక్కడ పడేశారు?"

"కారులో 20 మైళ్ళ దూరం తీసుకెళ్ళి పొదలపక్కన పాతిపెట్టాం. అటువైపు యెవ్వరూ వెళ్ళరు. నో డేంజర్!"

"గుడ్ వర్క్!" అని గంగాధర్ రెండు గ్లాసుల్లో స్కాచ్ విస్కీ పోసి, సోడా కలిపాడు.

"శని విరగడైంది. డ్రింకిట్!" అన్నాడు గంగాధర్.

# 10

టైమ్ పన్నెండు దాటింది.

అమావాస్య చీకటి. ఏడో వీధి చివర్న వుంది మాధవయ్య యిల్లు. అతడి యిల్లు దాటాక రెండు ఫర్లాంగుల దూరం వరకూ యిళ్ళు లేవు. విశాలమైన మైదానం వుంది. ఆ మైదానంగుండా రెలుపట్టాల వైపు పోవచ్చు.

సూర్యదేవ్, మస్తాన్ ఏడో వీధమ్మట రెండుసార్లు తిరిగారు. ఆ ప్రాంతంలో గస్తీ తిరిగే వాళ్ళను మస్తాన్ మరోవైపుకు తరలించాడు. వీధికుక్కలు వాళ్ళిద్దర్నీ చూసి మొరుగుతున్నాయి.

ఇద్దరూ మాధవయ్య యింటిముందు ఆగారు. వెదురు బొంగులతో కట్టిన తలుపు తోసుకుని గోడపక్కనే మెల్లిగా అడుగులేస్తూ వెనకవైపు వెళుతున్నారు.

ఇంటి వెనక చిన్నపాకలో ఒక ఆవూ, గేదే వున్నాయి.

ఆ పాకవైపు యిద్దరూ వెళుతున్నారు.

అమాంతంగా కుక్క మొరిగింది. సూర్యదేవ్ చూసే లోపల కుక్క అతడి కాలును కర్చి పట్టుకుని పళ్ళను లోతుగా దిగేసింది.

సూర్యదేవ్ దాన్ని చేత్తో బాదాడు కాని కుక్క పట్టు వదల్లేదు. మస్తాన్ కుక్క మెడను తన రెండు చేతుల్తోనూ బిగించి గట్టిగా నొక్కసాగాడు. కుక్క నోట్లోంచి సూర్యదేవ్ కాలు బయటపడింది. కుక్క బాధతో అరుస్తోంది.

"నువ్వు ఆవును బయటకు తోలుకుపో!" అన్నాడు మస్తాన్.

సూర్యదేవ్ పాకలోవున్న ఆవును విప్పి బయటకు తోలుకుపోయాడు.

కుక్క మెడను మస్తాన్ యింకా నొక్కుతూనే వున్నాడు కాని అది అంత సులువుగా చచ్చేటట్టులేదు.

సూర్యదేవ్ ఆవును మైదానంవైపు తోలుకుపోయాడు. కుక్కను వదిలి మస్తాన్ ముందువైపుకు పరిగెత్తాడు. అప్పుడే బయటకొచ్చిన మాధవయ్య అతడి కెదురుగా ప్రత్యక్షమయ్యాడు.

మాధవయ్య ఆజానుబాహుడు. కండలు తిరిగిన శరీరం. వయస్సు యాభై దాటినా అతడి బలం తగ్గలేదు.

ముళ్ళతీగల పైనుంచి మస్తాన్ దూకబోయాడు. మాధవయ్య అతడి తలమీద యినుపకడ్డీతో కొట్టాడు. మస్తాన్ కింద పడిపోయాడు.

మాధవయ్య బయటకు వురుకెత్తి మైదానం వైపు చూశాడు. దూరంలో తెల్లటి ఆవు అతడికి అస్పష్టంగా అగుపించింది. అతడు అటువైపు చిరుతపులిలా పరుగెత్తాడు.

తనవైపు వస్తూన్న వ్యక్తి మస్తాన్ కాదని సూర్యదేవ్ కనిపెట్టాడు. పాంటు జేబులోవున్న కత్తిని పైకి తీశాడు.

మాధవయ్య యినపకడ్డీతో సూర్యదేవ్ వైపుకొట్టేడు. అతడు అమాంతంగా వెనక్కు జరిగాడు. అతడికి తగల వలసిన దెబ్బ నేలకు తగిలింది. అదే క్షణంలో సూర్యదేవ్ కత్తిని మాధవయ్య గుండెల్లోకి దిగేశాడు.

క్షణకాలం ఇటూఅటూ తూలూ మాధవయ్య అమాంతంగా కిందపడ్డాడు. అతడి చావుకేక గాలిలో భయంకరంగా ధ్వనించింది.

ఆ కేక విని మస్తాన్ మేలుకున్నాడు. లేచినుంచున్నాడు. మైదానంవైపు కదిలాడు. తలనుంచి యిప్పుడు రక్తం కారడంలేదు.

సూర్యదేవ్ గబగబ మస్తాన్ దగ్గరకు వచ్చాడు.

"వాడిని చంపవలసి వచ్చింది!"

"చావనీ, గాడిద కొడుకుని!" అన్నాడు మస్తాన్.

ఆ వీధిలోని ఇళ్లలోని వాళ్ళు కిటికీల్లోంచి బయటకు చూస్తున్నారు. తలుపు తెరిచి వీధిలోకొచ్చే ధైర్యం ఎవరికీ లేదు.

"అవును ఏం చేద్దాం?"

"దాన్ని ఇక్కడే వదిలేసి పారిపోదాం," అన్నాడు మస్తాన్.

ఇద్దరూ వేగంగా రైలు పట్టాలవైపు పరిగెత్తారు. పట్టాలు దాటి అటువైపుకు వెళ్ళి వినాయకనగర్ చేరుకున్నారు.

ఫియట్ కారులో కూర్చుని గంగాధరం వాళ్ళకోసం ఎదురు చూస్తున్నాడు. వాళ్ళు దగ్గరవగానే అతడు వెనక తలుపు తెరిచాడు. వాళ్ళు ఎక్కాక తలుపుమూసి

గంగాధర్ కారును పోనిచ్చాడు.

"ఆవును ఎక్కడ దాచారు?"

"వదిలేశాం!" అన్నాడు మస్తాన్.

"యూ ఫూల్స్!" అరిచాడు గంగాధర్.

"మాధవయ్యను చంపవలసి వచ్చింది."

"అతడిని ఎందుకు చంపారు?"

"అతడిని చంపకపోతే మేం అతడిచేతుల్లో చావవలసి వచ్చేది," అన్నాడు మస్తాన్.

"నా ప్లాన్ని మీరు సర్వనాశనం చేశారు!" అన్నాడు గంగాధర్.

"బాస్, ఆ పరిస్థితుల్లో నువ్వూ మాలాగే చేసుండే వాడవు!" అన్నాడు మస్తాన్.

"షటప్, యూ బ్లడీ పిగ్!" అరిచాడు గంగాధర్.

## 11

కారులో కూర్చున్న గంగాధర్ గ్లాసులో విస్కీ పోసుకుని గడగడ తాగేశాడు. టైమ్ చూశాడు. ఒంటిగంట కావస్తోంది.

సిగరెట్ తాగవడుల్తూ అతడు సమీపంలో వున్న పొదలవైపు చూశాడు. కాస్సేపట్లో పుష్కరాజు కారు దగ్గరకొచ్చాడు. పారను డిక్కీలో పెట్టి మూశాడు. మెల్లిగా వెళ్ళి ముందు సీటుమీద కూర్చున్నాడు. స్కాచ్ విస్కీ పోసిన గ్లాసును గంగాధర్ అతడికి అందించాడు.

"మైడియర్ ఫ్రెండ్, డ్రింకిట్!" అన్నాడతను.

పుష్కరాజు గడగడ తాగేశాడు.

"ఇటుపైన నువ్వు నా కుడిభుజానివి! వాళ్ళు పోవడం మూలంగా నీవాటా పెరుగుతుంది! బి హేపీ!" అన్నాడు గంగాధర్.

"ఇదంతా నాకు సంతోషంగా లేదు. వాళ్ళు మన మిత్రులు. మనతో పాటుపడ్డారు. ఈనాడు వాళ్ళను వీధి కుక్కల్లా చంపి పాతేశాం! ఇది న్యాయం కాదు," అన్నాడు పుష్కరాజు.

"వాళ్ళు బ్రతికుంటే మాధవయ్య హత్యలో యిరుక్కుంటారు. వాళ్ళ మూలంగా మనకూ ప్రమాదం వస్తుంది. మన ప్రాణాలను కాపాడుకోడంకోసం వాళ్ళని చంపవలసి వచ్చింది. ఆవును తోలుకు రమ్మంటే మాధవయ్యను వాళ్ళు చంపి వచ్చారు. తప్పెవరిది? వాళ్ళదా? మనదా?" అడిగాడు గంగాధర్.

విస్కీగ్లాసును పుష్కరాజుకు యిచ్చాడు. అతడు మరోపెగ్ వేగంగా సేవించాడు. ఇప్పుడు వుషారుగా వుంది. తను పాతిపెట్టిన మిత్రుల్ని మరచిపోయాడు.

"యూ ఆర్ రైట్ బాస్," అన్నాడతను.

"ఈ సంపదకోసం ఎక్కువ పాటుబడింది నువ్వూ, నేనూ. వాళ్ళుకాదు. ఇప్పుడు మనం అఖండంగా జీవించవచ్చు. డబ్బుకు కొరత వుండదు. హోటల్ మెరీని త్వరలో మనం కొందాం. మన వ్యాపారం అలా అలా ఆకాశందాకా పెరిగి పోతుంది!"

"ఫయిన్!" అన్నాడు పుష్కరాజు.

గంగాధర్ కారును మెల్లిగా దూరంలోవున్న రోడ్డు వైపు పోనిచ్చాడు. కాస్సేపట్లో కారు రోడ్డుమీదకు చేరుకుంది. కారు స్పీడును హెచ్చించాడతను.

# 12

ఇన్‌స్పెక్టర్ మురుగన్ మాధవయ్య భార్యతో మాట్లాడి ఎదురుగా వున్న యింట్లోకి వెళ్ళాడు.

"రండి, ఇన్‌స్పెక్టర్" అన్నాడు నాగరాజన్.

హాలులో సోఫాలో కూర్చున్నాడు ఇన్‌స్పెక్టర్. నాగరాజన్ వైపు చూశాడు.

"గతరాత్రి జరిగినది మీరు చూశారా?"

"చూడలేదని చెప్పండి," తలుపు వెనుకనుంచి భార్య ప్రోమ్ట్ చేసింది.

"నేను చూసేసరికి దొంగలు పారిపోయారు."

"ఇక్కడ దొంగతనాలు యెక్కువగా జరుగుతూ వుంటాయా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"మునుపు జరిగేవి. హోమ్ సెక్యూరిటీ మనుషులు గస్తీ తిరగడం మొదలెట్టాక లేవు."

"ఆ కంపెనీ ఎక్కడుంది?"

నాగరాజన్ లోపలకువెళ్ళి ఒక కార్డుతెచ్చి ఇన్‌స్పెక్టర్‌కి ఇచ్చాడు.

"వాళ్ళకు నేను నెలకు 20 రూపాయలు కడతాను. మా యింట్లో దొంగలు పడకుండా చూసే బాధ్యత వాళ్ళది."

"మాధవయ్యకూడా మెంబరా?"

"ఆయన చేరలేదు. చేరుంటే యీ దొంగతనం జరిగేది కాదేమో!"

"ఎక్కువగా మాట్లాడకండి. ఆయాసం వస్తుంది," సలహా యిచ్చింది భార్య తలుపు వెనకనుంచి.

"ఇప్పుడు జరిగినది హత్య, దొంగతనం మాత్రమే కాదు. వాళ్ళు ఆవును వదిలి పారిపోయారు. ఆవు ఇంటికి తీసుకు రాబడింది."

"మాధవయ్యకు బదులు ఆవు చనిపోయినా బాగుండేది!"

"నిన్నరాత్రి ఆ కంపెనీ మనుషులు గస్తీ తిరిగారా?"

"నిన్న రాత్రి వాళ్ళు తిరగలేదు, ఎందువలనో!"

ఇన్‌స్పెక్టర్ మురుగన్ లేచి బయటకు నడిచాడు. జీప్ రోడ్డమ్మట దూసుకుపోయింది.

*　　　*　　　*

ఇన్‌స్పెక్టర్ గంగాధర్ వంక నవ్వుతూ చూశాడు.

"మీ సహాయం నాకు కావాలి. నిన్నరాత్రి మీ మనుషులు విజయానగర్, ఏడో వీధిలో గస్తీ తిరిగారా?"

"తిరిగారు."

"అక్కడ గస్తీ ఎవరు తిరుగుతారు?"

"మనుషులను మేం మారుస్తూ వుంటాం. నిన్న ఎవరు తిరిగారో కనుక్కొని చెప్పాలి!"

"కనుక్కోండి!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

గంగాధర్ బెల్ నొక్కాడు. పుష్కరాజు గదిలో కొచ్చాడు. ఇద్దరూ ఏదో గుట్టుగా మాట్లాడుకున్నారు.

"వీరరాజు, సుబ్బయ్య అక్కడ గస్తీ తిరిగారు."

"వాళ్ళు యిక్కడ వున్నారా?"

"వాళ్ళు ఇక్కడకు ఎప్పుడో గానీ రారు."

"థాంక్స్" అని ఇన్‌స్పెక్టర్ మురుగన్ బయటకు కదిలాడు.

*　　　*　　　*

రోడ్డమ్మట నడుస్తూ లాఠీతో చప్పుడు చేస్తున్న ఆతడి పక్కనే ఆగింది జీపు.

"నీ పేరు?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"పేదరాజు సార్."

"నిన్న రాత్రి ఇక్కడ గస్తీ ఎవరు తిరిగారు?"

"నేనే సార్."

"రాత్రల్లా తిరుగుతూనే వున్నావా?"

"పదింటికి యిటువైపు వచ్చాను. మస్తాన్ గారు స్కూటర్‌లో వచ్చి నన్ను మరోచోటికి వెళ్ళి గస్తీతిరగమన్నారు."

"మస్తాన్ ఎవరు?"

"మా యజమానండి."

"నిన్న యిక్కడ ఎవ్వరూ గస్తీ తిరగలేదన్న మాట!"

"మరెవర్నో పంపుతానని మస్తాన్ గారు అన్నారు."

ఇన్‌స్పెక్టర్ మురుగన్ సౌజ్ఞను గుర్తించి డ్రయివర్ జీప్‌ను పోనిచ్చాడు.

ఇన్‌స్పెక్టర్ ఆలోచిస్తున్నాడు. గంగాధర్ తనకు అసత్యం ఎందుకు చెప్పాడు? మస్తాన్ ఎవరు?

అరగంట తర్వాత జీప్ కాంపౌండులో ఆగింది. మేడ మీద నుంచి పుష్కరాజు కిందకు పరుగెత్తుకొచ్చాడు. ఇన్‌స్పెక్టర్ అతడి వెనకనే మెట్లెక్కి పైకి వెళ్ళాడు.

ఏర్‌కండిషండ్ గదిలో గంగాధర్ సోఫాలో కూర్చునివున్నాడు. టీపాయ్ మీద స్కాచ్ విస్కీ బాటిల్, గ్లాసులు వున్నాయి. గంగాధర్ మంచి నిషాలో వున్నాడు. పుష్కరాజు తూలుతున్నాడు.

"కమాన్ ఇన్‌స్పెక్టర్, మై ఫ్రెండ్! డ్రింక్ సమ్ స్కాచ్ విస్కీ!" అన్నాడు గంగాధర్.

అతడివైపు యిన్‌స్పెక్టర్ సూటిగా చూశాడు.

"మస్తాన్ మీ కంపెనీలో పని చేస్తున్నాడా?"

"ఉద్యోగం మాని వెళ్ళిపోయాడు."

"ఎప్పుడు మానేశాడు?"

పుష్కరాజు గంగాధర్ వెనక్కి జరిగాడు. అతడి మెడమీద నిమిరాడు.

"ఇవాళ నుండి మా నేశాడు!"

"అతడి అడ్రెస్ ఇవ్వండి."

"అతడు బొంబాయి వెళ్ళిపోయాడు. ఇంట్లో వుండడు."

ఇన్స్పెక్టర్ అతడివంక అనుమానంగా చూశాడు.

"ఈ రాష్ట్రంలో మద్యం నిషేధించబడింది. మీరిద్దరూ తాగి తూలుతున్నారు!"

"మాకు పెర్మిట్లు వున్నాయి." అన్నాడు గంగాధర్.

"మీ వయస్సుల్లో వున్న వాళ్ళకు ప్రభుత్వం పెర్మిట్లు యివ్వదు!" అన్నాడు ఇన్స్పెక్టర్.

గంగాధర్ జేబులోంచి వందరూపాయల నోటు తీశాడు.

"ఇన్స్పెక్టర్, యీ డబ్బు మీకు వుపయోగపడుతుందేమో!"

ఇన్స్పెక్టర్ మురుగన్ విజిల్ వూదాడు. నలుగురు కానిస్టేబుల్సు గదిలోకొచ్చారు.

"వీళ్ళిద్దర్నీ పోలీస్ స్టేషన్ కి చేర్చండి!" అరిచాడతను.

* * *

ఇన్స్పెక్టర్ మురుగన్ కి ఎదురుగా ఉమాపతి కూర్చుని వున్నాడు. అతడి కళ్ళు మెరుస్తున్నాయి. "గంగాధర్ వేలిముద్రల్ని మీ సిగరెట్ కేసుమీద వేలిముద్రలతో పోల్చిచూశాం. ఆనాడు మిమ్మల్ని ఆపి, మీ డబ్బును కొంగిలించినది అతడే అని రుజువైంది. చివరకి అతడు అంతా ఒప్పేసుకున్నాడు. పుష్కరాజు మా ముందు

కొండలా పగిలి నిజాన్ని కక్కేశాడు. అటు పైన గంగాధర్ కూడా ఒప్పుకోవలసి వచ్చింది. మీకు చాలా థాంక్స్. మీ సిగరెట్ కేసు నాకు ఆ నాడు యివ్వడం వలన ఒక డేంజరస్ హంతకుడిని మేం పట్టుకోగల్గాం," అన్నాడు ఇన్‌స్పెక్టర్ మురుగన్.

"దొంగగా ప్రారంభించి చివరకు అతడు హంతకుడిగా మారేడన్న మాట?" అడిగాడు ఉమాపతి.

"క్రయిము అగాధంలోకి దిగిన మనిషి ఇంకా అడుక్కి జారిపోతాడు! ఆపుకునే శక్తి మనిషికుండదు!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ మురుగన్.

—— :ఐపోయింది :——

# చచ్చి సాధించాడు?

## పరువు ఖరీదు—చివరిభాగం

## 'సికిందర్'

నేను రెండుసార్లు ఇద్దరిచేత ఫూల్ నయ్యాను.

మొదటిసారి ఖమ్మంలో శంకర్ చేత: రెండవసారి ఇక్కడ జానీ చేత.

తిరిగి యింటికొచ్చేటప్పటికి చీకటి పడింది. నన్నెవరూ వెంటాడకుండా జాగ్రత్త తీసుకున్నాను.

ఆ సాయంత్రం ప్రత్యేకంగా వెలువడ్డ 'ఈ నాడు' సిటీ ఎడిషన్ కొని తెచ్చుకున్నాను.

బెడ్ మీద పడుకుని పెద్ద పెద్ద అక్షరాలతో వున్న హెడ్ లైన్స్ ఆత్రుతగా చదివాను:—

సేఠ్ రంగూన్ వాలా వంటమనిషి వజ్రాల హారంతో పరారీ!

హైద్రాబాద్, మార్చి 2—నగరంలో ప్రముఖ వ్యాపారి శ్రీ రంగూన్ వాలా ఇంట్లో గతరాత్రి దొంగ

తనం జరిగినట్టు తెలుస్తోంది. ఈ ఉదయం ఆయన తమ వజ్రాలహారం కనిపించడం లేదని పోలీసురిపోర్టు యిచ్చి నప్పుడు దొంగతనం బయటపడింది.

సుమారు పదిలక్షలు విలువజేసే ఈ వజ్రాలహారం ఆయన రహస్యంగా దాచుకున్న స్థలం నుంచి అదృశ్య మైంది. ఈ అపురూపమైన హారాన్ని ఆయన తన భార్య కోసం నాలుగేళ్ళ క్రితం చేయించారు.

ఈ వార్త తెలిసిన వెంటనే పోలీసులు ఆయన ఇంటికి వెళ్ళారు.

అసిస్టెంట్ కమీషనర్ శ్రీ దేవరాజ్ పర్యవేక్షణలో డిటెక్టివ్ ఇన్స్పెక్టర్స్ శ్రీయుతులు శివ నేశన్, డేవిడ్ లు కేకలు దర్యాప్తు చేస్తున్నారు.

ఆసక్తికరమైన విషయమేమిటంటే శ్రీ రంగనాన్ వాలా ఇంట్లో ఆయన వంటమనిషి కన్పించడంలేదు. ఆయన సెక్రటరీ కమలాకర్ కథనం ప్రకారం వంట మనిషి రంభ నిన్న సాయంత్రం అతని వద్దకువచ్చి మైసూర్ వెళుతున్నట్టు చెప్పినట్టు తెలుస్తోంది.

అప్పుడామె ఒక టెలిగ్రాం కూడా చూపించింది. మైసూర్ లోవున్న తన తమ్ముడి ఆరోగ్యం బాగోలేదని ఆ టెలిగ్రాం సారాంశం.

కానీ, ఆమె కథనం అబద్ధమని పోలీసులు భావిస్తున్నారు. అనారోగ్యంగా వున్నాడని చెప్పబడ్డ ఆమె తమ్ముడిక్కడే వున్నాడనీ, అసలామెకి నిన్న సాయంత్రం ఏ టెలిగ్రామూ అందలేదనీ దర్యాప్తులో తేలింది.

దీనివల్ల ఆమె మైసూర్ వెళ్ళలేదనీ, నగ అపహరించి పారిపోయిందనీ పోలీసులు నిశ్చయానికొచ్చారు.

అయితే దొంగతనం జరిగిన స్థలంలో యెలాంటి వేలి ముద్రలూ లభించలేదు. సేఫ్ నగ దాచుకున్న రహస్య స్థలం గురించి ఆయన సెక్రటరీ ఒక్కడికే తెలుసు. అతను నాలుగేళ్ళుగా విశ్వాసంగా పనిచేస్తున్నాడనీ, తనకి ద్రోహం తలపెట్టే వీలులేదనీ శ్రీ రంగూన్‌వాలా సెక్రటరీ గురించి చెబుతూ వ్యాఖ్యానించారు.

పోలీసులు సెక్రటరీ కమలాకర్‌ని ప్రశ్నించారు. అతని స్టేట్‌మెంట్‌లో కొన్ని లోపాలున్నాయనీ, ఐనా ప్రస్తుతం అతని మానసిక స్థితి దృష్ట్యా డిస్టర్బ్ చేయటం మంచిదికాదనీ, అతన్ని తన బాస్ విశ్వాసానికే వదిలేశామని శ్రీ దేవరాజ్ చెప్పారు.

నెలరోజుల క్రితం కమలాకర్ ప్రియురాలు ప్రమాదంలో చనిపోగా అతను మెంటల్ షాక్‌కి గురయినాడని తెలుస్తున్నది.

పోలీసులు కేసును వేగంగా దర్యాప్తు చేస్తున్నారు. పరారీలోవున్న వంటమనిషిని తీవ్రంగా గాలిస్తున్నారు. గాలింపు చర్యను రాష్ట్రంలోనేగాక, ఇతర రాష్ట్రాలకు కూడా వ్యాపింపజేసినట్లు దేవరాజ్ చెప్పారు.

ఆమె తమ్ముడిని కస్టడీలోకి తీసుకున్నారు. తన సోదరి గురించి ఏమీ తెలియదని అతను అంటున్నాడు. వారిద్దరి మధ్య ఘర్షణ జరిగి మాటలు లేవని తెలుస్తున్నది....

ఆ తర్వాత విషయాలు ఆసక్తికరంగా లేవు.

పేపరు పక్కనపెట్టి ఆలోచించాను.

రంభ హత్యచేయబడినట్లు పోలీసులకి ఎంత త్వరలో తెలుస్తుంది? హత్య బయటపడ్డాక అనుమానం యెవరి మీదికి వెళుతుంది? ఆమె సుమారు నలభయ్యేళ్ళ విధవ.

ప్రేమికులుండే అవకాశం లేదు. ఆమెకి బంగళా తప్ప బయటి ప్రపంచంతో సంబంధం లేదు. కాబట్టి ఆమెకి తెలిసిన వాళ్ళు లేరనే అనుకోవాలి.

మరి ఆమెని చంపి నగ నెవరు అపహరించినట్టు?

ఈ ప్రశ్నకి సమాధానం పోలీసులకి సూటిగా దొరుకుతుంది: మిస్టర్ కమలాకర్, రంభకి పరాయి వ్యక్తులు తెలియరు, కమల్ తప్ప. రహస్యస్థలం గురించి ఇంకెవరికీ తెలీదు, కమల్ కి తప్ప!

ఈ ఆలోచనలతో పోలీసులు రంగంలో దిగారంటే నా నాశనం తప్పదు. నేను శంకర్ నికూడా అప్పుడు వెలుగులోకి లాగి నన్ను రక్షించుకునే ప్రయత్నం చేయవచ్చు, అది వేరే విషయం—కానీ నా బాస్ సంగతి యేమిటి? నేను హంతకుడ్ని, దొంగని అని తెలిసి బాస్ ఎలా రియాక్ట్ అవుతాడు? ఇది వూహించకూడని భయంకర ఆలోచన!

కాబట్టి నా బ్లాక్ బిజినెస్ గురించి బాస్ కెలాంటి అనుమానం కలక్కుండా నేను బయటపడి—అతన్ని రక్షించాలి!

అందుకేం చేయాలి?

ఈ ప్రశ్న నన్ను నిర్వీర్యుణ్ని చేస్తోంది!

ఇందులోంచి బయటపడ్డం అంత సులభంకాదని అనిపిస్తోంది: నా కిద్దరు శత్రువులున్నారు. వాళ్ళని ఫూల్ చెయ్యడం అసాధ్య మనిపిస్తోంది.

ఆలోచనలతో తల బరువెక్కి పోటువస్తోంది. నీరజ చనిపోయినప్పటినుంచీ నేను మనశ్శాంతి కోసం వాడుతున్న లిబ్రియం టాబ్లెట్స్ రెండు వేసుకొని కాసేపు పడుకున్నాను.

గంటసేపటి తర్వాత పూర్తిగా మనస్సు తేలికపడింది. ఇప్పుడెంతో సుఖంగావుంది. ఎలాటి ఆలోచనలూ, భయాలూ లేవు.

ఆ తర్వాత మరో గంటసేపట్లో మూడు ఫోన్ కాల్స్ వచ్చాయి.

మొదటిది బాస్ నుంచి, రెండవది డాక్టర్ నుంచి, మూడవది దేవరాజ్ నుంచి.

బాస్ ఫోన్ చేసి ధైర్యం చెప్పాడు. పోలీసులు నా దరికి రాకుండా చేశానని చెప్పాడు. ఇక వారి గురించి ఆందోళన పడవద్దన్నాడు. రేపుదయం ఆఫీసుకు రాకూడదనికూడా అన్నాడు. ఇక్కడ నచ్చకపోతే ఖమ్మంవెళ్ళి పొమన్నాడు. నే నభ్యంతరం చెప్పాను.

డాక్టర్ ఫోన్ చేసి నాకు మరింత ధైర్యం చెప్పాడు: తను దేవరాజ్ కి ఫోన్ చేసి నా విషయం మాట్లాడానని చెప్పాడు. నన్ననుమానించడంలో అర్థంలేదనీ, ప్రేయసిని పోగొట్టుకొని ఏడుస్తున్న నాకు బ్రతుకుమీద ఆసక్తి పూర్తిగా నశించిందనీ, బ్రతుకుమీద ఆసక్తి లేనప్పుడు అంత విలువయిన వజ్రాలహారం కాజేసి విలాసంగా బ్రతుకుతాడనుకోడం హాస్యాస్పదమనీ.... ఇలాటి వాస్తవాలెన్నో వివరించి, చివరికి నామీద అతనికున్న అనుమానాల్ని పారద్రోలాననీ చెప్పాడు. నేను కృతజ్ఞతలు చెప్పుకున్నాను.

ఆతర్వాత దేవరాజ్ ఫోన్ చేసి విచారం వెలిబుచ్చాడు: అనుమానించడం తమ విధి నిర్వహణలో ఒక అంశమనీ, అంతే తప్ప అనుమానించిన ప్రతివారూ నేరస్తులు కాలేరనీ, కాబట్టి ఆందోళన పడవద్దనీ అన్నాడు. ఆ రహస్య

సలం గురించి నా ఒక్కడికే తెలియడం నా గురదృష్ట మని చెప్పాను. అతను నవ్వి ఫోను పెట్టేశాడు.

ఎలాటి ప్రశ్నలూ అడగనందుకు సంతోషించాను.

నామీద ఇప్పుడెవరికీ అనుమానం లేదు. ముందు ఏర్పడే ప్రమాదం వుందన్న విషయం మరవకూడదు. అందువలన ఏదో ఒకటి చెయ్యాలి. నా ప్రయత్నాలు ఎలా ప్రారంభించాలి? దేన్ని లక్ష్యంగా ఎన్నుకుని రంగంలో దిగాలి?

జానీ దగ్గరవున్న కాయితమా?

శంకర్ దగ్గరవున్న ఫోటోలా?

ఫోటోలు అన్నివిధాలా అనువుగాలోచాయి. అయితే అవి నాకెలా ఉపయోగ పడతాయి? వాటిలో వీక్ పాయింట్స్ ఏమిటి? నాకు తట్టలేదు. ఎంత ఆలోచించినా ఆ ఫోటోల్లో లోపం దొరకలేదు. వాటిలో నా ముఖ భావాలు సహజంగా వున్నాయి—సన్నివేశానికి తగ్గట్టుగా. నా కారు, శవం, పారా, పలుగు, గొయ్యి నా ముఖంలో భయం, ఆందోళన....ప్రతీది నన్ను పట్టిస్తాయి.

ఆ రాత్రంతా ఫోటోల గురించే ఆలోచిస్తూ గడిపాను. మధ్యమధ్య నిరాశ ఎదురవుతుంటే ఆ ఆలోచనలు మాను కుని, నీరజ గురించి ఆలోచించసాగాను.

నీరజ!

నరకంకంటె హీనమైన ఈ గందరగోళంలో నన్ను పడేసి క్షేమంగా వెళ్ళిపోయింది....

ఆ రాత్రి నా సమస్యకు పరిష్కారం దొరకలేదు.

## 2

మర్నాడు ఉదయం మాధవి ఫోన్ చేసింది.

నా ఆశ్చర్యానికి అంతులేదు! నేనసలు మాధవిని పూర్తిగా మర్చిపోయాను. కానీ నే నామెకి జ్ఞాపకం వున్నాను. కనీసం ఒక్కసారికూడ ఫోన్ చేసి ఆమెతో మాట్లాడాలన్న ఆలోచన నాకు రాలేదు. ఆమె గురించి పూర్తిగా మర్చిపోయాను.

"హల్లో, కమల్, మాధవిని మాట్లాడుతున్నాను."

"మీరా! ఎక్కడ్నించి?"

"ఖమ్మంనుంచే—ఇంకా హాస్పిటల్ లో నే వున్నాను."

"సారీ—వస్తానని రాలేకపోయాను."

"ఆ విషయం వదిలేయండి—నేను విన్నది నిజమేనా?"

"ఏమిటి?"

"ఉదయం పేపర్లో చదివాను. మీ బాస్ నగ...."

ఉలిక్కిపడ్డాను: "పత్రికలు అబద్ధాలు వ్రాయవు, మాధవీ. నిజం. అందుకే రాలేకపోయాను."

నిట్టూర్పు: "ఫరవాలేదు. మీరు క్షేమంగా వుంటే చాలు—"

"మీ ఆరోగ్యం ఎలావుంది?"

"ఫరవాలేదు. రెండురోజుల్లో డిస్చార్జి చేస్తారు. కమల్, ఆ నగ ఎక్కడవుందో మీకూ బాస్ కూ తప్ప ఎవరికీ తెలియదట?"

ఆమె ఉద్దేశ్యం అర్థంకాలేదు, "అవును" అన్నాను.

మళ్ళీ నిట్టూర్పు: "నాకు భయంగావుంది. ఆ కేస్ లో మీరు ఇరుక్కోరు కదా?"

"నా బాస్ వున్నంతవరకూ నన్నెవరూ ఎందులోనూ ఇరికించరు!"

"కానీ, మిస్టర్ కమల్.... నాకు జానీ గురించి భయంగా వుంది."

"ఎందుకు?"

"ఇక్కడ్నుంచి పారిపోయాడు. అక్కడికొచ్చాడా?"

"లేదు!"

"మీ కోసమే వెతుకుతున్నాడని యిక్కడందరూ అనుకుంటున్నారు. వాడు మిమ్మల్ని...."

"మీరేమీ భయపడకండి! వాడికి మరోసారి బుద్ధి చెస్తాను. ఏం?"

"మీరిక్కడికి వచ్చి అనవసర చిక్కులు తెచ్చుకున్నారు" ఆగిపోయి మళ్ళీ అందామె. "కమల్?"

"ఏమిటి?"

"ఎప్పుడొస్తారిక్కడికి?"

"దేనికి?"

నవ్విందామె, "మర్చిపోయారా? మా నాన్న సలహా ఇచ్చారంటే పాటించి తీరాల్సిందే!"

"కానీ....ఇప్పుడు...." ఏం చెప్పాలో తోచలేదు. ఇక్కడి పరిస్థితుల దృష్ట్యా నేను తిరిగి ఇప్పట్లో ఖమ్మం వెళ్ళడం మంచిదికాదు.

"ఏమిటి కమల్?" అందామె. నా కెందుకో ఆమె గొంతులో గాభరా గోచరించింది.

"ఏమీ లేదు—నేనక్కడికి రాక తప్పదంటారా?"

"రావాలి! వచ్చి తీరాలి!" అర్చిందామె. నా చెవి చిల్లుపడింది.

"ఎందుకలా గాభరా పడుతున్నారు? మీరు ధైర్యస్థులు కదా?" అన్నాను.

అవతల నిట్టూర్పు: "సారీ! గాభరా పడ్డంలేదు.... కమల్! అయితే మీరిక్కడికి రారా?" ఆమె గొంతు మళ్ళీ గాభరాగా పలికింది.

"వస్తాను—వీలు చూసుకుని" అన్నాను.

"త్వరగా రావాలి!"

నేను సీరియస్‌గా అన్నాను: "చూడండి మాధవి గారూ, ఏమిటి సంగతి? మీ ధోరణి అర్థం కావడము లేదు!"

"కమల్! మీరిక్కడికివస్తే చాలా విషయాలుమాట్లాడాలి" అందామె.

"ఎలాంటి విషయాలు?"

"అర్థం చేసుకోలేరా?"

"అంటే?" అసహనంగా అన్నాను.

"పిచ్చి కమల్!—మిమ్మల్ని ప్రేమిస్తున్నాను!"

నా గుండెలో బాంబు పేలింది. నోరు తడారి మాట పెగల్లేదు.

మాధవి మళ్లీ అంది, "మీరు నీరజని పూర్తిగా మర్చిపోయారు కదూ?"

ఛటుక్కున తేరుకున్నాను: "లేదు! ఆమెను మరువలేను! పూర్ లవర్! ఐ మస్ట్ రిమెంబర్ హర్!"

"ఓ....అలాగా...."

ఆమె మాటలు అసంపూర్తిగా వుండిపోయాయి.

ఏం చెప్పాలో నాకు తోచలేదు. అవతలినుంచి నిట్టూర్పు విన్పించింది. ఆ తర్వాత లైన్ కట్ అయింది.

నేను స్థాణువై పోయాను.

# 3

టెలిఫోన్ విసిరికొట్టి బెడ్ మీద కూలబడ్డాడు.

బలవంతంగా ఆందోళన దూరం చేసుకుని ఆలోచించాను: మాధవి నన్ను ప్రేమిస్తోంది. కానీ, నేను ఖమ్మంలో

గడిపిన నాలుగురోజుల్లో ఆమెలో అలాంటి ఛాయలేమీ గోచరించలేదు. మరిప్పుడేమిటి? యెందుకీ హఠాత్ నిర్ణయం?

నిట్టూర్చాను: నీరజ జ్ఞాపకం వచ్చింది. ఆమెని మర్చిపోగలనా?

మాధవి మాటలు చెవుల్లో మార్మోగి నేనెంత కాలమూ దేవదాసుగా వుండలేనని తేల్చుకున్నాను. నిజజీవితంలో అలాంటి సెంటిమెంట్స్ పనికిరావని తెలుసుకున్నాను. నీరజని మరువను. మాధవిని వదలను—ఇది నా అంతిమ నిర్ణయం.

ఈ నిర్ణయం నన్నెంతో ఉక్కిరి బిక్కిరి చేసింది. చక్కిలిగింతలు పెట్టింది. ఒళ్ళు పులకరించింది.

మరుక్షణం సముద్రమంత నిరాశ ఎదురైంది.

ప్రస్తుతం నేను సముద్రంలో మునిగివున్నట్లే లెక్క. పైకి తేలాలి, ఈత కొట్టాలి, మాధవిని చేరుకోవాలి.

ఈ మూడూ అంత సులభం కావు. అలాగని చేతులు ముడుచుకుని కూచుంటే లాభంలేదు—ఎలాగైనా ఈ గండంనించి బయటపడి మాధవిని చేరుకోవాలి. ఆమెని నిరాశపరచి, ఆ తర్వాత ఏ అఘాయిత్యానికో పాల్పడే ప్రమాదం కలగజేయకూడదు!

కానీ యెలా బయటపడాలి?

రాత్రంతా ఫోటోల గురించి ఆలోచించాను. ఎన్నో పాయింట్స్ తట్టినా, అవి పనికిరానివి. ఇప్పుడింకా తీవ్రంగా ఆలోచించాలి. శంకర్ నన్ను అక్రమంగా హత్యలో యిరికించాడు. ప్రతి అక్రమాన్ని బయటపెట్టే ఆధారం తప్పకుండా ఏదో ఒకటి వుంటుంది!

నేరం దాగనట్టు అక్రమం కూడా దాగదు.

శంకర్ ఏదో పొరపాటు తప్పకుండా చేశాడు. అదేమిటో అతనికింకా తట్టలేదు. అతనికి తట్టకముందే నేను పసిగట్టాలి! అతనికి తెలిసేలోపునే నా వలలో బిగించాలి.

కాఫీ చేసుకుని తాగాను.

సమయం ఉదయం తొమ్మిదయింది. ఈ రోజు ఆఫీసుకు వెళ్ళనవసరంలేదు. నా మీద పోలీసు నిఘాలేదు. ఈ రోజే నేనేదో ఒకటి చెయ్యాలి.

హఠాత్తుగా నాకేదో ఆలోచన తట్టింది....

అదేమిటో స్పష్టంగా తెలియలేదు. నిన్న మధ్యాహ్నం శంకర్‌తో మాట్లాడుతున్నప్పుడు కూడా ఏదో విషయం నా మెదడులో జొరబడి జారిపోయింది—ఏమిటది?

గట్టిగా కళ్ళు మూసుకుని పదిసార్లు ఊపిరి పీలుస్తూ వదలసాగాను. మెదడులోని పనికిరాని చెత్త ఎగిరిపోయింది. కళ్ళు తెరిచేటప్పటికి ఆ విషయం యేమిటో తెలిసిపోయింది!

శంకర్ ప్లాట్‌లోని వీక్ పాయింట్ కనిపెట్టేశాను!

నా గుండె వేగంగా కొట్టుకుంది.

ఈ వీక్ పాయింట్—నన్ను బయటపడేస్తుందా!

వేగంగా ఆలోచించాను: సందేహంలేదు! తిరుగులేని వీక్ పాయింట్! ఈ పాయింట్‌తో ఎవరూ నా మీద హత్యకేసు బనాయించలేరు!

సంతోషంతో ఎగిరి గంతేసి మరోసారి కాఫీ తాగేశాను.

కాస్సేపటికి అదుపుతప్పిన సంతోషాన్ని హద్దుల్లో వుంచగల్గాను.

తాడైతే దొరికిందిగానీ దాన్ని పులి మెడలో బిగించాలి కదా?

నా వీక్ పాయింట్ ని ఎలా ఉపయోగించుకోవాలి?

శంకర్ లాటి చిరుత పులిని, జానీలాటి చింపాంజీని, ఎలా నా గుప్పిట్లో బంధించాలి?

మరో గంట సేపు ఇలాటి ఆలోచనలతో గడిపాను.

నా ఆలోచనా క్రమం గజిబిజి కాకుండా అక్షర రూపంలో పెట్టాను. రంగంలో దిగటానికి కావలసిన పథకాన్ని విపులంగా వ్రాసాను. వ్రాసింది పదేపదే చదువుకుని లోపాలేమీ లేకుండా సవరించాను. రంగంలో దిగడానికి మొదటి అడుగు యెక్కడ వెయ్యాలో, ఆ తర్వాత ఏ ఏ మార్గాలనుసరించాలో వివరంగా వ్రాసుకున్నాను.

ఈ ఉపాయం నాకు తట్టకపోతే, నా సర్వనాశనం తప్పేది కాదు?

జానీమీద ఒక ట్రిక్, శంకర్ మీద ఒక ట్రిక్ ప్రయోగించాలి—అంతే, నెగిటివ్స్ తో సహా ఫోటోలు, జానీకి వ్రాసిచ్చిన కాయితం, సెక్లేసు—వచ్చి నా చేతిలో పడతాయి.

ఆ తర్వాత: నగ తిరిగి యథాస్థానంలో పెట్టేసి బాస్ తో నాటకమాడతాను.

అతనికి ఫోన్ చేసి రంభగొంతు ననుకరిస్తూ మాట్లాడతాను.

అప్పుడేం మాట్లాడాలో ఇలా వ్రాసుకున్నాను:

'సాబ్! నేను రంభని మాట్లాడుతున్నాను. మీకు ద్రోహం తలపెట్టిన పాతకిని! నేను చేసిన ద్రోహానికిప్పుడు

పశ్చాత్తాప పడుతున్నాను. మీరు నన్ను క్షమించనవసరం లేదు. ఆ అర్హత కోల్పోయాను.

మీ దగ్గర దొంగిలించిన నెక్లేసు నాకు మనశ్శాంతి లేకుండా చేసింది. క్షణికావేశంలో చేసే పనులు ఎలాంటి పరిణామాలు సూచిస్తాయో తెలుసుకున్నాను. ఆ నెక్లేసును నేనెందుకు దొంగిలించవలసి వచ్చిందో చెప్పలేను. నాపై మీరు వుంచిన విశ్వాసాన్ని, చూపించిన ఆదరాభిమానాన్ని ఎందుకు వమ్ముచేశానో అర్థంకాదు!

మీకు ద్రోహంచేసి, ఈ హారంతో సుఖంగా బ్రతకలేనని తెలిసింది. అందుకే దాన్ని తిరిగి యథాస్థానంలో పెట్టేశాను. బహుశా దాన్ని మీరు చూసుకునేలోపున నేనీ లోకంలో వుండనేమో! సాబ్! నన్నెవరూ శిక్షించనవసరంలేదు—ఆత్మహత్యే నాకు సరయిన శిక్ష!'

ఈ మాటలతో సమస్యలన్నీ పరిష్కరింపబడతాయి. శంకర్, జానీలు మళ్ళీ నా కెక్కడా అడ్డు తగలకుండా జాగ్రత్త తీసుకున్నాను. ఇక, రంభ ఆత్మహత్య చేసుకున్నట్టే నమ్మిస్తాను కాబట్టి ఆమె హత్య గురించి భయపడనవసరంలేదు—అయితే ఈ విషయం నేను బాస్‌ని నమ్మించడం మీద ఆధారపడివుంది.

రంభ కంఠస్వరం నాకు తెలుసు. అనుకరించాలంటే ప్రాక్టీసు చెయ్యాలి.

వెంటనే టేప్ రికార్డర్ పెట్టుకుని ఆ ప్రయత్నం ప్రారంభించాను. వ్రాసుకున్న ఆమె సంభాషణలు పదే పదే చదవసాగాను, ఆమె కంఠం అనుకరిస్తూ. ఇలా చేస్తోంటే నాకే నవ్వొచ్చింది. పురుషకంఠం అనుకరించడం సులభం. స్త్రీ కంఠం అనుకరించడం కొంత

కష్టం కావచ్చుగానీ, అలా మాట్లాడుతోంటే ఆ మాటలు నవ్వు తెప్పిస్తున్నాయి.

పదిసార్లు ప్రయత్నించి చివరికి సక్సెస్ చేసాను. ఆమె సంభాషణల్ని టేప్ చేసి సేఫ్‌లో దాచాను.

బాస్‌కి ఫోన్ చేసినప్పుడు ఈ టేప్ శ్రావ్యంగా విన్పించడమే నా పని.

ఆ తర్వాత మబ్బులన్నీ విడిపోతాయి.

నేను చేసిన వెధవపనులకి పరువు దక్కుతుంది. అదే చాలు. బాస్‌ని మోసంచేసి డబ్బు సంపాదించాలను కున్నాను. ఆ ఆలోచన ఎప్పుడో యెగిరిపోయింది. ఇప్పుడు ఆలోచించవలసింది మాధవితో నేనూహించుకున్న భవిష్యత్.

పావుగంట తర్వాత రంగంలో దిగడానికి సిద్ధమయ్యాను.

## 4

నా పథకం ఆచరణలో పెట్టాలంటే—ముందుగా ఒక ఎత్తైన ప్రదేశం ఎన్నుకోవాలి. అందుకు యేదేనా హోటల్ మూడవ లేక నాల్గవ అంతస్తు గది అనుకూలంగా వుంటుంది. వెంటనే బయలుదేరి హోటల్ కంపాలా అయిదవ అంతస్తులో గది బుక్ చేసుకున్నాను—మారు పేరుతో కాదు.

గదిలోకెళ్ళి అన్నీ చెక్ చేసుకున్నాను. కిటికీలు, తలుపులూ నేననుకున్న విధంగానే వున్నాయి. ఆ తర్వాత బయటికి వచ్చి, కారును హోటల్‌లోనే వదిలేసి, ఆటో ఎక్కాను. డ్రైవర్‌కి పంజగుట్టు పోనివ్వమన్నాను.

ఆటో పంజగుట్టు చేరాక మెయిన్ రోడ్డు మీద ఆపి దిగాను. ఫేర్ చెల్లించి శంకర్ ఇంటికేసి అడుగులేశాను. నన్నెవరూ వెంటాడ్డంలేదని తెలుసు. అయినా జాగ్రత్తలో వుండడం మంచిది.

సమయం మధ్యాహ్నం పన్నెండయింది.

తలుపుతట్టిన మరుక్షణం శంకర్ తెరిచాడు. నన్ను ఆశ్చర్యంగా చూసి చటుక్కున లోనికి లాగాడు.

"ఏమిటి సంగతి?"

"ఒక ఆలోచన తట్టింది."

శంకర్ కుంటుతూ వెళ్ళి కుర్చీలో కూచున్నాడు. అతని ఎదురుగా నేను కూచున్నాను.

శంకర్ అనుమానంగా చూసి, "ఏమిటి!" అన్నాడు.

నేనతన్ని జాగ్రత్తగా గమనిస్తూ, "జానీమీద నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాను.

శంకర్ పిడికిలి బిగించి తొడమీద గుద్దుకున్నాడు.

"ఆ వెధవను పాతేస్తాను! వాడు నా ప్లాను చెడగొట్టాడు!"

"అవును. నేను వాడినిగురించి ఆలోచించాను" నెమ్మదిగా అన్నాను.

"ఏ మాలోచించావు?"

"పదిహేనురోజులు నువ్వు శ్రమపడి వేసుకున్న పథకం వాడివల్ల పటాపంచలయింది. శ్రమ నీదయితే ఫలితమనుభవించడానికి వాడెవడు?"

"అవును. వాడెవడు?"

"ఇకనుంచి మన పార్టనర్ కాడు. ఈ బిజినెస్‌నించి వాడ్ని కిక్ ఇద్దాం. ఏమంటావు?"

శంకర్ ముఖం ఎర్రబడింది: "నువ్వా కాయితం మర్చిపోయావు."

"లేదు—ఆ కాయితం రాత్రంతా నిద్రపోనివ్వలేదు. శంకర్, నేను బాగా ఆలోచించి ఒక ఉపాయం కనిపెట్టాను. వాడి దగ్గర్నుంచి ఆ కాయితం లాక్కొనిటూటా చెబుదాం!"

"ఎలా?"

"చాలా సులభం! అయితే ప్రమాదకరం. అయినా నేను తెగించాను. ఆ కాయితం తిరిగి మనచేతికి రావాలంటే ఆ పని చెయ్యక తప్పదు!"

"ఏపని?"

"నా బ్లాక్ మెయిల్ ఫోటోలు వాడికివ్వాలి."

శంకర్ అదిరి పడ్డాడు.

"మరో మార్గంలేదు" అన్నాను.

"నీకు మెదడులేదు!" అర్చాడు శంకర్, "ఆ ఫోటోలతో వాడ్ని ఎలా మోసం చేస్తావు?"

సిగరెట్ వెల్గించి సూటిగా చూశాను.

"చేస్తాను. నువ్వు నేను చెప్పినట్టు చెయ్యాలి—ఆ ఫోటోలు వాడికివ్వాలి. బదులుగా ఆ కాయితం తీసుకురావాలి."

"నీకు పిచ్చెక్కింది! హత్య విషయం బయట పెడతావా? అదెంత ప్రమాదమో తెలుసా? ఆ ఫోటోలు వాడి చేతిలో పడ్డాయంటే నువ్వింక బయటపడలేవు!"

"ఆల్ రైట్, నిన్ను వజ్రాలహారం దొంగగా పట్టిస్తే బాగుంటుందా? శంకర్, ఆ కాయితంకంటే ఫోటోలు ప్రమాదకరమైనవి కావు. నువ్వు నకిలీ నగ విషయం మర్చిపోతున్నావు."

"ఏమిటి దానిగురించి?"

"ముందు ఫోటోలు, ఆ తర్వాత నకిలీనగతో జానీ గాడ్ని మోసం చేయవచ్చు" అన్నాను, నా పథకం నెమరు వేసుకుంటూ, "నెక్లెసు దొంగలుగా మనల్ని పట్టించే కాయితం వాడిదగ్గర వుండటం చాలా ప్రమాద కరం. నకిలీ నెక్లెసు వ్యవహారం వాడికి తెలీదు. అది మన అదృష్టం. పదిరోజుల్లో ఆ నగ తయారయ్యాక దాన్ని జానీకి చూపించి అమ్ముతున్నట్టు చెప్తాం!

"వాడు సంతోషించి మన వెంట వస్తాడు. మనం వాడ్ని ఈ నగ తయారుచేసిన యెక్స్పర్టు దగ్గరికే తీసుకెళ్తాం. ఎక్స్పర్టుతో మనం ముందుచేసుకున్న ఒప్పందం ప్రకారం అతను ఆ నకిలీనగ ఖరీదు ఇరవై వేలు కడతాడు—ఇది నాటకం. జానీ నమ్ముతాడు. నిజానికి ఆ నగ మనమే అమ్మం. ఎక్స్పర్టుతో నాటకమాడి డబ్బుతీసుకొని జానీకి అందులో నాలగవ భాగం యిచ్చేస్తాం—అయిదు వేలు! అంతే, సంతోషించి వాడి దారిన వాడుపోతాడు. వాడి పీడా వదులుతుంది. తర్వాత, పరిస్థితులు చక్కబడ్డాక మనం అసలు నగ ఎక్కడేనా అమ్మిబాగా డబ్బుచేసుకో వచ్చు.... లక్షలు!"

శంకర్ తలాడించాడు, "ఆ మాత్రందానికి వాడికి ఫోటోలెందు కివ్వాలి?"

నేను ఇబ్బందిగా చూశాను. శంకర్ని సరయిన కారణము చెప్పి నమ్మకం కలిగేలా చెయ్యాలి!

"ఆ కాయితం నన్నెంతో భయపెడుతోంది శంకర్. పొరపాటున వాడి చేతిలోంచి ఎవరికేనా చిక్కిందంటే మనం మునిగిపోతాం! అసలు నగ కాదుగదా, నకిలీదిగూడ అమ్మలేం! కాబట్టి ఈ ఫోటోలు వాడికిస్తే సందేహించ

కుండా కాయితం ఇచ్చేస్తాడు. ఆ ఫోటోలు నన్ను హంతకుడిగా పట్టిస్తాయిగానీ, వజ్రాలహారం దొంగగా పట్టివ్వవు!"

"ఎలా?"

"ఒకవేళ జానీ మన మోసం పసిగట్టి ఫోటోలు బట్టబయలు చేశాడనుకో, నేను సంజాయిషీ చెప్పుకోవలసి వుంటుంది. అది సులభం!"

"ఏం చెబుతావ్?"

నే నాలస్యం చెయ్యకుండా చెప్పాను. శంకర్‌ని నే నెలాగయినా ఒప్పించి ఆ ఫోటోలు జానీ కందేలాగా చెయ్యాలి.

"ఆ రాత్రి నేను ఫ్రెండ్‌ని కలుసుకోడానికి బంజారా హిల్స్ కెళుతుండగా, ఆ చీకటి మైదానంలో యేదో ఆకారం కన్పించిందనీ, నేనటువేపు వెళ్ళిచూస్తే వొక మనిషి గొయ్యి తవ్వుతూ కన్పించాడనీ, కానీ దురదృష్టవశాత్తూ పట్టుబడిపోయాననీ అంటాను.

అప్పుడతను నన్ను చంపుతానని బెదిరించినట్టూ, నేను బ్రతిమాలుకుని ఆ శవాన్ని పాతిపెడతానన్నట్టూ, అపుడు నా కార్లోవున్న కెమేరాతో నన్ను ఫోటో తీయమని చెప్పినట్టూ, అంటాను. ఆ విధంగా బయటపడి ప్రాణాలు రక్షించుకున్నట్టు, ఒకవేళ అతను చేసిన హత్య బయటపెడితే అతను ఆ ఫోటోను పోలీసులికి అందజేస్తాడు కాబట్టి, కిక్కురుమనకుండా వూరుకున్నట్టు సంజాయిషీ చెప్పుకుంటాను."

"అయితే ఆ వ్యక్తి ఎవరంటావు?"

"నాకు తెలియదంటాను. అంతేకాదు, ఆ శవంకూడా చీకట్లో, అప్పటి భయంతో గుర్తించలేదంటాను. ఎలా వుంటుంది?"

"బాగా నేవుంది.... కానీ...."

"కానీలేదు, గీనీలేదు! నేను చెప్పినట్టు చేసేయ్! ఇద్దరికీ రక్షణ వుంటుంది!"

శంకర్ చాలాసేపు ఆలోచించాడు. నేను సిగరెట్ కాలుస్తూ గడిపాను. ఆ తర్వాత శంకర్ అంగీకారంగా తలూపాడు.

"గుడ్, ఆ ఫోటోలు నీ కిమ్మన్నట్టు నేను చెప్పినట్టు వాడికి చెప్పకు! ఆ ఫోటోలు తప్పకుండా తీసుకుని కాగితము ఇచ్చేస్తాడు. జాగ్రత్త. నువ్వు వాడ్ని కలుసుకున్నట్టు లాడ్జింగ్‌లో ఎవరికీ తెలియకూడదు."

"అలాగే!"

"నేనిక వెళ్తాను. ఆ కాయితంతో నన్ను కంపాలా హోటల్ రూం 224లో కలుసుకో!"

"హోటల్‌లో ఎందుకుంటున్నావు?"

"ఇంట్లో వుండలేక! పొరుగువాళ్ళు ప్రాణాలు తీస్తున్నారు! ఆల్ రైట్ శంకర్, విష్యూ గుడ్‌లక్!"

అక్కడ్నుంచి లేచి బయటకి నడిచాను.

# 5

తిరిగి హోటల్‌కొచ్చి శంకర్ కోసం కాచుకున్నాను.

శంకర్ ఫోటోలతో వెళ్ళాడు. జానీదగ్గర నించి కాయితం తెస్తాడా? తెస్తాడనే నమ్ముతున్నాను. ఆ కాయితంకంటే ఫోటోలే జానీకి మామీద యెక్కువ నమ్మకం కలిగిస్తాయి.

శంకర్ కాయితం తెచ్చాక నా తర్వాత కార్యక్రమం ఏమిటో ఆలోచించాను: జానిని బోల్తా కొట్టించడం— ఆ ఫోటోలు నా హస్తగతం చేసుకుని గుడ్ బై చెప్పడం!

నా గుండె వేగంగా కొట్టుకుంది!

ఇది ప్రమాదకరమైన ఆట! ఏ మాత్రం పొరపాటు చేసినా జీవితాంతం కటకటాలు లెక్కబెట్టాలి! అందువల్ల చాలా జాగ్రత్తగా, సమయస్ఫూర్తిగా ప్రవర్తించాలి.

ఇంతలో—నాకు హఠాత్తుగా మాధవి జ్ఞాపకం రావడం, భళ్ళున తలుపు తెరుచుకోడం, ఒకేసారి జరిగాయి.

శంకర్ లోనికి జొరబడ్డాడు.

"గ్రాండ్ సక్సెస్!" అర్చాడతను, "ఫోటోలు తీసుకుని చంకలు కొట్టుకున్నాడు—ఇదిగో కాయితం!"

ఛటుక్కున శంకర్ చేతిలో కాయితం లాక్కున్నాను. దాన్ని చూసి తేలిగ్గా వూపిరి వదిలాను. సిగార్ లైటర్ తీసి దాన్ని అంటించి, పూర్తిగా కాలేవరకూ చూసి, కిటికీలోంచి కిందికి జారవిడిచాను. బూడిద గాల్లో కలిసి పోయింది...."

శంకర్ని చూసి, "చాలా థాంక్స్" అన్నాను.

"ఇక ప్రమాదం లేదు కదా?"

"లేదు. వాడు ఇప్పుడు మనల్ని యింకా బాగా నమ్ముతాడు. ఇక నీ నకిలీ నగతో వాడ్ని వదిలించుకోడమే మన పని!"

"నువ్వు బాగా ఆలోచించావు కమల్!"

నవ్వుకున్నాను, నేనాలోచించిందంతా నాటకమని అతనికి తెలీదు. ఎలా తెలుస్తుంది? అతని బుర్రకి ఫోటోల్లో వున్న లోపం తడితేగా?

శంకర్ మళ్ళీ అన్నాడు, "ఇక వెళుతున్నాను. నీ ధైర్యానికి మెచ్చుకోవాలి కమల్!"

అనుమానంగా చూశాను, "ఎందుకు?"

"ఆ ఫోటోలు మూడో వ్యక్తికి చూపించే సాహసం చేసినందుకు."

"ఫరవాలేదు, జానీవల్ల మనకు ప్రమాదంలేదు."

"ఆ రాస్కెల్ కి అలాగే చెప్పాలి బుద్ధి!" కసిగా అన్నాడు శంకర్.

"ఇక వెళ్ళు" అన్నాను.

అతను భుజాలెగరేశాడు: "ఓ.కే.—అయితే ఒక మాట: మాటిమాటికీ నా యింటికలా రాకు! పోలీసు కన్ను నీ మీద వుంది."

"బాస్ అండ నాకుంది."

"ఓహ్, నీ బాస్! పెద్ద బఫూన్ కదూ?"

నా కోపం వచ్చింది, పిడికిలి బిగించేంతలో శంకర్ అదృశ్యమయ్యాడు. కారిడార్ లో అతని అడుగుల చప్పుడు కాసేపు విన్పించి ఆ తర్వాత గాల్లో కలిసిపోయింది.

ఛటుక్కున కిటికీ దగ్గరకొచ్చి నిలబడ్డాను. నా నాటకం శంకర్ కెలాంటి అనుమానమూ కల్గించలేదు. నన్ను దొంగగా పట్టించే కాయితం నాశనమైంది. ఇక జానీ దగ్గరవున్న ఫోటోలు ప్రమాదకరంకావు గానీ—జానీ నోరు ప్రమాదకరమైనది.

ఇప్పుడు వాడినోరు మూయించవలసి వుంది.

కిందికి చూశాను. శంకర్ కన్పించాడు. వేగంగా అడుగులేస్తూ హోటల్ గేటు దాటాడు. ఆ తర్వాత ఆటో ఎక్కాడు. ఆటో బయలుదేరి కనుమరుగయ్యాక భారంగా నిట్టూర్చాను.

ఇప్పుడు నా తర్వాత కార్యక్రమం....

టెలిఫోన్ ఎత్తాను. బేగంబజారులో భగవాన్ లాడ్జి నెంబర్ డైరెక్టరీలో ముందే వెతికాను కాబట్టి ఆ నెంబర్ డయల్ చేశాను.

అవతల కంచుకంఠం మోగింది: "హల్లో?"

ఆ కంఠాన్నిబట్టి అవతల మనిషి వస్తాదు అయివుండా లనుకున్నాను.

"భగవాన్ లాడ్జేనా? మీ రెవరు?" అడిగాను.

"ప్రొప్రయిటర్ని. మీ కెవరు కావాలి?"

"జానీ."

కాస్సేపటి తర్వాత, "ఆ హిప్పీగాడా?" అంది అవతలి కంఠం.

"నాకు కోతిలా వుంటాడు" అన్నాను.

"అయితే మీ రెవరు?"

"మాట్లాడకుండా జానీని పిలువ్!" కసిరాను.

"అచ్ఛా! దబాయిస్తున్నావా? నీ సంగతి తర్వాత చూస్తాను. ముందు జానీని పిలుస్తాను...."

అతని మాటల్నిబట్టి నా కర్థమైంది, ఎంత భయ పడ్డాడో.

రెండు నిమిషాల తర్వాత జానీ గొంతు విన్పించింది. "హల్లో ఎవరు?"

"ష్.... నెమ్మదిగా మాట్లాడు! నీ చుట్టుపక్క లెవరేనా వున్నారా?"

"ఎవర్నువ్వు?"

"కమల్ ని" చటుక్కున మళ్ళీ అన్నాను, "నా పేరు పిలవకు! దిసీజ్ టాప్ సీక్రెట్. చుట్టుపక్కల...."

"ఎవరూ లేరు" జానీ అన్నాడు. ఆ తర్వాత అస్పష్టంగా విన్పించాయి మాటలు, "హనుమాన్ జీ! మీరు దయచేసి అవతలికి వెళ్ళండి! నేనవతల అమ్మాయితో మాట్లాడాలి....ప్లీజ్!"

నేను కాచుకున్నాను.

"ఏమిటి సంగతి?" జానీ గొంతు విన్పించింది:

"నువ్వూ శంకర్ ఏదో నాటకమాడుతున్నారట?" అడిగాను జాగ్రత్తగా.

"ఏమిటి? శంకర్ తోనా? నాటకమా?"

"ష్! అరవకు. అవును. నాటకం. నాకు తెలిసింది..."

"ఎలా?"

"నీ కనవసరం! చూడు జానీ, నువ్వుత్త ఫూల్ వి!"

"ఏమిటిన్నావ్?"

"నువ్వుత్త ఫూల్ వి! శంకర్ నన్ను గాక నిన్ను కూడా మోసం చేసాడు."

"ఎలా?" గాభరాగా వుంది గొంతు.

"వాడి మాటలు నమ్మి నువ్వా కాయితం ఇచ్చేసావు. అవునా?"

"అయితేనేం? నా దగ్గర....ఇప్పుడు...."

"నెవర్ మైండ్. నీ దగ్గర వున్నవాటిని ఫ్రేము కట్టించి తగిలించుకో!"

"వాట్! ఏమిటి వాగుతున్నావు?"

"ఆ ఫోటోలు నన్ను హంతకునిగా పట్టిస్తాయి."

"ఎలా?"

గాఢంగా వూపిరి పీల్చాను. ఇది జానీని నా వశం చేసుకునే సమయం.

నిదానంగా వాడికి అర్థమయ్యేలా, ఆ ఫోటోల్లోని

వీక్ పాయింట్ వివరించాను.

"అర్థమైందా? ఇప్పుడు చెప్పు: ఎవర్ని ఎవరు మోసం చేస్తున్నారు?"

"గాడ్! ఎంత మోసం! వాడ్ని పొడిచేస్తాను!"

"ఆగు జానీ.... ఆవేశం వద్దు. ఈ వీక్ పాయింట్ గురించి వాడికి తెలీదు. వాడు నీతో చేతులుకలిపి నన్ను మోసం చెయ్యాలనుకున్నాడు. వాడు సంతకం చేసిన కాయితం నీదగ్గర లాక్కున్నాడు. వాడ్ని దొంగగా ఎలా నిరూపిస్తావు? ఆ ఫోటోలు నీకిచ్చింది నా నోరు మూయించడానికి. అయితే నిన్ను పరోక్షంగా మోసం చేస్తున్నాడు...."

"ఎలా?"

"నాకూ వాడికీ తగవు వచ్చింది. మామధ్య వ్యవహారం చెడి వాడా పనిచేశాడు. నీకు చెప్పలేదా?"

"లేదు!"

"గుంటనక్క! ఆ ఫోటోలు నీకిస్తాననీ, కాయితం తిరిగి తీసుకుంటాననీ—ఆ విధంగా తను బయటపడి, తన గుట్టు బయలు అయితే నా నోరు మూయించలేడని వాడికి తెలియదు. నగ అమ్మి నాకు భాగం ఇవ్వలేదనుకో, నేను పోలీసుల దగ్గరికెళతాను. నా వాటా క్లెయిమ్ చెయ్యడానికి కాదు—మీ ఇద్దర్నీ పట్టించడానికి. ఆ ఫోటోలు నన్నేమీ చెయ్యవు! అర్థమైందా మిస్టర్?"

"ఎంత మోసం! ఎంత మోసం!"

"కంగారు పడకు. నేను పోలీసుల దగ్గరికెళ్ళను. నాకు డబ్బు కావాలి. మనిద్దరం ఒక్కటయ్యామంటే శంకర్ ఆట కట్టించవచ్చు. ఏమంటావ్?"

"ఏం చేస్తావు?"

ఇంతవరకు నా మాటలు బాగానే నమ్మించాయి. ఇప్పుడు వాడ్ని ఇక్కడికి రప్పించాలి.

"ఫోన్‌లో మాట్లాడుకోడం మంచిదికాదు. ఇక్కడికి కొస్తావా?"

"ఎక్కడికి?"

"హోటల్ కంపాలా. రూం టూ-టూ-ఫోర్."

"హోటల్‌లో.ఎందుకున్నావ్?"

శంకర్‌కి చెప్పిన కారణం చెప్పాను.

"అలాగే వస్తాను."

"ఫోటోలతో...." అన్నాను.

కాసేపు నిశ్శబ్దం.

"చూడు కమల్, నువ్వు నన్ను మోసం చెయ్యవు కదా?"

"నువ్వు నన్ను నమ్మకపోతే మునిగిపోతావు—త్వరగా రా!" అన్నాను.

"అయితే వస్తాను." లైన్ కట్ అయింది.

నా రక్తం ఉరకలు వేసింది. అంతా నేననుకున్నట్టే జరుగుతోంది! జానీ ఇక్కడి కొస్తాడు! వాడి నోరు మూయిస్తాను!

తటాలున వెళ్ళి కిటికీదగ్గర నిలబడ్డాను. ఆలోచనలు వేగంగా పరిగెడుతున్నాయి.

క్షణాలు నిమిషాలు దొర్లిపోతున్నాయి. నా కళ్ళు రెప్ప పడటంలేదు. హోటల్ గేటుకేసి తీక్షణంగా చూస్తున్నాయి. ఎన్నో వాహనాలు లోనికి వస్తున్నాయి. అలాంటి వాహనాల్లో వాడు రాడు. ఆటోలో లేదా రిక్షాలో వస్తాడు.

# 6

పది నిమిషాల తర్వాత గేటుముందు ఆటో దిగాడు జానీ.

నేను స్థాణువై పోయాను. వాడు ఫేర్ చెల్లించి చకచక లోనికొస్తున్నాడు. నేను తేరుకొని తటాలున ఫోన్ అందుకున్నాను.

ఆపరేటర్ కంఠం వినిపించింది: "యస్?"

నేనొక నెంబర్ చెప్పి త్వరగా కనెక్షన్ ఇమ్మన్నాను. రెండు క్షణాల తర్వాత అవతల కంఠం వినిపించింది: "దిసీజ్ పోలీస్ హెడ్‌క్వార్టర్స్."

"ఇన్‌స్పెక్టర్ శివనేశన్ వున్నారా?"

"ఉన్నారు—ఒక్క క్షణం."

నా గుండె వేగంగా కొట్టుకుంది. జానీ యీ పాటికి లిఫ్ట్‌లో వుంటాడు:

"యస్, ఇన్‌స్పెక్టర్ నేశన్ హియర్!"

"మిస్టర్ నేశన్! త్వరగా రండి! హోటల్ కంపాలా రూం టూ-టూ-ఫోర్."

"హల్లో? ఎవరు మీరు?"

"ఎమర్జెన్సీ! ప్లీజ్ కం అండ్ హెల్ప్‌మీ!"

కారిడాల్‌లో అడుగుల చప్పుడయింది. ఠక్కున రిసీవర్ పెట్టేశాను. మరుక్షణం భళ్ళున తలుపు తెరచుకుంది.

జానీ ప్రత్యక్షమయ్యాడు. నేను తటాలున తలుపు గడియ పెట్టాను.

"నిన్నెవరూ వెంటాడలేదు కదా?"

గాభరాగావుంది వాడి ముఖం: "లేదు!"

"వెల్, కూచో. మాట్లాడుకుందాం."

పైకి ఎంతో నిదానంగా మాట్లాడుతున్నా నా శరీరం

విపరీతంగా వణుకుతోంది.

జానీ కూచోని జేబులోంచి ఫోటోలు తీశాడు.

పోలీసులు రావడానికి పదినిమిషాలకంటే యెక్కువ పట్టదు!

"ఏమిటి మిస్టర్, నీ అయిడియా?" జానీ అడిగాడు.

నేను బలహీనంగా చూసి నవ్వాను. పోలీసులు వచ్చే వరకు ఏదో మాట్లాడుతూ వీడ్ని ఆపాలి.

"ఫోటోలు పనికి రావని తెలిసిందా?"

"తెలిసింది" జానీ అన్నాడు, వాటిని టీపాయ్‌మీద పెట్టి. నేను నెమ్మదిగా కిటికీవేపు కదిలాను.

ఆ తర్వాత అసహనంగా వెనక్కి వచ్చి ఫోటోలందుకున్నాను.

జానీ నన్ను జాగ్రత్తగా గమనిస్తున్నాడు.

"అంత డబ్బు ఏం చేసుకుంటావు జానీ?"

జానీ ఉత్సాహంగా చూశాడు. "మిస్టర్! డబ్బు చేయలేని దేమిటి? నేనిక్కడ ఉండను, తెలుసా? బొంబాయి వెళ్ళిపోతాను. నీతిగా బ్రతుకుతాను! ఆ డబ్బుతో వ్యాపారం చేస్తాను! అయితే ముందు చెప్పు: శంకర్ నిజంగా మోసం చేస్తున్నాడా?"

"శంకర్ నిన్ను మోసం చేయటంలేదు. నన్ను చేస్తున్నాడు. అయితే నా వల్ల నువ్వు మోసపోతావు. నాతో చేతులు కలిపితే నగ కాజేసి, శంకర్‌కి టాటా చెప్పవచ్చు...." మాటలా పేసి మళ్ళీ కిటికీదగ్గర కెళ్ళాను. నా కళ్ళు చెదిరాయి. హోటల్‌లోకి పోలీసు జీపు దూసుకు వస్తోంది.

"అలాగే మిస్టర్! మనం భాగస్తులం. శంకర్‌ని కిక్

ఇద్దాం!" జానీ అన్నాడు. వాడి మాటలు నా తలకెక్క లేదు.

"కమాన్! ఇప్పుడేం చెయ్యాలో చెప్పు!"

జానీని సూటిగా, జాలిగా చూశాను. మరికొన్ని క్షణాల తరవాత....

"ఓ.కే. ఇప్పుడు చెయ్యవల్సిందేమీ లేదు, జానీ—" నా మాటలు ఆగిపోయాయి. బయట అడుగుల చప్పుడు విన్పించింది.

నా కళ్ళు జానీ మీద పడ్డాయి. వాడు తీక్షణంగా చూస్తున్నాడు. మరికొన్ని క్షణాలతర్వాత అడుగులు గది ముందుకొచ్చి ఆగిపోయాయి. మేం ఇద్దరం రెప్ప వెయ్యకుండా చూసుకున్నాం.

టక్—టక్—చప్పుడయింది తలుపుమీద.

"ఎవరు?" జానీ అడిగాడు.

"ష్.... మాట్లాడకు!"

మళ్ళీ చప్పుడయింది. ఆ తర్వాత అరుపు విన్పించింది, "పోలీస్!"

జానీ తటాలున లేచి నిలబడ్డాడు, "గాడ్! పోలీస్!"

"రాస్కెల్, నిన్ను వెంబడించి వచ్చారు!"

"కాదు నువ్వు మోసం చేశావు!"

"షటప్! కమాన్!" వాడి చెయ్యి పట్టుకుని లాగేను. వాడు ఛటుక్కున జేబులోంచి కత్తి తీశాడు.

"జానీ!" తగ్గు స్వరంలో అన్నాను, "పారిపో."

తలుపు దబదబ మోగుతోంది, "పోలీస్, ఓపెన్ ది డోర్!"

జానీ నన్ను విదిల్చికొట్టి కత్తితో తలుపు దగ్గరికి నడిచాడు. నేనాలస్యం చెయ్యకుండా వాడ్ని వెనక్కిలాగి,

"అటునుంచి కాదు! కిటికీలోంచి!" అన్నాను.

తలుపు ఇంకా గట్టిగా శబ్దం చేసింది.

నేను విసురుగా జానీ చెయ్యిపట్టుకుని కిటికీ దగ్గరికి లాగాను. "పారిపో!"

ఈసారి వాడు గాభరాగా చూశాడు. "ఎలా?"

నేను వెనక్కి తిరిగి టీపాయ్‌మీది ఫోటోలు జేబులో పెట్టుకున్నాను.

జానీ తటాలున కిటికీ ఎక్కి కూచున్నాడు. తలుపు పెద్దగా శబ్దంచేసింది. అవతలినుంచి ఇన్‌స్పెక్టర్స్ అరుస్తున్నారు. నేనొక్క క్షణం ఆలస్యం చెయ్యలేదు.

వెనకనించి బలంగా జానీని కిందికి నెట్టేశాను.

సుదీర్ఘమైన చావుకేకతో జానీ శరీరం నేలనుతాకింది.

నేను తటాలున కింద బోర్లాపడుకుని బట్టలు చింపేసుకున్నాను, వొళ్ళు రక్కుకున్నాను, కళ్ళుమూసుకుని గట్టిగా మూల్గసాగాను—ఫడాలున తలుపు తెరుచుకుంది. గడియ వూడి కిందపడింది.

# 7

ఓరగా కన్ను తెరిచి చూసాను.

ఇన్‌స్పెక్టర్స్ ఇద్దరూ రిసెప్షనిస్టుతో సహా లోనికి జొరబడారు.

"హే! మిస్టర్ కమల్! వాట్ హేపెండ్?" అర్చాడు శివనేశన్.

నేను కళ్ళు మూసుకుని మూల్గసాగాను. నా చేతిని బలమైన హస్తం పట్టుకుంది.

"కమాన్, బెడ్‌మీదికి చేరుద్దాం!" మళ్ళీ అన్నాడు శివనేశన్. నెంట నేమరో చెయ్యి నన్ను తాగింది. డేవిడ్,

శివనేషన్‌లు నన్ను బెడ్‌మీదికి చేర్చారు. నేనింకా అలాగే నటిస్తున్నాను.

"క్విక్! నీళ్ళు పట్టండి!" మళ్ళీ శివనేషన్ గొంతు.

డేవిడ్ పరిగెడుతున్న అడుగుల చప్పుడు.

"కమల్!" నేశన్ నన్ను కుదిపాడు, "కమల్! కళ్ళు తెరవండి!"

"ఊఁ!" అన్నాను బాధగా.

"ఏం జరిగింది? ఎవరొచ్చారిక్కడికి? కమాన్ స్పీకప్!"

ఇంతలో నా ముఖంమీద నీళ్ళుపడ్డాయి చల్లగా. ఒక్క సారిగా కళ్ళు తెరవబోయి, జాగ్రత్తగా, నెమ్మదిగా తెరిచాను.

"నేనెక్కడ వున్నాను?" అస్పష్టంగా గొణిగాను— తెలివిలోకొచ్చిన మనిషి మొదటిసారిగా పలికే మాటలు.

సమాధానం లేదు.

పూర్తిగా కళ్ళు తెరిచి చూసాను. చెరోపక్క ఇన్‌స్పెక్టర్స్ కూచొని వున్నారు. ఎదురుగా రిసెప్షనిస్ట్ చేతులు కట్టుకుని నిలబడివున్నాడు, గాభరాగా చూస్తూ.

"వెల్, వెల్, కమల్! గాభరా పడకండి! నిదానించండి!" శివనేశన్ అన్నాడు.

డేవిడ్ మంచినీళ్ళ గ్లాసందించాడు. కొద్దిగా లేచి తాగేశాను.

"వెరీగుడ్! ఇప్పుడు చెప్పండి, ఏం జరిగింది?" డేవిడ్ అడిగాడు.

నేను మరోసారి మూల్గి, వాళ్ళని పరీక్షగా చూసాను. థాంక్ గాడ్! వీళ్ళు నన్ను అనుమానించడం లేదు!

"ఇన్‌స్పెక్టర్, మీరు రాకపోతే...." ఆగిపోయాను.

నాకు ధైర్యం కలగలేదు.

"రిలాక్స్! ప్రశాంతంగా చెప్పండి."

"జానీ నన్ను చంపేసేవాడు."

నా మాటలు విని వాళ్ళు ఒకర్నొకరు చూసుకున్నారు.

"జానీ? ఎవరతను?"

"ఒక రౌడీ—ఖమ్మంలో వుంటాడు."

"ఇక్కడికెందుకొచ్చాడు?"

"నన్ను చంపడానికి!"

"ఎటు వెళ్ళాడు?"

"మీరిక్కడికి రావడంతోనే కిటికీలోంచి పారిపోయాడు."

డేవిడ్ తటాలున కిటికీ దగ్గరికెళ్ళి కిందికి చూసాడు.

మరుక్షణం వెనక్కి తిరిగి అర్చాడు: "ఓహ్, గాడ్! హీ ఈజ్ డెడ్!"

శివనేశన్ ఒక్క అంగలో కిటికీ చేరుకున్నాడు.

"వాట్! ఎలాపడ్డాడు?"

డేవిడ్ మళ్ళీ బయటికి తొంగిచూసి, "ఈ పైపు సహాయంతో కిందికి వెళ్ళాలనుకున్నాడు. కానీ పట్టుతప్పి పడిపోయివుంటాడు" అన్నాడు.

రిసెప్షనిస్ట్ కొయ్యబొమ్మలా నిలబడిపోయాడు.

"ఓ.కే. డేవిడ్, మీరు కిందికెళ్ళి జనాన్ని దూరంగా వుంచండి. నేను క్వార్టర్స్‌కి ఫోన్ చేస్తాను" శివనేశన్ వెనక్కి వచ్చి ఫోన్ అందుకున్నాడు.

రిసెప్షనిస్ట్‌తో డేవిడ్ బయటికి వురికాడు.

నేశన్ కాస్సేపు ఫోన్ చేసి మాట్లాడి రిసీవర్ పెట్టేశాడు. ఎర్రబడ్డ ముఖంతో ఆందోళనగా నన్ను చూసి, దగ్గరకొచ్చాడు.

"వెల్ మిస్టర్ కమల్, అసలిదేమిటో వివరంగా చెప్పండి!"

నేను ధైర్యం కూడదీసుకున్నాను.

"ఖమ్మంలో జానీతో నేను ఘర్షణపడ్డాను" అన్నాను.

నేశన్ నా పక్కన వచ్చి కూచున్నాడు.

"మీరు ఖమ్మం వెళ్ళినట్టు మీ బాస్ చెప్పారు. కానీ జానీ గురించి ఏమీ చెప్పలేదు!"

"ఆయనకి తెలియదు" అన్నాను.

"సరే, ఎందుకు ఘర్షణపడ్డారు?"

చెప్పాను. జానీతో నా ఘర్షణకి కారణమేమిటో, అదెలా ప్రారంభమై ఎలా అంతమైందో పూసగుచ్చినట్టు చెప్పాను.

ఉదయం మాధవి నాకు ఫోన్ చేసి, జానీ హాస్పిటల్ నుంచి తప్పించుకుని నా కోసం యిక్కడికి వచ్చినట్టూ, నన్ను జాగ్రత్తగా వుండమని చెప్పినట్టూ కూడా చెప్పాను. అందుకే ఇల్లు వదిలేసి ఈ రూం తీసుకున్నట్టూ, అయినా జానీ నేనెక్కడ వున్నానో తెలుసుకుని వచ్చినట్టూ, నా మీద కత్తితో దాడిచెయ్యగా నేను తప్పించుకుని శివ నేశన్‌కి ఫోన్ చేసినట్టూ, అతను వచ్చేవరకూ మా మధ్య తీవ్రపోరాటం జరిగినట్టూ, జానీ నన్ను గాయపర్చినట్టూ, చివరికి పోలీసులు రావడంతో కిటికీలోంచి పారిపోయినట్టూ చెప్పాను.

నేశన్ నిట్టూర్చాడు:"పూర్ ఫెలో! మిస్టర్ కమల్, మీరు అదృష్టవంతులు. బ్రతికిపోయారు. మీరు ఫోన్ చెయ్యకపోతే——"

"మీరు రాకపోతే వాడు నన్ను చంపేసేవాడు."

"వెల్. ఇక మర్చిపోండి" లేచాడతను, "డాక్టర్ని పంపిస్తాను. మీ పరిస్థితి చక్కబడ్డాక స్టేట్ మెంట్ ఇవ్వండి."

"నో—నో—డాక్టర్ అవసరం లేదు!" అన్నాను ఘటుక్కున. "బలమైన దెబ్బలు తగల్లేదు. ఫరవా లేదు. మీరు వెళ్ళండి!"

అతనదోలా చూసి వెనుదిరిగాడు.

అప్పుడుగానీ నేను స్వేచ్ఛగా వూపిరి పీల్చగల్గాను.

నా ఎత్తు పారింది! జానీ నోరు మూయించాను! వాడ్ని చంపాను—హత్య చేశాను. అయినా చేసినట్టు నా కన్పించడంలేదు. ఇక నాకేమీ దిగులులేదు....

ఒక గండం గడిచింది. నీటిపైకి తేలాను. మరో గండం వుంది—ఈతకొట్టి ఒడ్డుకి చేరుకోవాలి.

అక్కడ మాధవి నాకోసం నిరీక్షిస్తోంది.

# 8

తుఫాను గాలిలా లోనికి దూసుకవచ్చాడు నా బాస్.

"ఏయ్, కమల్! ఏమిటిదంతా? నువ్వేం చేస్తున్నావ్!"

అతని అరుపుతో నా గుండె దడ హెచ్చింది.

"ఏమీ....ఏమీ లేదు, బాస్!" అన్నాను ఆ తర్వాత ఏమనాలో తెలియలేదు. బలవంతంగా నవ్వాను.

బాస్ నా దగ్గరికొచ్చి, నా గెడ్డం కింద చెయ్యిపెట్టి ఎత్తి, కళ్ళలోకి తీక్షణంగా చూసాడు. అతనితో చూపులు కలపడం నా వల్ల కాలేదు. వెన్నులోంచి చలి పుట్టుకొచ్చింది.

చిన్నగా నవ్వాడు బాస్: "పూర్ బాయ్! నువ్వేమి

చెప్పకు. నాకంతా తెలుసు."

నా నోరు పెగలేదు. అతని వుద్దేశ్యం అర్థంకావటంలేదు.

"ఇన్‌స్పెక్టర్ చెప్పాడు. ఖమ్మంలో జానీతో కొట్లాడావట? నాకు చెప్పలేదేం? నీకు పిచ్చిపట్టింది! నిన్నక్కడికి పంపించింది రౌడీలతో తగవులాడుకోమనా? చూడు కమల్, సీరియస్‌గా వార్నింగ్ ఇస్తున్నాను."

"ఏమిటి బాస్?"

"ఇక ముందెప్పుడూ నువ్వు ఎవరితోనూ తగవు తెచ్చుకోకూడదు! అర్థమైందా?"

"మంచిది, బాస్" అన్నాను. "నా గురించి మీరు చాలా శ్రద్ధ తీసుకుంటున్నారు. బాస్ మీ రుణం యెలా తీర్చుకోవాలి?"

"అలాంటి సెంటిమెంట్స్ మాట్లాడకు! మై బాయి, నీ మీద నాకింత శ్రద్ధ యెందుకు! నువ్వెవరు? నా దగ్గర వుద్యోగివి. నేనెవర్ని? కోటీశ్వరుడ్ని! హహ! కోటీశ్వరుడ్ని!" పిచ్చిగా నవ్వాడతను.

అయోమయంగా చూసాను: "బాస్___?"

"మై బాయ్, నీకేం జరిగినా నేను సహించను. నువ్వు లేని నన్ను వూహించుకోడమంటే___"

"బాస్!"

"నాకు ఆప్తు లెవరున్నారు, కమల్?"

"ఊరుకోండి బాస్. అనవసరంగా కంగారు పడకండి! ఇప్పుడీ మాటలన్నీ ఎందుకు?"

బాస్ మంచినీళ్ళు తాగి, "నువ్వు నా సెక్రటరీ మాత్రమే కాదనీ, నీపై చాలా బాధ్యతలున్నాయనీ, తెలియజెప్పడానికి" అన్నాడు.

నేనతన్ని సూటిగా చూసాను, "బాస్ మిమ్మల్ని

ఆరంభం చేసుకోగలను. నీరజని పోగొట్టుకుని వంటరితనం ఎంత దుర్లభంగా వుంటుందో గ్రహించాను. బాస్, మీ కెవరూ లేరని నాకు తెలుసు. కాని నేనేం చేయగలను? నేను మీ వుద్యోగిని. సామాన్యుడ్ని. మీకూ నాకూ యెలాంటి బంధమూ లేదు——"

"ప్లీజ్ ...." నా నోరు మూశాడతను. "అలా మాట్లాడకు! నీ గురించి నా భార్య ఏం చెప్పిందో తెలుసా? కమల్ ఎంతో నమ్మకస్తుడు. వినయవిధేయతలు గలవాడు. మనం ఏం పాపం చేసుకున్నామో గాని, లేకపోతే ఈవాళ మనకలాంటి కొడుకు వుండేవాడు...."

నా గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

"అవును. ఆమె చెప్పింది ఈ నాడు నిజమన్పిస్తోంది. ఇన్నేళ్ళుగా నా దగ్గర పని చేసిన వాళ్ళలో యెవరూ నన్ను ఆకట్టుకోలేకపోయారు——ఒక్క నువ్వు తప్ప. నా ఆత్మ నన్ను మోసం చెయ్యదు. అలాగే నిన్ను నమ్మడంలో మోసం లేదు కమల్!"

"చాలా థాంక్స్ బాస్. మీ నమ్మకాన్ని వమ్ము చెయ్యను."

"అందుకే నేనీ నిర్ణయంతీసుకున్నాను."

"బాస్? ఏ నిర్ణయం?"

బాస్ నిట్టూర్చాడు: "వెల్, కమల్. ఇప్పుడిప్పుడే ఏర్పడుతున్న పరిణామాల్నిబట్టి చూస్తే, నేను పోగొట్టుకునే దశ ప్రారంభమైందనిపిస్తోంది. నేనలసిపోయాను. విసిగిపోయాను. నాకు విశ్రాంతి కావాలి. మనశ్శాంతి కావాలి——నా ఐశ్వర్యం పోగొట్టుకున్నా ఫర్వాలేదుగాని మనశ్శాంతి పోగొట్టుకోను! అందుకు నీ సహాయం కావాలి"

"ఏ సహాయమైనా చేస్తాను బాస్!"

"చేస్తావు. నువ్వు స్వార్థపరుడివి కావు. నాకు నువ్వు రెండే రెండు కోరికలు తీర్చు: నేను కళ్ళు మూసే సమయంలో నా ఎదురుగా వుండాలి! ఆ తర్వాత నా ఆత్మశాంతికోసం నా వారసత్వం స్వీకరించాలి."

"బాస్!"

నా పిడికిళ్ళు బిగుసుకుపోయాయి. విపరీతంగా వణక సాగాను. వూపిరి అందడంలేదు.

బాస్ చిన్నగా నవ్వాడు.

"ఇదే నా నిర్ణయం. నేటినుంచి నువ్వు నా వారసుడివి. ఏకైక వారసుడివి. అర్థమైందా? ఇకముందు ఇలాటి చిల్లర కాడీలతో కొట్లాడకుండా, సేఠ్ రంగూన్‌వాలా వారసుడిగా స్టేటస్ కాపాడుకో!"

నాలో ఇంకా చలనంలేదు.

బాస్ నా భుజం తట్టాడు.

"విష్యూ గుడ్ లక్, మై బాయ్! ఎంజాయ్ యువర్ సెల్ఫ్!"

ఆ తర్వాత వెనక్కి తిరిగి బయటికి అడుగులేశాడు.

అప్పటికి బాగా చీకటిపడింది.

సమయం ఎనిమిది గంటలైంది.

నా బాస్ వెళ్ళి అయిదు నిమిషాలైంది! అతి ప్రయత్నం మీద ఆందోళన మారం చేసుకుని మామూలు స్థితికి రాగల్గాను.

బాస్ నిర్ణయం కలవరపర్చింది. నమ్మశక్యం కావడం లేదు!

నేనతని వారసుడినా? ఆ అర్హత నాకుందా? నన్ను బాస్ ఎంత అమాయకంగా నమ్ముతున్నాడు! పిచ్చిబాస్

నువ్వు నిజంగా అమాయకుడివి!

సరే, ఇప్పటివరకు నేను చేస్తున్న పనులు బాగానే వున్నాయి. నేను బాస్‌ని బుద్ధిపూర్వకంగా మోసం చేయ బూనుకోలేను. తప్పనిసరి పరిస్థితిలో చిక్కుకుని అలాటి ప్రయత్నం చేశాను. అయినా ఆ ప్రయత్నం తప్పించడానికి అవకాశం కోసం ఎదురు చూస్తూనే వున్నాను. నాకు వచ్చిన అవకాశం దొరికాక పశ్చాత్తాపం చెంది ఆ ప్రయత్నం మానుకున్నాను.

కాబట్టి, నేను బాస్ వారసుడిగా అర్హుడ్ని.

అయితే నేను మరొక పని చెయ్యవలసివుంది—ఈ డర్టీ బిజీనెస్‌లో శంకర్‌తో నా బాంధవ్యం తెంచుకోడం.

అప్పుడు నేను నా బాస్ వారసుడిగా నైతికంగా అన్ని అర్హతలూ సంపాదించుకుంటాను.

నా కెలాటి అదృష్టం వరించబోతోంది!

నా బాస్ లక్షల ఆస్తికి వారసుడ్ని, మాధవి స్వచ్ఛమైన ప్రేమకు దాసుడ్ని!

ఇంతకంటే నాకేం కావాలి?

# 9

టైం చూసుకున్నాను. తొమ్మిదయింది.

ఇక బయలుదేరాలి. శంకర్ మీద నా ట్రిక్ ప్రయోగించి, నగ, ఫోటోలు వగైరా తెచ్చుకోవాలి. నా రక్తం పరుగులు తీసింది. జాగ్రత్తగా శంకర్ని బోల్తా కొట్టించగలనా? అతను నా బూటకపు మాటలకి లొంగుతాడా?

ఇప్పుడు నా భవిష్యత్ నేను శంకర్‌ని హేండిల్ చెయడం మీద ఆధారపడి వుంది. పటిష్టంగా తయారు చేసుకున్న నా పథకం విజయం సాధిస్తుందని నమ్మకం కలిస్తోంది.

గదికి తాళంవేసి బయటికి వచ్చాను. లిఫ్ట్‌లో కిందికి వచ్చి రిసెప్షన్‌లో చూశాను. ఓ ఇరవైమంది సోఫాల్లో కూచొని వున్నారు. నేను బయటికి దాటేస్తూ అనుమానం వచ్చి వెనక్కి తిరిగాను.

ఆ ఇరవైమందిలో ఒకడి కళ్ళు నా మీద వున్నాయి: తీక్షణమైన చూపులు. ఆ చూపుల్లో అనుమానం వుంది. అధికారం వుంది—అతను పోలీస్ డిటెక్టివ్.

అయితే నా మీద నిఘా వుందన్న మాట.

దేవరాజ్ ఎందుకీ నిర్ణయం తీసుకున్నాడు? జానీ వ్యవహారంలో నా మీద అనుమానం వచ్చిందా?

వీల్లేదు. నా స్టేట్‌మెంట్ ప్రతి అంశాన్నీ ఋజువు చేస్తుంది. వెనక్కి తిరిగి గబగబ బయటికి నడిచాను.

అతను నా వెనక వస్తున్నాడని నాకు తెలుసు. వెంటాడే డిటెక్టివ్‌లని వదిలించుకోడం కష్టం. ఇతను నా వెంట బాడీగార్డ్‌లా వస్తే నా పనికి అంతరాయం. వదిలించుకోవాలి. ఎలా?

ఆలోచిస్తూ బయటికివచ్చి ఆటో యెక్కాను. నా కారు ఆవరణలోనే వుంది. ఆటో కదిలాక దగ్గర థియేటర్‌కి వెళ్ళమని చెప్పాను. ఆటో వేగం పుంజుకున్న తరువాత చూశాను.

మరో ఆటో వెంటాడుతోంది.

తీవ్రంగా ఆలోచించాను. థియేటర్‌లో ఇతన్ని తికమక పెట్టాలి. కానీ అది ప్రమాదకరమనిపించింది. నేను థియేటర్‌లో అతన్ని ఫూల్‌ని చేసి శంకర్ దగ్గరకెళ్తాను. నేను థియేటర్‌లో లేనని తెలియడానికి అతనికెంతో సమయము పట్టదు. అప్పుడు దేవరాజ్‌ని హెచ్చరిస్తాడు.

అప్పుడు—జానీ చావుతోనో లేక నా దొంగతనం

తోనో నాకు సంబంధముందని దేవరాజ్ కి అనుమానము రావచ్చు.

వెంటనే మరో ఆలోచన వచ్చింది.

ఆటోని ఆపేయమన్నాను. ఆబిడ్స్ లో ఒక హోటల్ ముందాగింది. దిగి ఫేర్ చెల్లించాను. ఆటో వెళ్ళిపోయాక హోటల్ లో కెళ్ళాను. కాసేపటికి మిస్టర్ షాడో ఆటో దిగాడు.

ఇతన్నిప్పుడు వదిలించుకోవాలి.

నా ఆలోచన ఏమిటంటే, దేవరాజ్ నామీదెలాటి నిఘా వుంచనని హామీ ఇచ్చాడు కాబట్టి, ఇపుడు సంజాయిషీ అడిగే హక్కు నాకుంది.

టెలిఫోన్ ఎత్తి నెంబర్ డయల్ చేశాను.

డిటెక్టివ్ లోనికొచ్చి టీ తాగుతున్నాడు.

అవతల దేవరాజ్ పలికాడు, "హల్లో ఎవరు?"

"నేను కమలాకర్ ని, మిస్టర్ దేవరాజ్" గట్టిగా అన్నాను.

నా మాటలు వినబడి డిటెక్టివ్ ఉలిక్కిపడ్డాడు. నేను నవ్వుకున్నాను.

"యస్?" దేవరాజ్ అన్నాడు.

"నాకు బాడీగార్డ్ అవసరమని మీ కెవరు చెప్పారు?"

"ఓహ్, ఇన్ స్పెక్టర్ ఇంద్రజిత్ గురించా?" దేవరాజ్ అడిగాడు.

"అతని పేరు నాకు తెలియదు."

"నేనే నియమించాను."

"ఎందుకు?"

"మీ రక్షణకోసం."

"నాకు రక్షణ ఎందుకు?"

"మేం జానీ కేసులో కొన్ని వివరాలు సంపాదించాం. ఖమ్మంలో వాడి అనుచరులు లేరట. ఇక్కడికి వచ్చి వుంటారు. మీ కారణంగా వాడు చచ్చాడు. ఇక ప్రాహిం చండి, మీకు రక్షణ ఎందుకో?"

తేలికపడ్డాను, "ఆల్ రైట్ సర్. నా రక్షణ నేను తీసుకుంటాను. అతన్ని రప్పించుకోండి!"

"మీ రెక్కడ వున్నారు?"

"పిక్చర్ కి వెడుతూ దారిలో...."

"మీరు రాత్రిపూట బయట తిరగడం మంచిదికాదు!"

"నాకేమీ కాదు. జానీ అనుచరులిక్కడ లేరు."

"మీకెలా తెలుసు?"

"ఖమ్మంలో వాళ్ళని కొట్టినప్పుడే పారిపోయారు. ఇక్కడికి రాలేదని నా అనుమానం."

"వెల్, అతను మీతో పిక్చర్ కి రావడం అభ్యం తరమా?"

నేను డిటెక్టివ్ ని చూశాను: నన్నలాగే చూస్తున్నాడు.

"పిక్చర్ కెళ్ళేది ఆనందం కోసం. పక్కన పోలీసు వుంటే ఎలా లభిస్తుంది? రప్పించుకోండి!"

"ప్రజల్ని రక్షించడం మా బాధ్యత. సరే, మీకు భయం లేనప్పుడు మేం విచారించడం అనవసరం. అతన్ని క్కడికి రమ్మనండి!"

ఫోను పెట్టేసి డిటెక్టివ్ వేపు నడిచాను.

నేను పిడికిలి బిగించడం చూసి గాభరాగా లేచి నిలు చున్నాడు.

"కమీషనర్ పిలుస్తున్నారు వెళ్ళండి!"

"వాట్!"

"గెటవుట్!"

మారు మాట్లాడకుండా అతను వెనుదిరిగి బయటకెళ్ళి పోయాడు. సిద్ధంగావున్న ఆటోయెక్కి కూచున్నాడు. నేను గబగబ అతని దగ్గరకెళ్ళి అడిగాను, "వెళ్తారా? మిమ్మల్ని ఫాలో చెయ్యమంటారా?"

"అవసరంలేదు — వెళ్తాను." అతని ముఖం కంది పోయింది.

ఆటో కదిలింది.

నా ధైర్యానికి ఆశ్చర్యం వేసింది. అతను యూనీఫాంలో వుంటే ఇలా మాట్లాడేవాడ్ని కాను!

మరో ఆటోయెక్కి శంకర్ అడ్రస్ చెప్పాను.

ఆటో బయలదేరాక రెండు మూడుసార్లు వెనక్కి తిరిగి చూశాను. నన్నెవరూ వెంటాడ్డంలేదు.

పంజగుట్ట చేరుకున్నాక మెయిన్ రోడ్ మీద దిగి, ఫేర్ చెల్లించాను. ఆ తర్వాత శంకర్ ఇల్లువున్న వీధిలోకి నడిచాను—నా గుండెలు వేగంగా కొట్టుకుంటోండగా....

# 10

శంకర్ తలుపుతీసి ఆశ్చర్యంగా చూశాడు:

"కమాల్! ఏమిటిలా వచ్చావ్?"

అదోలా నవ్వాను. ధైర్యం కూడదీసుకున్నాను:

"శంకర్! ఎమర్జెన్సీ! కొన్ని ముఖ్యమయిన విషయాలు అత్యవసరంగా మాట్లాడాలి!"

అతను అనుమానంగాచూసి, "లోనికిరా!" అన్నాడు.

నేను లోనికి వెళ్ళాను. శంకర్ తటాలున తలుపుమూసి గడియ పెట్టాడు. నన్నుచూసి, "కూచో, నిన్నెవరూ వెంటాడలేదుకదా?" అన్నాడు.

"వదిలించుకుని వచ్చాను" అన్నాను కూచొని.

శంకర్ నా ఎదురుగా కూచొని జేబులోంచి బటా నీలు తీశాడు: "ఏమిటి సంగతి?"

నేనతన్ని సూటిగాచూచి, ఎలా ప్రారంభించాలా అని ఆలోచించాను.

ఆ తర్వాత అన్నాను, "శంకర్, పరిసితి ఇప్పుడు నీ చేతిలోనూ, నా చేతిలోనూ లేదు—పూర్తిగా యెదురు తిరిగింది."

అతను ముందుకు వంగాడు తటాలున, "ఏమిటి నువ్వ అనేది?"

"జానీ ప్రవేశంతో మన ప్లాను పటాపంచలయిందని నీకు తెలుసు. ఇప్పుడు మనం గుడ్ బై చెప్పకపోతే, పీక లకి చుట్టుకుంటుంది. అందుకే ఒకపని చేశాను"అన్నాను.

"ఏం చేశావ్ ?"

"చెప్తాను—శంకర్, రంభ విషయంలో నీవల్ల నాకు ప్రమాదంలేదు. కానీ పోలీసులవల్ల ఎప్పటికయినా వుంది. ఏ నేరమూ దాగదని గ్రహించు. నా స్టేట్ మెంట్ పోలీసులకి అబద్ధాల పుట్టలా తోస్తోంది.

దేవరాజ్ కి నామీద అనుమానం వచ్చింది. ఈ కేసుని ఇంకా లోతుగా తవ్వి మిస్టరీ తెలుసుకుంటాడు. పొర బడకు! దేవరాజ్ ఏ కేసు చేబట్టినా సక్సెస్ అయి తీరు తుంది. రంభహత్య ఇవాళ కాకపోయినా రేపైనా బైట పడుతుంది. అప్పుడు నువ్వుకాదు కదా, దేవుడుకూడా నన్ను రక్షించలేడు!"

శంకర్ ముఖంలో రంగులు మారుతున్నాయి. బటా నీలు అవతలికి విసిరి, "అందుకేం చేశావ్ ?" అనడిగాడు.

"చెప్తాను—రంభ హత్య బయటపడుతున్న భయం ఒకటి, నా బాస్ కి ద్రోహం చేస్తున్నానన్న భయం

ఒకటి—ఈ రెండూ కలిసి నన్ను ఈ నిర్ణయానికి పురిగొల్పాయి. ఎలాంటి శిక్ష అనుభవించడానికైనా సిద్ధపడతాను గానీ బాస్‌కి ద్రోహంచేసి బ్రతకలేను. నాలో గిల్టీ కాంప్లెక్స్ ఏర్పడింది. అందుకే నేను బాగా ఆలోచించి నిశ్చయానికి వచ్చాను—గుట్టు చప్పుడు గాకుండా మన ప్లాన్‌కు గుడ్ బై కొట్టి క్షేమంగా బయటపడాలి!"

శంకర్ మాట్లాడలేదు.

నేను మళ్ళీ అన్నాను, "ఈ బిజినెస్‌నుంచి క్షేమంగా బయట పడేందుకు నేనొక మార్గం కనిపెట్టాను. పథకం వేసాను. ఆ పథకంవల్ల హత్య బయటపడదు. దొంగతనం పట్టుబడదు. నగ తిరిగి యథాస్థానంలో వుంటుంది. రంభ ఆత్మహత్య చేసుకున్నట్టు రుజువవుతుంది" అని, నేను రంభ గొంతుతో రికార్డ్ చేసిన టేప్ గురించీ, దాని వుపయోగం గురించీ వివరించి చెప్పాను.

శంకర్ నోరు తెరిచిపెట్టి, కదలిక లేకుండా ఆశ్చర్యంగా విన్నాడు.

"ఈ పథకాన్ని నువ్వంగీకరించకపోతే మనిద్దరి నాశనము తప్పదు!" అన్నాను చివరికి.

"ఎలా?" అనిమాత్రం అనగలిగాడు శంకర్.

అతన్ని సరిగ్గా హేండిల్ చేస్తున్నానని నాకు నమ్మకం కుదిరింది.

"ఈ పూర్తి వ్యవహారం గురించి నేనొక ఉత్తరం రాసాను. దానితోపాటు నువ్వు ఖన్నాంలోతీసిన ఫోటో కూడ జతపరిచాను. ఆ ఫోటో నువ్వు తీసినట్టూ, నన్ను బ్లాక్ మెయిల్ చేసి నగ అపహరించినట్టు....వివరంగా వ్రాసాను."

"వ్రాసి ఏం చేసావ్?" ఈసారి అతని ముఖంలో కోపం కన్పించింది.

"నా ఫ్రెండ్ దగ్గర దాచాను" అన్నాను, "నువ్వు నా మాటలంగీకరించి, ఇద్దరి క్షేమం దృష్టిలో వుంచుకుని, ఆ నగ తిరిగి నాకిస్తే ఎలాటి ప్రమాదమూ వుండదు."

"లేకపోతే?"

"ఆ ఉత్తరం పోలీసులకి చేరుతుంది. ఇద్దరం నాశనమవుతాం."

"ఆగు! ఆ ఫోటో నువ్వు నాశనం చెయ్యలేదా?"

"లేను. ఎందుకైనా పనికివస్తుందని వుంచుకున్నాను."

శంకర్ ముఖం ఉద్రేకంతో యెర్రబడుతోంది. నన్ను అసహ్యంగా, హేళనగా చూసాడు.

"అయితే నువ్వు చాలా స్వల్ప విషయాలకి భయపడి ఈ నిర్ణయం తీసుకున్నావన్న మాట!"

తలూపాను. "అవును, పుట్టుకనుంచీ ధైర్యంలేదు నాకు. నిన్నుచూసి ఏర్పడింది—కృత్రిమంగా. నిజానికి నేను పిరికివాడ్ని—జానీ అన్నట్టు!"

"ఓ....అలాగా....నువ్వు పిరికివాడివి కాబట్టి యీ ప్లానుకి గుడ్ బై చెప్పావా?"

"అవును, శంకర్."

ఫకాలున నవ్వాడతను: "శానీ—నువ్వు ఫూల్ వి! ఆ ఫోటో నేను తీసినట్టు రుజువేమిటి?"

"దానిమీద నీ వేలిముద్ర లుంటాయి."

శంకర్ ఉలిక్కిపడ్డాడు: "ఆ నమ్మకంతో ఈ సాహసానికి పూనుకున్నావా! వెరీగుడ్! అయితే నువ్వు చాలా పొరబడ్డావ్!"

నేననుమానంగా చూశాను, "యెలా?"

"ఆ ఫోటోతో నేను బ్లాక్ మెయిల్ చేసింది డబ్బు కోసమంటాను-నువ్వేమంటావు?" అన్నాడతను తాపీగా.

"కాదు——నగకోస మంటాను" అన్నాను.

"ఎలా నిజూవు చేస్తావు?" మళ్ళీ నవ్వాడు. "నువ్వొత్త ఫూల్ వి! బఫూన్ వి! జానీదగ్గర ఫోటోలున్న విషయం జ్ఞాపకముందా?"

"ఉంది."

"అయితే వాడిప్పుడేం చేస్తాడో తెలుసా? మోసం చేసినందుకు వాటిని పోలీసులకి పంపిస్తాడు!"

"పంపనీయ్, శంకర్. ఏమవుతుంది?"

"పిచ్చివాడా! ఏమవుతుందో తెలీదా? రంభ హత్య బయటపడుతుంది! ఆ ఫోటోలు నిన్ను హంతకుడ్ని చేస్తాయి!"

పకపక నవ్వాను: "అలాగని నువ్వనుకుంటే, నా కంటే పెద్ద బఫూన్ వి నువ్వే! ఆ ఫోటోలు నన్ను హంతకుడ్ని చెయ్యవు."

"ఎందుకు చెయ్యవు? ఆ ఫోటోల్లో నువ్వేమీ ట్రిక్కులు చేయలేదు!" అర్చాడతను.

"ఐనా చెయ్యవు!" అన్నాను కచ్చితంగా.

శంకర్ ఉద్రేకాన్ని అదుపులో వుంచుకున్నాడు, "చూడు కమల్, ఏమిటి నీ ఐడియా?"

"శంకర్, నేను పిరికివాడినే గాని పిచ్చివాడ్ని కాను. నాకు బుర్ర వుంది. నీకు లేదు. ఆ ఫోటోలుతీసి నువ్వు పెద్ద పొరపాటు చేసావు. దాని ఫలితం నువ్వే అనుభవిస్తావు!"

"వెల్! బెదిరింపులు మాని నీ బుర్ర కేం తట్టిందో చెప్పు!"

నేను కాన్ఫిడెంటుగా చెప్పాను: "ఆ ఫోటోల్లో వీక్ పాయింట్—అతి సామాన్యమైన పాయింట్. కామన్ సెన్స్ వున్న ప్రతివాడికీ తడుతుంది. ఆ ఫోటోలు నువ్వు పగలు తీసివుంటే, ఆ పాయింట్ దొరికేదికాదు. రాత్రి తీశావు, నువ్వే దొరికిపోయావు...."

"సరె, సరే....అదేమిటో చెప్పు."

"రంభని నేను హత్యచేశా ననుకుందాం. శవాన్ని పాతి పెడుతున్నప్పుడు నువ్వు ఫోటోలు తీశావనుకుందాం. అది రాత్రి సమయంకాబట్టి కేమేరాకి ప్లాష్‌గన్ అమర్చకుండా తియ్యలేవు. అంతేనా? కెమేరా క్లిక్‌మనగానే ప్లాష్‌గన్ తళుక్కుమంటుంది. జిగేలుమని కళ్ళు చెదిరే మెరుపు వెలువడుతుంది. అంతేనా?"

"అవును!" ఆందోళనగా అన్నాడతను.

"రాత్రిపూట ఒకమనిషి శవాన్ని రహస్యంగా పాతి పెడుతున్నప్పుడు యెన్ని ఫోటోలు తీసే వీలుంటుంది? ఒకే ఒక్క ఫోటో! ఎందుకు? ఆ ఒక్క స్నాప్ వల్ల వెలువడ్డ ప్లాష్‌కి అతను బెదిరిపోయి పారిపోతాడు కాబట్టి. అంతేనా?"

"అవును....అవును...."

"వెరీగుడ్! ఐతే నువ్వు నేను శవాన్ని పాతి పెడుతున్నప్పుడు మూడు ఫోటోలు తీసావు. ఇదెలా సాధ్యం? మూడుసార్లు ఫ్లాష్‌బల్బ్ వెలిగినా, నే నదరకుండా బెదరకుండా, పనిపూర్తి చేసానా? గాడ్! ఆ సమయంలో నా మెదడు అంత మొద్దుబారిందా!"

పకపక నవ్వాను.

శంకర్ గాభరాగా చూస్తున్నాడు, చెమటలు కక్కుతూ.

"కాబట్టి—ఆ ఫోటోలు నన్ను వుపయోగించి బలవంతంగా నువ్వు తీశావని పోలీసులు భావిస్తారు. అంటే హత్య నువ్వు చేసావన్న మాటేకదా?—"

నా మాటలు పూర్తికాకుండానే శంకర్ తటాలున లేచి వెనక గదిలోకి వురికాడు. నన్ను పట్టించుకోకుండా శంకర్, వణుకుతున్న చేతులతో సేఫ్ తెరిచాడు.

సేఫ్‌లోంచి నెగటివ్స్, ఫోటోలు తీసాడు.

నేను ఆశ్చర్యపోయాను. వాటిని ఇక్కడే పెట్టి ఫ్రెండ్ దగ్గర దాచానని అబద్ధం చెప్పాడు!

ఫోటో లెక్కడ దాచినా శంకర్ ఈ దెబ్బతో బయటికి తీస్తాడని నాకు తెలుసు! ఈ నమ్మకంమీదే యీ పథకం తయారు చేసాను.

శంకర్ ఆ ఫోటోల్ని మార్చిమార్చి చూస్తున్నాడు.

విపరీతంగా వణకడమేగాక, చెమటలు కక్కుతూ వున్నాడు.

"జాగ్రత్తగా చూడు! పాయింట్ దొరికిందా?"

"ఓహ్, డామిట్!" నిస్సహాయంగా అన్నాడు.

"బ్యాక్ గ్రౌండ్ ఆ విషయం నిరూపిస్తుంది. ఫ్లాష్ గన్ శక్తి మేరకు పరిసరాలమీదకు వెలుగుపడింది. ఆ తరువాత నల్లగా చీకటిగావుంది—కాబట్టి ఇవి రాత్రి తీసిన ఫోటోలు" అన్నాను.

"వీటిని నాశనం చేస్తాను!" అరిచాడతను.

నే నభ్యంతరం చెప్పలేను. అగ్గి పుల్లగీసి నెగటివ్స్‌తో సహా ఫోటోల్ని తగులబెట్టాడు. నేనా మంటను చూస్తూ

నిట్టూర్చాను. ఈ వ్యవహారంలో నన్ను పట్టిచ్చే ఆధారా లన్నీ నాశనమయ్యాయి.

ఐతే, నేను జానీదగ్గర సంపాదించిన ఫోటోలుమాత్రం జేబులోనే వున్నాయి. ముందు జాగ్రత్తకోసం దేని కయినా పనికి వస్తాయని దాచుకున్నాను.

మంట ఆరిపోయాక బూడిద మిగిలింది. కాలిన నెగటివ్ ముద్దగామారి వింత వాసనవేస్తోంది.

శంకర్ ముఖంలో ఆందోళన ఇంకా తగ్గలేదు.

నేను నవ్వుకున్నాను.

## 11

"ఐతే, జానీదగ్గర వున్న ఫోటోల్ని యేం చేస్తావు శంకర్?" అడిగాను.

"వాడి దగ్గరికెళ్ళి తీసుకుంటాను" కసిగా అన్నా డతను.

మళ్ళీ నవ్వాను, "వాడి దగ్గరకు నువ్వు వెళ్ళలేవు. వాడు—మరో లోకంలో వున్నాడిప్పుడు."

"ఏమిటీ?"

"చచ్చిపోయాడు. నేనే చంపాను."

"నీకు పిచ్చిపట్టింది! ఎందుకు చంపావ్?"

"మన రక్షణకోసం! ఆ ఫోటోల కోసం!"

"నమ్మను! నువ్వు వాడ్ని చంపలేవు!"

"సరే, నమ్మాలనుకుంటే హోటల్ కంపాలాకి ఫోన్ చెయ్యి!"

శంకర్ నన్ను తీక్షణంగా, ఆ తర్వాత భయంగా చూసి, నిస్సహాయంగా కుర్చీలో కూలబడ్డాడు.

నేను తృప్తి చెందాను.

"నాడ్ని యెలా చంపావు? హత్య బయట పడితే?" అడిగాడతను, పూడుకపోయిన కంఠంతో.

"హత్య పబ్లిగ్గా పోలీసులకి తెలియజేసి మరీ చేసాను. కానీ, అది హత్య అని యెవరూ తెలుసుకోలేరు!"

"ఓహ్! నిన్ను—నీ ఉపాయాల్ని చూస్తోంటే నాకు భయమేస్తోంది!" కళ్ళు మూసుకుని తెరిచాడు శంకర్, "జానీ హత్య హత్య యెందుకు కాదు?"

నేను వివరించి చెప్పాను. ఆ ఫోటోలకోసం జానీని యెలా నా వలలో రప్పించి బిగించానో, యెలా నోరు మూయించానో, విపులంగా చెప్పాను. ఆ తర్వాత పోలీసులకి ఇచ్చిన స్టేట్ మెంట్ చెప్పాను.

"గాడ్! నువ్వు నాకంటే దుర్మార్గుడివి! నాకంతా ఇప్పుడర్థమవుతోంది! జానీకి ఆ ఫోటోలెందు కిమ్మన్నావో బోధపడింది! మమ్మల్ని మోసగించి వదిలించుకోడానికి ప్రాణాలకి తెగించి నువ్వీ నాటకమాడావు!"

"అవును, నాది నాటకం. పరిస్థితులు నన్ను నటింప జేస్తున్నాయి."

"ఆ ఫోటోలు ఇప్పుడెక్కడున్నాయి?"

"అదే వుత్తరంలో" అని టైం చూసుకున్నాను. "కమాన్ శంకర్, ఇప్పుడు అసలు విషయానికి వద్దాం. నేనిక్కడికి వచ్చి అరగంట దాటింది. మరో అరగంటలో నా ఫ్రెండ్ దగ్గరికి చేరుకోవాలి. లేదా అతను ఆ వివరాలు పోలీసులకు అందజేస్తాడు."

"ఓహో! రక్షణ యేర్పాట్లు చేసుకుని వచ్చావన్న మాట!"

"అవును: ప్రతిమనిషికీ తనని రక్షించుకునే హక్కు వుంది."

శంకర్ నవ్వాడు. పేలవమైన నవ్వు.

"ఆల్ రైట్, పరిస్థితి అర్థమైంది. ఆ ఫోటోలతో పోలీసులు నువ్వు హంతకుడివి కావని నిర్ణయిస్తారు. మరి నేనెలా హంతకుడ్ని అవుతాను?" అడిగాడతను.

"ఆ ఫోటోలు నువ్వు తీశావు కాబట్టి. ప్రతి ప్రింటు మీదా నీ వేలిముద్రలుంటాయి కాబట్టి."

"ఓహ్, అవును! ఇప్పుడు నేనా నగ నీకివ్వకపోతే ఆ వుత్తరం పోలీసులకి చేరుతుందన్నమాట?"

"అవును."

"అప్పుడేమవుతుంది?"

"నువ్వు హంతకుడవుతావు. నేను దొంగనవుతాను. ఇద్దరం జైల్లో కూచుంటాం. జీవితాంతం కూచునేది నువ్వు. అందువల్ల మనిద్దరం క్షేమంగా బయటపడాలంటే ఆ నగ నాకిచ్చేస్తే చాలు! ఇకముందు యెలాంటి భయాలూ వుండవు. నగ తిరిగి బాస్ కందేలా చేసి రంభ ఆత్మహత్య చేసుకున్నట్టు నమ్మిస్తాను. హత్య నీ మెడకు చుట్టుకోకుండా చేస్తాను."

"అలాగా? నన్ను రక్షించడానికి ఈ పథకం వేశావా? మంచిది కమల్. అలాగే కానివ్వు. నీ పథకంలో నువ్వు గెలిచావు. నా పథకంతో నేను ఓడిపోయాను. ఓటమి! నా వృత్తిలో ఇంతవరకు నేను ఓటమి చవిచూడలేదు! నువ్వు పిరికివాడివని తెలీక నీ మీద పథకం అల్లి నేను ఫూల్ నయ్యాను! చిత్తుగా ఓడిపోయాను!"

"సమయం మించిపోతోంది. నగ ఇలా ఇవ్వు."

శంకర్ లేచి నిలబడ్డాడు. అతని ముఖం చూసాను.

అవమానంతో ఎర్రబడింది. నా చేతిలో ఓడిపోయినందుకు అతను సగం చచ్చిపోయాడు.

"అవును కమల్, అన్నిటికీ సమయం మించిపోతోంది" అని సేఫ్ దగ్గరికి కదిలాడతను. నేను జాగ్రత్తగా గమనించాను.

"ఆ నగ నీకిచ్చేస్తాను" సేఫ్‌లో ఒక అర తెరిచి ప్లాస్టిక్ కవరు బయటికి తీసాడు. దాన్ని ఓ సారి చూసి నాకు చూపించాడు. నా బాస్ నగ! లైటు వెలుగులో వజ్రాలు కన్నులు మిరుమిట్లు గొలుపుతున్నాయి!

కళ్ళు మూసుకుని తెరిచాను.

శంకర్ దాన్ని ముద్దుపెట్టుకుని బలహీనంగా నవ్వాడు.

"ఈ నగ నాకు దురదృష్టాన్ని తెచ్చింది. నన్ను అంతిమ దశకి చేర్చింది. నా ఓటమికి కారణమైంది. నా ధైర్య సాహసాలకి సవాలుగా నిలిచింది....దీన్ని జయించలేను. దీని శక్తి అతీతమైనది. తీసుకో కమల్, తిరిగి నీ బాస్ కందించి క్షేమంగా వుండు!"

ఆ నగ అందుకున్నాను. ఇదంతా కలో, నిజమో అర్థం కాలేదు.

శంకర్ నేను చూడకుండా సేఫ్‌లోంచి రివాల్వర్ తీసాడు.

దాన్ని చూసి నా ప్రాణాలెగిరిపోయాయి.

పళ్ళు బిగబట్టి అన్నాను, "శంకర్, ఏం చేస్తున్నావ్?"

"నిన్ను చంపే పిచ్చిపని చెయ్యడంలేదు. నేను పిరికి వాళ్ళని చంపను! బుద్ధి చెప్తాను."

"అంటే?" నా నాలిక తడారి మాటలు సరిగా రాలేదు.

"నిలాంటి పిరికివాడు నా ఫోటో మాండటం నీ దుర దురదృష్టమైతే, నీ గట్స్‌ని నేను తప్పుగా అంచనా వేసుకోడం నా దురదృష్టం. ఊహించని విధంగా ఒక పిరికివాడి చేతిలో చిత్తుగా ఓడిపోయి ఎలా బ్రతకగల ననుకున్నావు? ఓటమి అంగీకరించే పరిస్థితి ఏర్పడినప్పుడు, చావును స్వీకరించాలని నేనీ వృత్తిని చేపట్టినప్పుడే ఒట్టు వేసుకున్నాను...."

నా గుండె దడదడలాడింది. విసురుగా రివాల్వర్ లాక్కోబోయాను.

"నో, మై ఫ్రెండ్! గుడ్ బై!" శంకర్ నా చెయ్యి విదిల్చికొట్టాడు.

నేను వెనక్కి తూలి నిలదొక్కుకునేంతలో—శంకర్ నేను స్వప్నంలో కూడా వూహించని దారుణం చేసాడు.

కళ్ళు గట్టిగా మూసుకుని, రివాల్వర్ నుదుటికానించి ట్రిగ్గర్ లాగాడు. గుండెల్ని తూట్లుపొడిచే శబ్దంతో పరిసరాలు ప్రతిధ్వనించాయి. జివ్వుమని తలలో ఏర్పడ్డ రంధ్రం నుంచి రక్తం వెలువడి నా ఛాతీమీద చిమ్మింది. ఆ తర్వాత అతని చేతిలో రివాల్వర్ పట్టుతప్పి ఖణేలుమని నా కాళ్ళదగ్గర పడింది. శంకర్ యేదో గొణుగుతూ టేబిల్ మీద పడి, ఆ తర్వాత జారి కింద బోర్లాపడ్డాడు.

హఠాత్తుగా వీధిలో కలకలం బయలుదేరింది....

జనం అరుస్తూ పరిగెడుతున్నారు. నాలో చలనంలేదు! వీధిలో జనమంతా ఇంటిముందు చేరి కేకలు వేస్తూ, శక్తికొద్దీ తలుపులు బాదుతున్నారు.

నేనలాగే నిలబడి వున్నాను....

నా చేతిలో నగ, కాళ్ల దగ్గర రివాల్వర్ వున్నాయి.

# 12

అసిస్టెంట్ కమీషనర్ దేవరాజ్ ముఖం ఆందోళన వల్లనో, లేక ఊహించని పరిణామం వల్లనో పాలిపోయి వుంది. జీవంలేని కళ్ళతో చూస్తూ, గెడ్డంకింద చెయ్యి ఆనించి, ఏదో తీక్షణంగా ఆలోచిస్తున్నాడు....

అతని ఎదురుగా టేబిల్ పైన నగ, రివాల్వర్ నా జేబులో దొరికిన ఫోటోలూ వున్నాయి. నా చెరోపక్క కూచున్న ఇన్ స్పెక్టర్స్ కళ్ళు వాటిపైన నిశ్చలంగా వున్నాయి.

ఆఫీసులో మూడు ఫ్యాన్లు గాలి విసురుతున్నా, నాకు సరిపోవడంలేదు. నా శరీరం విపరీతమైన చెమటపట్టి, భరింపరాని వాసనవేస్తోంది. నా తెల్లటి పాలిస్టర్ షర్టు మీద ఎర్రటి శంకర్ రక్తం మరకలు క్రమంగా నల్లబడు తున్నాయి. నేనిప్పుడేదీ ఆలోచించడంలేదు. మొద్దుబారిన మెదడుతో తటస్థంగా కూచున్నాను.

బయట చిమ్మచీకటి — లోన నరాల్ని పిండేసే నిశ్శబ్దం.

క్షణాలు, నిమిషాలు దొర్లిపోతున్నాయి.... కాస్సేపటికి నేనే నిశ్శబ్దాన్ని భరించలేనని గ్రహించాను. అసహనంగా కదిలి దేవరాజ్ ని చూసాను. ఇప్పుడతని కళ్ళు నా ఛాతీ మీద రక్తం మరకల్ని చూస్తున్నాయి.

"సర్ —" అన్నాను, అతికష్టంమీద గొంతు పెగిల్చి. ఆ తర్వాత ధైర్యం కూడదీసుకుని, "ఇంకెంత సేపు?" అన్నాను.

దేవరాజ్ కళ్ళు నా ముఖంమీద పడ్డాయి: అసహ్యించుకుంటున్న చూపులు! తల వంచుకున్నాను.

"నీ బాస్ వచ్చేవరకు."

అతని మాటలు విని అదిరిపడ్డాను.

"నా బాస్! ఆయనెందుకు, సర్?"

"మేం ఆయనతో మాట్లాడాలి. ఆయన లాయర్‌తో వస్తున్నాడు."

కొన్ని క్షణాలవరకు నాకు వూపిరాడలేదు!

"సర్! నా గురించి బాస్‌కి చెప్పారా? ఓహ్.... యెందుకు చెప్పారు!" కుడిచేత్తో నుదుటిమీద కొట్టుకున్నాను.

దేవరాజ్ కఠినంగా చూసాడు: "చూడు మిస్టర్! నువ్వు ఆడిన నాటకం, కూసిన కూతలూ చాలు! నోరు మూసుకుని నీ బాస్ వచ్చేవరకు కూచో!"

నా కేడుపు ముంచుకొచ్చింది.

"కానీ-సర్-ఈ సంగతి విని....ఆయన...ఎలా రియాక్ట్ అయ్యాడు?"

"ప్లీజ్, షటప్!" కసిరాడతను.

శివనేశన్ కల్పించుకున్నాడు. "మిస్టర్ కమల్, మీ బాస్‌కేమీ కాలేదు. క్షేమంగా వున్నాడు. ఈ సంగతి విని ఫకాలున నవ్వాడు! నమ్మలేదు, తెలుసా? మిమ్మల్ని ఫూల్స్ అన్నాడు! మీరలాంటి పని చెయ్యరన్నాడు— మీ మీద ఆయనకెంత విశ్వాసం వుందో మీకు తెలీదు. ఆయన వచ్చేవరకు వేచి చూడండి."

తేలిగ్గా వూపిరి వదిలాను. బాస్ ఎలాంటి షాక్‌కి గురి కాలేదు. అదే చాలు! కాని నన్నెంత అమాయకంగా నమ్ముతున్నాడు!

మళ్ళీ దేవరాజ్‌తో అన్నాను: "సర్, నా బాస్

లాయర్‌తో యెందుకు వస్తున్నాడు? నన్ను రక్షిస్తాడా!"
ఫకాలున నవ్వాను. "పిచ్చి బాస్! నన్నెవరూ రక్షించ లేరు! నేను రంభని చంపాను-జానీని చంపాను-చివరకి శంకర్ని చంపాను! ఎందుకో తెలుసా? దానికోసం! ఆ నగకోసం!"

"షటప్, మాట్లాడకు!"

"నన్ను తక్షణం లోనికి తొయ్యండి, సర్!"

"నోర్మూయి! నీ బాస్ లాయర్‌తో వచ్చేవరకు నోరు విప్పకు!"

నేను వూరుకోలేదు: "లాయర్! ప్రపంచంలో ఏ లాయర్ నన్ను రక్షిస్తాడు! సర్! నా మీద మీరింత దయ చూపడం మంచిది కాదు! మీ దయకి కారణం నా బాస్ పలుకుబడి కావచ్చు. కానీ ఇప్పుడు-నా బాస్‌తో నాకెలాంటి సంబంధమూ లేదు! మీరెంత దయ చూపినా నాకు జైలుశిక్ష తప్పదు సర్! సర్, చిన్నప్రశ్న: నా కెన్నేళ్ళు శిక్ష పడుతుంది?"

"యూ బ్లడీ బాస్టర్డ్!" దేవరాజ్ అర్చాడు అసహనంగా, "కీప్ యువర్ మౌత్ షట్!"

డేవిడ్ నన్ను కోపంగా చూసాడు. అతనేదో అనబోయేంతలో నేనే అన్నాను: "నాకు కొన్నేళ్ళు జైలు శిక్ష సరిపోదు. మీకు తెలుసా? నేను పరువుకోసం ప్రాకులాడి ఇందరి ప్రాణాలు తీసి పీకలమీదికి తెచ్చుకున్నాను. నా పరువు తిరిగిరాదు. నన్ను ఉరితియ్యండి!"

దేవరాజ్ విసురుగా చెయ్యెత్తి నా చెంప ఛెళ్ళు మనిపించాడు.

"గెట్ దిస్ బిచ్ అవుటాఫ్ హియర్!"

అతని అరుపు విని ఇన్‌స్పెక్టర్స్ ఛటుక్కున లేచి, నన్ను చెరో రెక్క పుచ్చుకుని బయటికి లాక్కెళ్ళారు.

"మీరు పిచ్చిగా వాగుతున్నారు!" ఆరోపించాడు డేవిడ్.

"ఏమిటి? నేను నేరస్థుణ్ని కానా?"

"కమీషనర్ మరోవిధంగా ఆలోచిస్తున్నారు. ఈ కేసులో కొన్ని సంఘటనలు మీకు విరుద్ధంగా వున్నాయి."

నేను మాట్లాడలేదు.

విరుద్ధంగావున్నా, అనుకూలంగావున్నా, నా పరువు తిరిగిరాదు కదా? ఏదో కొద్దికాలం శిక్ష తర్వాత బయట పడి తలెత్తుకుని తిరగలేను కదా?

గట్టిగా కళ్ళు మూసుకున్నాను.

చివరికి—చివరికి ఇలా బెడిసికొట్టింది వ్యవహారం!

శంకర్! చచ్చి సాధించాడు! ఓటమిని అంగీకరించి, ఆ తర్వాత బ్రతుకును సహించలేక ప్రాణాలు తీసుకోడానికెంత ధైర్యం! ఆ ధైర్యం నాకుంటే, అతను మొదటిసారి బ్లాక్ మెయిల్ చేసినప్పుడే ప్రాణాలు తీసుకునేవాణ్ని. నా పరువును కాపాడుకునేవాణ్ని! ప్చ్.... నేను పిరికివాణ్ని.

ఇప్పుడు నేనన్ని అర్హతలూ కోల్పోయాను. నా బాస్ విశ్వాసానికి తగను, మాధవి ప్రేమకీ తగను.

నన్ను వారసుణ్ని చేసుకుంటున్నట్టు నా బాస్ చెప్పిన మాటలు, నన్ను ప్రేమిస్తున్నట్టు మాధవి చెప్పిన మాటలు, ఈ రెంటినీ కలిపి నేనూహించుకున్న భవిష్యత్ కేవలం ఎండమావిలాటి స్వప్న జగత్తుగా సమాధ చేసెయ్యాలి.

నాకిప్పుడు భవిష్యత్ లేదు.

నన్ను నీరజ రమ్మంటోంది— చేతులు జాపి— జాలిగా నవ్వుతూ. ఈ ప్రపంచంలో ఇక నాకు భవిష్యత్ లేదు కాబట్టి, ఆమెని చేరుకుని, ఏ కాలాలతోనూ నిమిత్తం లేకుండా అనంతకాలం మరో జగత్తులో విహరిస్తాను.

అవును. ఇది సరయిన ఆలోచన!

కాబట్టి....

ప్రస్తుతం నేను సాధ్యమైనంత త్వరలో చావు కోరుకోడం తప్ప, మరో ఆలోచన రానీయకూడదు!

ప్రాణాలకంటే పరువు ముఖ్యమనీ, అడ్డమైన మార్గాలు తొక్కి— దాన్ని కాపాడుకోలేమని నాకిప్పుడు తెలిసి వచ్చింది కదా?

—: ఐపోయింది :—

# పగవాని కూతురు

కె. బి. యస్. కుమార్

"ప్రతిమా! ఏమిటి నువ్వంటున్నది?" కోపంగా, ఆశ్చర్యంగా అన్నాడు మధుమూర్తి.

"అందరు ఆడపిల్లలూ యెప్పుడో ఓసారి చెయ్యవల్సిన పనే నేనూ చేస్తానంటున్నాను...." కుండ బ్రద్దలుకొడుతోన్నట్టుగా అంది ప్రతిమ.

"ఇది అందరు ఆడపిల్లలు చేసేపనికాదు! నీలాంటి కొందరు చేసినా దానివల్లవచ్చే అనర్థాలకు మీరే చింతిస్తారు...."

"ఎవరి ఖర్మకి వారే కర్తలని అప్పుడు నేనే సరిపెట్టుకుంటాను. ఇప్పుడు నువ్వు అడ్డుపడితే నీ వల్లనే నేను సుఖపడలేకపోయాననే భావం నాలో కలగొచ్చు."

"ఆ నింద నాకొచ్చినా పర్వాలేదు. కాని నా ఒక్కగానొక్క ముద్దుల చెల్లెలు—వూరూ పేరూ లేని అనామకుణ్ణి కట్టుకోవటం నేను సహించలేను."

"అతని పేరులోనే వుంది కదన్నయ్యా! అతని పూర్తి

పేరు బెల్లంపల్లి విజయభాస్కర్. పేరులోనే వూరు, వూరు తర్వాత పేరు పెట్టుకొని వూరూ పేరూలేని వాడంటావేం?"

"డబ్బులేకపోతే ఏదున్నా లేనట్టే!"

"హుఁ....డబ్బు! డబ్బుంటే ఏది లేకున్నా ఉన్నట్టేనా? మనకున్న డబ్బంతా ఖర్చుపెట్టి చనిపోయిన అమ్మ-నాన్నల్ని తిరిగి బ్రతికించగలనా?"

"అదంతా నాకు తెలీదు. నాన్న పోయినప్పుడు నువ్వు చిన్నపిల్లవి. అమ్మ చనిపోతూ నీకు మంచి సంబంధం చూసి పెళ్ళిచెయ్యమంది. అప్పుడు నువ్వూ దగ్గరే వున్నావు. అప్పుడే మర్చిపోయావా?"

"మంచి సంబంధమంటే నీ దృష్టిలో ఏమిటి?"

"మన తాహతుకు తగింది."

"అమ్మ చనిపోతూ మరో కోరికకూడా కోరింది. ఎన్ని కోరికలు కోరినా ఆమె కోరికలోని అంతరార్థము వొక్కటే. నేను సుఖపడాలి. అంతేకదూ!"

"విజయభాస్కర్‌ని చేసుకొని సుఖపడతానన్న నమ్మకము నీకుందా?"

"మనిషికి కావలసింది డబ్బొక్కటే కాదన్నయ్యా! అంతకు మించినవి మరెన్నో వున్నాయి."

"ఎన్నున్నా లేకపోయినా నీ పెళ్ళి ఓ దరిద్రుడితో జరగడం నేను సహించను. ఎవడో అనామకుడికిచ్చి చేతులు దులుపుకున్నాడు అన్న నింద నేను సహించలేను."

"ప్రేమించిన వాడితో గాక బలవంతంగా మరొకడితో పెళ్ళి జరిపించి ఆ పిల్ల గొంతుకోశాడు అన్న నిందను భరించగలవా? విజయభాస్కర్‌తో తప్ప మరెవ్వరి

తోనూ నేను సుఖపడలేనని నీకు తెలీదా?"

"నాల్రోజులు పోతే అదే సర్దుకుపోతుంది. మనసు అదుపులో వుండాలేకాని దానికతీతమైనది యేదీ లేదీ ప్రపంచంలో."

"ఆడదాని మనసు నీ కర్థంకాదన్నయ్యా! నువ్వా ఆడదానిగా పుట్టుండాల్సింది."

"నాకే నీతులు చెప్పేదానివయ్యావన్న మాట!" కోపంగా అన్నాడు మధుమూర్తి.

"నేనింకా చిన్నపిల్లననుకుంటోన్నావా అన్నయ్యా! నా గురించి స్వయంగా ఆలోచించగల వయసు నాకొచ్చేసింది. చదువు, సంస్కారం ఏ జీవితంలో మాధుర్యం వుంటుందో తెలియజేస్తోంది."

"హుఁ....అసలు నిన్ను చదివించటం నాదే తప్పు. వంశప్రతిష్ఠ మంటగలిపే పని చేస్తావనుకోలేదు ఛఛీ...." చెప్పులు తొడుక్కొని బయటికి వెళ్ళిపోయాడు మధుమూర్తి.

శిలాప్రతిమలా నిల్చుండిపోయింది ప్రతిమ!!

ఎందుకు అన్నయ్య యిలా మారిపోయాడు? తన సుఖం కోసం ప్రాకులాడుతున్నాడే కాని, అది విజయభాస్కర్ జీవిత భాగస్వామిగా వున్నప్పుడే సాధ్యపడుతుందని అన్నయ్యకు తెలీదా?

చిన్నప్పట్నుండీ అన్నయ్యకు తనంటే ఎంతో ప్రేమ. ఏది అడిగినా క్షణాల్లో కళ్ళెదటికి తెప్పించేవాడు. అలాంటిది జీవితంలో కావలసిన అతిముఖ్యమైన విషయంలోనే ఎందుకిలా ప్రవర్తిస్తున్నాడు?

డబ్బు!

అవును డబ్బు!! తను లక్షాధికారి బిడ్డ. విజయభాస్కర్

సామాన్యుడు. అయినంతమాత్రాన తన భర్త కావటానికి కతని కర్హత లేదా? అతనికీ ఏ లాటరీలోనో, గుర్రప్పందాల్లోనో ఏ అయిదారు లక్షలో వస్తే సంతోషంగా కాళ్ళు కడిగి కన్యాదానం చేస్తాడా?

అలాంటప్పుడు మనిషికి విలువేముంటుంది? ఏది శాశ్వతం? డబ్బా లేక సహృదయమా? ఈ మాత్రం తెల్సుకోలేని మనిషిని ఏమనాలి?

భాస్కర్‌కి అంతస్తు లేకపోవచ్చు. కాని తననే నమ్ముకున్న ఓ ఆడదాని జీవితాన్ని నాశనం చెయ్యాలనే దురుద్దేశ్యం అతనికి లేదు. అతడు తనని సుఖపెట్టలేడన్న అనుమానం తనకి లేదు.

భాస్కర్‌లో పట్టుదల వుంది. పట్టభద్రుడైన తను ఏనాటికైనా ఓ ఉద్యోగాన్ని పొందగలననే నమ్మకం వుంది. అలా కాని పక్షంలో కూలో నాలో చేసైనా సరే కట్టుకున్న దాన్ని పోషించగల తెగువతనం కూడా వుంది.

కాని అన్నయ్యనెలా ఒప్పించాలి? ఆయన మనసు నొప్పించకుండా భాస్కర్‌తో తన పెళ్ళి జరిగేమార్గం ఏమిటి? తన జీవితం ముళ్ళబాట కాకుండా కాపాడాలంటే తను ఏం చెయ్యాలి???

అన్నయ్యతో చెప్పకుండా భాస్కర్‌ని రిజిస్టర్ మేరేజ్ చేసుకుంటే....?

అమ్మో! ఇంకేమైనా వుందా? ఆ తర్వాత కలిగే పరిణామం....?

....ఏమవుతుంది? మిద్దెత్తున ఎగుర్తాడు అన్నయ్య ఆస్తిలో చిల్లిగవ్వ ఇవ్వనంటాడు. అసలు నువ్వు నా చెల్లిలివే కాదు పొమ్మంటాడు.

ఎన్నో అనుమానాలూ మరెన్నో ప్రశ్నలతో కాసేపు

తృప్తినీ మరికాసేపు అసంతృప్తినీ పొందుతోన్న ప్రతిమకి ఆ రాత్రి శివరాత్రే అయ్యింది.

## 2

"ఓ వ్యక్తిని నువ్వు మరచిపోవాలి. ఎన్ని లక్షలు పుచ్చుకుంటావ్?" తాపీగా అడిగాడతను.

"ఎవరు మీరు? నేను ఎవర్నో మరచిపోతే మీరెందుకు నాకు లక్షలివ్వాలి?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు భాస్కర్.

"ప్రతిమ నా చెల్లెలు!!!"

ఆశ్చర్యంనుండి తేరుకోటానికి భాస్కర్ కి రెండు నిమిషాలు పట్టింది. ఆ తర్వాత అతని హృదయంలో బాధ ప్రవేశించి ఆశ్చర్యాన్ని పారద్రోలింది.

"మీ పేరు మధుమూర్తని ప్రతిమ అప్పుడప్పుడూ నాతో చెబుతుండేది. చూడండి మధుమూర్తిగారూ! అయస్కాంతానికి ఆకర్షించే శక్తివుంది. మన ఇళ్ళలోని వస్తువు లెవ్వరూ అపహరించటానికి వీల్లేకుండా భద్రత కోసం మనం తలుపులకి వేసే తాళాన్ని అది ఆకర్షిస్తుంది. బజార్లో పనికి రాకుండా చెత్తలో కలిసిపోయిన ఇనప ముక్కనీ ఆకర్షిస్తుంది!....

"కారణం ఆ తాళమూ ఈ ఇనపముక్కా ఒకే లోహంతో తయారు చెయ్యబడినవే కాబట్టి....!

"స్త్రీ హృదయమూ అంతే! తనని సుఖపెట్టగలడనే విశ్వాసం వున్నపుడు ధనవంతుణ్ణేకాదు ఓ యాచకుణ్ణి ప్రేమించటానిక్కూడా వెనుదియ్యదు. కారణం-ధనవంతుడైనా పేదవాడైనా మనుషులంతా ఒక్కటే...."

"నీతో నీతులు బోధించుకోటానికి రాలేదు నేను. నా చెల్లెల్ని పెళ్ళాడే అర్హత నీకుందా అని ప్రశ్నించ టానికి వచ్చాను...."

"అర్హత...." నిర్లిప్తంగా నవ్వాడు భాస్కర్. "మీతో నా అర్హతని దేనితో బేరీజు వేస్తారు మధు మూర్తిగారూ!?"

"డబ్బులో—పలుకుబడిలో. ఆ రెండూ వున్నాయా నీకు?"

"లేకపోవచ్చు. కాని నాలో చదువుంది. సంస్కారం కూడ వుందనే అభిప్రాయం వుంది. కట్టుకున్నదాన్ని పస్తు లుంచననే ఆత్మవిశ్వాసం వుంది...."

"అంటే చదువు, సంస్కారం మాలో లేవంటావా?" కోపంగా ప్రశ్నించాడు మధుమూర్తి.

"ఆవేశపడకండి. నాలో వున్నాయంటే మీలో లేవని కాదు. కాస్త నింపాదిగా ఆలోచించండి. ప్రతిమ ధన వంతురాలని మొన్నటివరకూ తెలియదు నాకు. నాకు ధనికులంటే సరిపడదు. ఆ విషయం తెల్సుకొని ప్రతిమ తన కలిమిని నా వద్ద దాచిపెట్టింది. మొన్న మొన్ననే అసలు విషయం చెప్పి నన్ను క్షమించమని కోరింది...."

"బుద్ధితక్కువ పని చేసింది. లేకపోతే నిన్ను క్షమించ మని అడగటం ఏమిటి?"

"మధుమూర్తిగారూ!" కాస్త తీక్షణంగా అన్నాడు భాస్కర్. "నేను ధనవంతుణ్ని కాకపోవచ్చు మీలా. కాని ఆత్మాభిమానంలో మీకేమీ తీసిపోనని మీరు గుర్తుంచుకోటం మంచిది."

"లేకపోతే ఏం చేస్తావోయ్! తలకొట్టి మొలేస్తావా? హనుమంతుడి ముందు కుప్పిగంతులు పనికిరావు. ఈ మధు

మూర్తి పరశురామయ్యగారి కుమారుడని మర్చిపోకు! తన తండ్రికి ఏ మాత్రం తీసిపోడు. మర్యాదగా నా చెల్లెల్ని మర్చిపో.... లేకపోతే ఈ మధుమూర్తిలో పరశురాముణ్ణే చూస్తావ్ జాగ్రత్త!!!" విసురుగా వెళ్ళిపోయాడు మధుమూర్తి ....

అతను వెళ్ళిపోగానే వులిక్కిపడ్డాడు భాస్కర్.

'పరశురామయ్య!!'

'అవును పరశురామయ్య....తన తండ్రి ప్రాణాలని కిరాతంగా పొట్టనబెట్టుకున్న పరశురామయ్య....తమ ఆస్తి అన్యాయంగా తనపరం చేసుకున్న పరశురామయ్య. స్వయానా చిన్నాన్న కూతురైన తన తల్లి రామలక్ష్మిని చెల్లెలని కూడ కనికరించక చిత్రహింసలుపెట్టి బలవంతంగా తమ ఆస్తిని తన పేర వ్రాయించుకున్న తన మామయ్య పరశురామయ్య, ప్రతిమ తండ్రి పరశురామయ్య.... ఒక్కడేనా??'

ఒక్కొక్క ప్రశ్నా, ఒక్కొక్క సందేహమూ ఒక్కో పదునైన సూదిలా మెదడుని పొడుస్తోంటే అక్కడ నిలబడలేక పోయాడు భాస్కర్.

పరశురామయ్య ముఖాన్ని గుర్తుకు తెచ్చుకో యత్నించాడు. సాధ్యం కాలేదు. గబగబ తన పెట్టెవద్దకి వెళ్ళాడు. పాతపుస్తకాలన్నీ గబగబ కెలికాడు.

వెలిసిపోయి తెల్లని మచ్చలుపడ్డ ఓ పాతఫోటోని ఓ పాతపుస్తకంలోంచి వెలికితీశాడు. తదేకంగా చూశాడు. అంతే....

నెమ్మదిగా భాస్కర్ ముఖం ఎర్రబడసాగింది. ఆవేశంతో అతనిలోని రక్తం కుతకుత ఉడకసాగింది.

"....అవును....సందేహంలేదు—ఆ పరశురామయ్యే!

ఆ పోలికలు మధుసూదన్‌లో స్పష్టంగా కన్పిస్తోన్నాయ్!"
తన మా....ను....య్య! ప్రతిమ!!?? తన ను....ర....
ద....లు....!!!

గబగబా పెట్టె సర్దేసి గదికి తాళంవేసి పార్కు కేసి నడిచాడు భాస్కర్.

సాయంత్రం కావటంతో చల్లగా గాలి వీస్తోంది. రంగురంగుల సీతాకోకచిలుకలు పార్కులోని పువ్వుల చుట్టూ తిరుగుతూ వాటిలోని మకరందాన్ని తాగాలని తపిస్తోన్నాయి.

అక్కడక్కడ చిన్నపిల్లలు ఆడుకుంటున్నారు. ఆడా మగా-జంటలు జంటలుగా సరదాగా కబుర్లు చెప్పుకుంటూ పార్కులో నెమ్మదిగా తిరుగుతోన్నారు.

ఒక్కసారి పార్కంతా కలయజూశాడు భాస్కర్.

అంతటి ప్రశాంత వాతావరణం కూడ అతని హృదయంలోకి ప్రశాంతతని చొప్పించలేకపోయింది.

భాస్కర్ మస్తిష్కం గతాన్ని నెమరు వేసుకో సాగింది....

# 3

భాస్కర్ తండ్రి శేషగిరిరావు లక్షాధికారి. ఆ దంపతులకి భాస్కర్ ఒక్కడే సంతానం.

శేషగిరిరావు భార్య దుర్గమ్మకి అన్నవరసవుతాడు పరశురామయ్య. అంటే ఆమె పెదనాన్న కుమారుడు.

పరశురామయ్య, అతని భార్య, కొడుకు మధు ముగ్గురూ శేషగిరిరావు యింట్లోనే వుండేవారు. శేషగిరిరావుకు పరశురామయ్యపై నమ్మకం వుండేది. దానికితోడు అతను నిరుపేద కావటంతో ఆ కుటుంబాన్ని కూడ తనవద్దే

వుంచుకొని పోషిస్తూండేవాడు.

శేషగిరిరావుకు ఒక ఫ్యాక్టరీ వుండేది. దాని బాగోగులు చూడటానికి పరశురామయ్యని నియోగించాడు.

ఇటు నమ్మకంగా వుంటూనే అటు ఫ్యాక్టరీలో తప్పుడులెక్కలు వ్రాసి డబ్బు చేసుకున్నాడు పరశురామయ్య. అప్పుడే పరశురామయ్యకి ప్రతిమ పుట్టింది. నాలుగేళ్ళు గడిచాయిలాగే.

అంతటితో ఆగక జానపద సినిమాలో దుష్టమంత్రిలా ఫ్యాక్టరీలోని కొందరు బాధ్యతగల వుద్యోగులకి బాగా డబ్బుఆశ చూపి వాళ్ళని తనవేపు త్రిప్పుకున్నాడు.

నెమ్మదిగా శేషగిరిరావుని క్లబ్బుకి పరిచయం చేశాడు. తాగుడు, వ్యభిచారం అలవాటు చేశాడు.

ఆ నరకానికి అలవాటు పడిపోయి అదే స్వర్గమని భావిస్తోన్న శేషగిరిరావు మధువుని, మగువని తప్ప అన్నీ మర్చిపోయాడు.

ఓ రోజు బాగా త్రాగించి తెలివిగా ఫ్యాక్టరీ తాలూకు డాక్యుమెంట్స్పై సంతకాలు తీసుకొని ఫ్యాక్టరీకి అధిపతయ్యాడు, పరశురామయ్య.

భర్త ఇంటిని మర్చిపోవటం, అన్న ఫ్యాక్టరీపై అధికారం చెలాయిస్తోండటం, ఫ్యాక్టరీ వుద్యోగులు కూడ పరశురామయ్యకు తొత్తుల్లా తలలూంచటం —— ఇవన్నీ దుర్గమ్మలో అనుమానాన్ని రేకెత్తించాయి.

ఆ అనుమానాన్ని భర్తనడిగి తీర్చుకుందామనుకుంటూండగానే శేషగిరిరావు మరణించాడు కారు డ్రయివ్ చేస్తూ చెట్టుకి గుద్దుకొని!

బ్రేకులు ఫెయిల్ కావటమే కారణమని కొందరు, తాగిన మైకంలో సరిగా డ్రయివ్ చెయ్యలేకపోయాడని

మరికొందరు అనుకున్నారు.

కల్లిబొల్లి ఏడుపులు ఏడ్చి దుర్గమ్మవద్ద నమ్మకం కల్గించాలని చూశాడు పరశురామయ్య. కాని దుర్గమ్మ అతన్ని నమ్మలేకపోయింది.

శేషగిరిరావు మామగారు దుర్గమ్మ పేరుతో వాళ్ళు ప్రస్తుతం వుంటోన్న తన భవనాన్ని ఆమె పేర రిజిస్టరు చేయించారు. ఆమె ఒక్కతే కూతురు కావటంతో, అతను లక్షాధికారి కావటంతో దాదాపు పదిలక్షలు ఖరీదు చేసే ఎస్టేట్‌ని ఆమె పేర వ్రాయించాడు.

వాటిని కూడ కాజెయ్యటానికి గోతికాడి నక్కలా కాచుక్కూర్చున్న పరశురామయ్య, ఓ రోజు తన అసలు రూపాన్ని దుర్గమ్మకి చూపాడు. ఆస్తిమొత్తం తన పేర వ్రాయకపోతే దుర్గమ్మకొడుకు పదేళ్ళ భాస్కర్‌ని చిత్రవధ చేస్తానని బెదిరించాడు.

దుర్గమ్మ ఏడ్చింది. పరశురామయ్యని దుమ్మెత్తిపోసింది. అతన్ని కొట్టబోయింది.

కాని పరశురామయ్య ఆమెకలాంటి అవకాశం ఇవ్వలేదు. నలుగురైదుగురు గూండాల సాయంతో ఆమెని అదుపులోకి తీసుకుని స్తంభానికి కట్టించి కొరడా తెగేలా కొట్టాడు.

ఆ బాధలకు తట్టుకోలేక దుర్గమ్మ సంతకం చెయ్యటం, అయిదు నిమిషాల్లోగా పరశురామయ్య రివాల్వర్‌కి బలి కావటం యాంత్రికంగా జరిగిపోయింది.

ఈ ఘోరాన్ని కళ్ళారా చూసిన శేషగిరిరావు నౌకరు దస్తగిరి పిచ్చిపట్టినవాడిలా బయటికి పరిగెత్తాడు. అప్పుడే బడినుండి యింటికి వస్తోన్న భాస్కర్‌ని తీసుకొని ఇంటికి పోలేదతను. ఏదో వూరువెళ్ళే బస్సెక్కాడు.

ఆ తర్వాత భాస్కర్‌ని అతనే పెంచాడేలాగో. స్వతహాగా చురుకైనవాడు కావటంతో భాస్కర్ పూర్తిగా దస్తగిరిపై ఆధారపడక స్కాలర్‌షిప్పులతో బియ్యేలో ప్రవేశించాడు.

బియ్యే మొదటి సంవత్సరాంతంలో దస్తగిరి చనిపోతూ, భాస్కర్‌తో అన్ని వివరాలూ చెప్పాడు....

పటపట పళ్ళు కొరికాడు విజయభాస్కర్. అతనిలో ఆవేశం వెల్లువలా పొంగింది.

బంధువైన పరశురామయ్య తన కుటుంబాన్ని రాబందులా కబళించాడు. దస్తగిరివల్ల అన్ని విషయాలూ విన్నాక తనలో పగ చెలరేగింది. ఇన్నాళ్ళూ ఈ విషయం తెలీకపోవటంతో, చదువుపై ధ్యాసని పూర్తిగా లగ్నం చెయ్యటంతో పరశురామయ్య రూపం అతని హృదయం లోంచి చెరిగిపోయింది. అతన్ని వెదికినా ప్రయోజనం లేదన్న నిస్పృహతో ఆ ప్రయత్నాలు విరమించుకున్నాడు.

బియ్యే కంప్లీటయ్యాక తన స్నేహితుడు వుద్యోగం ఇప్పిస్తానని వ్రాయటంతో హైదరాబాదు వచ్చాడు. స్నేహితుడు వుద్యోగం ఇప్పించాడు. కాని అది టెంపరరీ జాబ్.

ఆ సమయంలోనే అనుకోకుండా పరిచయమయింది ప్రతిమ. వెదకబోయిన తీగ కాలికి తగిలింది. ఐతే అది తను వెదుకులోన్న తీగేనని ఇవ్వాళే తెలిసింది.

ఇప్పుడేం చెయ్యాలి? కిరాతకుడైన పరశురామయ్యపై పగతీర్చుకుందామంటే అతను చచ్చిపోయాడు. భగవంతుడు వాణ్ని తన చేతుల్లో చంపే అవకాశాన్ని దూరం చేసేడు.

ప్రతిమపై యే విధంగా పగతీర్చుకోవాలి?....నో....
ప్రతిమ అమాయకురాలు. ఆమెకివేవీ తెలియవు. ఆమెలో
పరశురామయ్య రక్తమే ప్రవహిస్తోన్నా, అతని గుణ
గణాలు మాత్రం ఆమెకు రాలేదు!

మధుమూర్తి!!

అవును మధుమూర్తి! .... అదే రక్తం! .... అవే గుణ
గణాలు! తండ్రికి తగిన కొడుకని గొప్పలు చెప్పుకొంటు
న్నాడు. వాడిపైనే పగ తీర్చుకోవాలి!

మధుమూర్తిపై పగ తీర్చుకోవాలంటే ఏంచెయ్యాలి?

ఒక్కటే మార్గం....

# 4

మెట్లుదిగి వస్తూ యధాలాపంగా గుమ్మంవేపు చూసిన
మధుమూర్తి కొయ్యబారి పోయాడు.

ఎదురుగా ప్రతిమ, విజయభాస్కర్ ....దంపతులుగా
నూతన దంపతులుగా.... మెళ్ళో పూలదండలతో....

"ప్రతిమా!" హాలు దద్దరిల్లేటుగా అరిచాడు. కలో,
నిజమో తేల్చుకోలేక కళ్ళు గట్టిగా నులుముకుని మరీ
చూశాడు.

సందేహంలేదు. అది కలకాదు!

మూడేసి మెట్లు ఒక్కసారిగా దిగుతూ గుమ్మంవద్దకు
వచ్చాడు.

నెమ్మదిగా లోనికి రాబోయింది ప్రతిమ.

"ఆగు...." గర్జించాడు అదే కంఠస్వరంతో.

"ఎవరి నడిగి చేసుకున్నావ్ వీణ్ని?"

"ఎవర్నడిగీ చేసుకోలేదు. అందుకే యెవర్నీ అడ
క్కుండా లోపలికొస్తున్నాను" దృఢంగా పలికింది ప్రతిమ

కంఠం.

"....యూ స్టుపిడ్! నా చెల్లెల్ని అమాయకురాల్ని చేసి దాన్ని వల్లో వేసుకుని ఆ స్త్రీ కాజెయ్యటాని కెత్తులు పన్నుతున్నావా? నా బొందిలో ప్రాణముండగా నా చెల్లెలి భర్తగా నిన్ను చూడలేను...."

"నేనుమాత్రం నా బొందిలో ప్రాణం వుండగానే నీ చెల్లెలి మొగుణ్ణయ్యాను బావా!" చిరునవ్వుతో అన్నాడు విజయభాస్కర్.

"షటప్! యెవర్రా నీకు బావ?"

"భార్య సోదరుడు బావ గాక మరేమౌతాడ్రా ఫూల్"

"ఆఁ!...."

"బావా బామ్మరుదులం. ఈ మాత్రం సరసం వుండాల్సిందేలే...." అదే చిరునవ్వుతో అన్నాడు విజయ భాస్కర్.

భాస్కర్ పెదవులపై చిరునవ్వు చెరక్కపోవటంతో మరింతగా రెచ్చిపోయాడు మధుమూర్తి. అతనిలో ఆవేశం, క్రోధం వరదలై పారింది. గబగబ ఫోనువద్దకు నడిచాడు.

"ఫోన్ చేస్తావా! చెయ్ చెయ్....పోలీసులొస్తారు. నన్ను, నీ చెల్లెల్ని ముందుగా స్టేషన్ కి లాక్కెడతారు. పరువు నష్టం బావా వెయ్యాలనుకుంటున్న నీ పరువు నీ వల్లనే సగం పోతుంది.

"ఆ తర్వాత పోలీసులు కోర్టుకి తీసుకువెడతారు. మమ్మల్ని ముద్దాయిలుగా, నిన్ను ఫిర్యాదిగా దాఖలు చేస్తారు. నీ చెల్లెలు మైనారిటీ సంవత్సరం క్రితమే దాటి పోయిందని, ఆమె ఇష్టంవచ్చిన వ్యక్తిని ఆమె పెళ్ళాతే హక్కు ఆమెకున్నదని జడ్జిమెంటిస్తారు. అప్పుడు మేమిద్ద

రము మీ ఇంట్లోకి, నీ మిగిలిన సగం పరువూ యెంచక్కా బజార్లోకి...."

నిరాశగా, విసురుగా తిరిగి రిసీవరు రెస్టుపై పడేశాడు మధుమూర్తి.

"....పద ప్రతిమా! మనకిక్కడ స్థానంలేదని తెలిసిపోయింది. చెబితే విన్నావు కాదు" ఆమె భుజంపై చెయ్యివేసి నడిపించబోయాడు భాస్కర్ వెనక్కి.

"ఆగు...." తిరిగి అన్నాడు మధుమూర్తి. ఆ కంఠస్వరంలో మునుపటి క్రోధం, గంభీరత లేవు. నెమ్మదిగా ప్రతిమవద్దకు వచ్చాడు. ఆమె తలపై చెయ్యివేసాడు.

"ఎంతపని చేసావమ్మా! నీ అన్నయ్యనంటూ నేనొకణ్ని వున్నానని మర్చిపోయావా? ఇన్నాళ్ళు పెంచి పెద్దచేసి చదివించిన నీ అన్నయ్య నీ పెళ్ళప్పుడు నీకు గుర్రాలేదా అమ్మా!"

"నా అన్నయ్య నా హృదయంలో వున్నాడన్నయ్యా! యెప్పటికీ వుంటాడు. కాని నాలోని అన్నయ్య డబ్బు మనిషి కాడు. వాడిలో స్వార్థంలేదు. ధనగర్వం లేదు. మరేమున్నాయో తెల్సా? ఇద్దరు ప్రేమికుల్ని భగ్నప్రేమికులుగా చెయ్యకూడదనే తత్వం. చెల్లెలి జీవితం బాగుపడాలనే ఆరాటం! అందుకే ఆ అన్నయ్య ఆశీస్సులు తీసుకున్నాను...."

"........."

"వెళ్లొస్తా నన్నయ్యా!"

దిగ్గున తలెత్తాడు మధుమూర్తి. "యెక్కడికమ్మా?"

"అత్తవారింటికి?"

"ఏదమ్మా నీ కత్తవారిల్లు?"

"ఏదేమిటి? వారే ఇంట్లోవుంటే అదే నా కత్తవారి

ఇల్లు. వారు అడవిలోవుంటే అడవే నా కత్తవారిల్లు."

"అవునమ్మా! అదే నీ అత్తవారిల్లు. నువ్వు వెళ్ళగలవు. నీ అన్నయ్యని వదలి అడవికేనా వెళ్ళగలవు. కాని.... నిన్ను వదిలి నేనుండలేనమ్మా!

"నాన్న పోయాడు. అమ్మ పోయింది. మిగిలింది నువ్వు. నువ్వూ బ్రతికుండే మూరమాతా నంటున్నావు. ఇక నే నెవరికోసం బ్రతకాలమ్మా?"

"ఆస్తి కోసం...." చటుక్కున అన్నాడు విజయ భాస్కర్.

అతనికేసి కోపంగా చూసాడు మధుమూర్తి.

"వారినెందు కన్నయ్యా అంత గుర్రుగా చూస్తావ్? ఎవరికోసం బ్రతకాలమ్మా అంటూ నా పట్ల నీకుగల ప్రేమను వ్యక్తం చేసుకుంటున్నావు. నాపై అంత ప్రేమ గలవాడివి వారితో నా పెళ్లికి యెందుకంగీకరించలేదు? ఒప్పుకొనివుంటే నిన్ను కాదని రిజిస్ట్రారాఫీసులో నా పెళ్ళి జరిగేదా? అప్పుడు నీ కళ్ళకి నన్ను చూడకుండా అడ్డు పడినవి ఈ ఆస్తి, ఐశ్వర్యం, అంతస్తు కదూ?"

"ఏది యేమైనా నేనుమాత్రం నిన్నువదలి వుండలే నమ్మా! మీ 'అయనో' చెప్పి యిద్దరూ ఇక్కడే వుండేలా ఒప్పించు...." అయనో అన్న పదం నొక్కి పలుకుతూ అన్నాడు మధుమూర్తి.

"ఓహోయ్! నే నిక్కడే వున్నానోయ్! చెల్లెలితో రికమెండు చేయిస్తున్నావా?" అన్నాడు గట్టిగా భాస్కర్.

"ఓహో! తమరిక్కడే వున్నారుకదూ! మర్చిపోయాను. మరి విన్నారుగా నా కోరిక! దాని పెళ్లి కళ్ళారాచూడ లేకపోయాను. కనీసం దాన్నైనా కళ్ళారా చూసుకునే

భాగ్యం కల్గించు నాయనా!" తనలోని అక్కసునంతా ఆ మాటల్లో చూపెట్టాడు మధుమూర్తి.

"ఈ ఇంటికి అల్లుణ్నాయి గంటకూడా కాలేదు. పావు గంటనుంచీ గుమ్మంవద్ద నిలబెట్టే మాట్లాడుతున్నావు. లోనికి రమ్మనటంమాట అటుంచి మర్చిపోయానంటున్నావా? ఇంటల్లుణ్నయ్యాక ఇలావుంది మర్యాద. ఇహ ఇల్లరికపుటల్లుణ్నయితే యెలావుంటుందో!"

"మర్యాదలకి లోటుండదులే...." మరింత అక్కసుగా అన్నాడు మధుమూర్తి.

"అలా అయితే ఇంకేం....ఇల్లరికపుటల్లుడుగా వుండటానికి నాకేం అభ్యంతరంలేదు...." అన్నాడు విజయభాస్కర్. అతనికావలసిందికూడా అదే మరి.

# 5

గుండెల్లో నిప్పుకణాలు పోరనంతగా ఫీలవుతున్నాడు మధుమూర్తి.

భాస్కర్ ఆ యింటికి అల్లుడుగా రావటాన్ని భరించలేక పోతోన్నాడతను. కాలుగాలిన పిల్లిలా కాసేపు, నిప్పుతొక్కిన కోతిలా కాసేపు—తన గదిలో తిరుగుతోన్నాడు. చిందులు తొక్కుతోన్నాడు.

'ఏం చెయ్యాలి?....యెలా పగ తీర్చుకోవాలి?' అదే అతని ఆలోచన.

భాస్కర్ తన ఇంట్లో కాపురం పెట్టి అప్పుడే నెల అయింది. ఈ నెలరోజులూ తన శత్రువు తనకళ్లెదుట తిరుగుతోన్నా యేమీ చేయగాని వాడయ్యాడు తను....

తన చేతిక్రింద నలుగురు గూండాలున్నారు. తను కనుసైగ చేస్తే చాలు. భాస్కర్ యెముకల్ని నలుగుపిండి

క్రింద మార్చేస్తారు.

కాని అందువల్ల తను సంతోషపడినా తర్వాత బాధ పడాల్సి వస్తుంది. తన చెల్లెలి కన్నీరు చూడలేదు తను. ఐతే ఏం చెయ్యాలి? తనని చూసినప్పుడల్లా హేళనగా మాట్లాడుతూ ప్రతిమాటలోనూ వ్యంగ్యాన్ని వ్యక్తం చేస్తూ కవ్విస్తోన్న భాస్కర్ని చూస్తూ వూరుకోవల్సిందేనా? అవన్నీ సహించాల్సిందేనా?

ఆలోచిస్తోన్న మధుమూర్తి నౌకరు ఓ పొడుగాటి కవరు తేవటంతో వాస్తవంలోకొచ్చి పడ్డాడు.

కవరు తన పేరిట పోస్టులోవచ్చింది. చించి లోపలి కాగితాన్ని మడతలు విప్పాడు.

“డియర్ మధుమూర్తీ!

నేనెవరో నీకు తెలీదు. కాని నాకుమాత్రం నువ్వే కాదు, నీ కుటుంబ చరిత్ర పూర్తిగా తెల్సు. అదంతా చనిపోయేప్పుడు మీనాన్న నీతో చెప్పేవుంటాడు. ఆ వివరాలన్నీ గుర్తుచేసే వ్యవధి నాకులేదు.

వూరికి పదిమైళ్ళ దూరంలోవున్న పాడుబడ్డ గుడిదగ్గరికి లక్షరూపాయల రొక్కంతో ఒంటరిగావస్తే ప్రస్తుతానికవన్నీ మర్చిపోతాను. లేకపోతే నీ చెల్లెలు, కొత్తబావ మరిది మాయమైపోతారు. రేపురాత్రి సరిగ్గా పదకొండుకి అక్కడికొస్తావ్ కదూ!

—అనామకుడు.”

ఒక్కసారి ఝల్లుమంది మధుమూర్తి గుండె.

ఎవరీ అనామకుడు? తన తండ్రి తనకి తెలియని విషయాలు చివరిదసలో చెప్పినట్టు వీడికెలా తెల్సు? ఇన్నేళ్ళ తర్వాత యెక్కడ్నుంచి పుట్టుకొచ్చాడు వీడు? ఇలా వీడికి యెన్ని లక్షలివ్వాలి? ఏమీ ఇవ్వకుండా వీడినోరు

యెలా మూయించాలి?

....ఏదో నిశ్చయంతో గదిబయటికొచ్చాడు మధుమూర్తి. అప్పుడే భాస్కర్ విసవిసా బయటి కెళ్ళడం చూసాడు. అతని ధ్యాస తాత్కాలికంగా చెల్లెలి పైకి మళ్ళింది. ఒక్కసారి మేడకేసిచూసి మెట్లవేపు నడిచేడు.

# 6

"నాకు చాల అశాంతిగావుంది. ఒక్కతే చెల్లెలు. దానికీ ఈమధ్యే పెళ్ళయింది. నా బావమరిదంటే నాకు సరిపోదు. అలాగని చెల్లెల్ని చూడకుండా వుండలేను. వాణ్ని అల్లుడుగా అనుక్షణం జూస్తూ వుండలేను. మానసిక విశ్రాంతే కరువైంది జలంధర్ గారూ!"

"దానికి నేనేం చెయ్యగలను? ఇది మీ కుటుంబ సమస్య. దీన్ని మీరే జాగ్రత్తగా పరిష్కరించుకోవాలి. మాబోటి వాళ్ళకి చెప్పటం మీ పరువుని మీరే...."

"అది కాదు...."

"ఏదికాదు? అలాటప్పుడు ఆ పెళ్ళి యెందుకు చేసేరు? ఇష్టం లేకపోతే పెళ్ళయిందే అనుకోండి .... ఎంతోకొంత అమ్మాయి పేరట వ్రాసిస్తే వాళ్ళమానాన వాళ్ళు బ్రతుకుతారు కదా?"

బాధగా నుదురు కొట్టుకున్నాడు మధుమూర్తి. "అంతా నాకు తెలీకుండా జరిగిపోయింది జలంధర్ జీ! ప్రతిమ మేజరైంది.... నాకు తెలీకుండా వాణ్ని....ఆ అనామకుణ్ని రిజిస్టర్ మేరేజ్ చేసేసుకొంది...." అని వులిక్కిపడ్డాడు మధుమూర్తి.

'అనామకుడు....! కొంపదీసి ఆ పేరుతో తనకి ఉత్తరం రాసినవాడు....భాస్కర్ కాదుగదా....!'

"మీ రేదో ఆలోచిస్తోన్నట్టున్నారు...." అతనికేసి సూటిగా చూస్తూ అన్నాడు జలంధర్.

"అబ్బే యేంలేదు. వాళ్లని బయటికిపంపితే నా చెల్లెలిని చూడకుండా నేనుండలేను. ఎన్నాళ్లని పెళ్లికాని చెల్లెని ఇంట్లో పెట్టుకోగలరని అడుగుతారేమో! నా వుద్దేశ్యం దానికి తగిన వరుణ్ని చూసి వివాహంచేసి ఇద్దర్నీ నావద్దే వుంచుకోవాలనుకున్నాను...."

"ఇల్లరికం వుండటానికి మీరు మెచ్చిన వరుడు సిద్ధమవద్దూ?"

"అలా అంగీకరించే వాణ్ణే యెన్నిక చెయ్యాలనుకున్నాను. అంతలోనే ఇలా జరిగిపోయింది. దాన్నిచూసుకుంటూ వుండాలన్న కోరిక తీరిందికానీ, దాని మొగుణ్ణే బామ్మర్దిగా అంగీకరించలేక పోతున్నాను."

"ఇంతకీ మీ విషయంలో నేనెలాంటి సహాయం చేయాలో చెప్పండి...."

"అసలే మనశ్శాంతి కరువై నే నేడుస్తోంటే మరింత అశాంతిని జోడిస్తూ యెవడో వుత్తరం రాసేడుచూడండి" వుత్తరంతీసి బల్లపై పెట్టాడు మధుమూర్తి.

చదివాడు జలంధర్. ప్రశ్నార్థంగా మధుమూర్తివేపు జూసాడు.

"లక్షలూపాయలంటే మాటలా? ఇలా వీడికి యెన్ని లకారాలు సమర్పించాలి...."

"అసలెందుకివ్వాలి?" యెదురు ప్రశ్న వేసాడు జలంధర్.

"..........."

"చూడండి మధుమూర్తిగారూ! మీ కుటుంబ సమస్యని గురించి నాతో మాట్లాడటానికి మీరే వచ్చారు.

అంటే నా సాయంతో అవసరం వచ్చిందన్న మాట. అలాంటప్పుడు కథ సొంతం చెప్పండే నేను మీ కెట్టి పరిస్థితిలోనూ యిలాంటి హెల్పు చెయ్యలేనని చెప్పటానికి విచారిస్తోన్నాను...." కాస్త చిరాగ్గా అన్నాడు జలంధర్.

"మీరు నన్నే అనుమానిస్తోన్నారు" మరింత బాధగా అన్నాడు మధుమూర్తి.

"మరి లేకపోతే యేమిటి? మీలో యే బలహీనతా లేనిదే ఏ అనామకుడూ లక్షరూపాయలు తెమ్మనికోరడు. మీరూ యే బలహీనతకీ లొంగందే లక్షరూపాయలెలా ఇవ్వాలాని ఆలోచించరు."

"నేనలా ఆలోచించటం లేదు."

"మరి ఇక్కడికెందుకొచ్చారు? ఆ అనామకుడెవరో తెల్సుకొని తెలియజెయ్యాలనా?"

అవుననలేకపోయాడు మధుమూర్తి. జలంధర్ తనూహించిన దానికంటే రెండాకులెక్కువే చదివాడని గ్రహించాడు. ఏదో ఓటి అపాయంలేని ఉపాయం ఆలోచించి తను బయటపడకుండా జాగ్రత్తపడా లనుకున్నాడు.

"మా నాన్నగారు చనిపోతూ తన ఆస్తి వివరాలు నాకు విశదీకరించారు. నాకు తెల్సిందానికంటే యెక్కువే వుందని తేలింది. ఆ విషయం ఈ అనామకుడికి తెలిసి నన్ను యిలా బ్లాక్ మెయిల్ చేస్తోన్నాడా?"

"మీ నాన్నగారు మీతో ఆస్తి వివరాలు చెప్పినపుడు ఇంకా అక్కడ యెవరున్నారు?"

"లాయరుతప్ప మరెవరూ లేరు."

"లాయరుగారికి యెంతమంది సంతానం?"

"ఒకే కొడుకు."

"ఇప్పుడున్నాడా?"

"ఆఁ...."

"అతనిపై మీ కనుమానం వుందా?"

"లేదు. అతను ఫారన్‌లో చదువుతోన్నాడు."

"ఎవరూ లేకపోతే మరి ఆ వివరాలన్నీ తెలుసుకొని యెవరు బెదిరిస్తారు?....ఇంకో విషయం....మధుమూర్తి గారూ! మరోలా అనుకోకండి: మీ ఆస్తి మీ తండ్రి స్వార్జితమేనా?"

"....అవును."

"మీరీ విషయంలో నిజమే చెబుతోన్నా రనుకో వచ్చా?"

"ఏం? అలా అడిగారు?"

"మీ తండ్రిగారు ఈ ఆస్తిని అన్యాయంగా, అక్రమంగా సంపాదించివుంటే ఇలాంటి ఉత్తరాలు రావటాని కవకాశాలెక్కువ...."

"అలాంటివేమీ నాతో చెప్పలేదు మా నాన్నగారు. అయినా ఇంతకాలం తర్వాతనా?"

"ఎంత కాలమైంది మీ నాన్నగారు చనిపోయి?"

"అయిదు సంవత్సరాలు...."

"అయిదేండ్లు ఓపికపట్టి ఆ తర్వాత విజృంభించటాని క్కూడ అవకాశాలెక్కువ."

"ఇప్పుడు నే నేం చెయ్యాలి?"

"ఏం చెయ్యదలుచుకున్నారు?"

"తోచటంలేదు."

"ఇంటికెళ్ళి హాయిగా వుండండి?"

"ఎలా?"

"అదికూడ చెప్పాలా?"

"అదికాదు డిటెక్టివ్‌గారూ! వాడన్నంత పనీ చేస్తే....?"

"అయితే లక్షరూపాయలూ యిచ్చెయ్యండి...."

"ఆ అనామకుడెవరో పట్టుకోండి. మీరు కోరిన ఫీజు యిస్తాను...."

"వాడు దొరకడు.?

"జోస్యం చెబుతున్నారా?"

"లేదు."

"చిలిపిప్రశ్నలతో కొంటె జవాబులతో చంపకండి. కర్తవ్యం ఏమిటో చెప్పండి." నీరసంగా అన్నాడు మధుమూర్తి.

"మీతో సరదాగా మాట్లాడుతూ కథని పెంచటం నా అభిమతంకాదు. మీ ముఖ కవళికల్నిబట్టి మీరు నా వద్ద ఏదేనా దాచారేమో తెల్సుకో యత్నిస్తోన్నాను.... ఆల్‌రైట్! ఓ పని చెయ్యండి. మీరు డబ్బు తీసుకొని ఎక్కడికీ వెళ్ళకండి. ఆ అనామకుడు మళ్ళీ ఫోన్ చేస్తే అతని వివరాలు తెలుసుకో యత్నించండి....ఆఁ....గడువు దాటింతర్వాత కొన్నాళ్ళు మీ చెల్లెల్నీ బామ్మర్దినీ జాగ్రత్తగా కనిపెట్టి వుండండి."

"అంతేకాని ఆ అనామకుణ్ని పట్టుకోమంటారు. ప్రస్తుతం ఏదేనా మరో అర్జంటు కేసుందా?"

"ఆ అనామకుడికి అనుచరులెందరో. ఇప్పుడు మనం వాణ్ని పట్టుకుంటే యింకో అనామకుడు పుడతాడు. వివరాలు కనుక్కుంటే ఒక్క క్లూ అయినా దొరక్కపోదు...."

మధుమూర్తి ముఖంలో సంతృప్తి చోటుచేసుంది.

"మీరు చెప్పినట్టే చేస్తాను, సెలవు. అవసరమైతే మళ్ళీ వస్తాను లేదా ఫోన్ చేస్తాను" అంటుండగా నమస్కరించి వెళ్ళిపోయాడు మధుమూర్తి.

# 7

"ఎక్కడ నా చెల్లెలు?" పిస్తోలు భాస్కర్ గుండెల కేసి గురిపెట్టాడు మధుమూర్తి.

విస్తుపోయాడు భాస్కర్. "ఏమిటి నువ్వంటున్నది?"

"నన్నెన్ని మాటలన్నా సహించాను. నిన్ను యమసదనానికి పంపటానికి నేనాట్టే శ్రమపడాల్సిన అవసరం లేదని తెల్సినా నా చెల్లెలి ముఖం కళావిహీనమవుతుందని భరించి నోరు మూసుకొని పడున్నాను. ఈ నాడు.... ఈ నాడు నా చెల్లెలే నాకు దూరమైనదని తెలిసిం తర్వాత నువ్వు కాదుగదా! ఆ బ్రహ్మదేవుడెదురైనా వదిలిపెట్టను: మర్యాదగా నా చెల్లెల్నేం చేసావో చెబుతావా లేక, స్వర్గంలోవున్న మీ మామగార్ని పలకరించడానికి వెడతావా?"

"నీకేదో పైత్యం ప్రకోపించినట్టుంది. విషయం అర్థమయ్యేలా చెప్పు...." విసురుగా అన్నాడు భాస్కర్.

"సాయంత్రం ప్రతిమ షాపింగుకి నీతో కలిసి రాలేదూ?"

"వచ్చింది."

"అక్కణ్ణుంచి మీరిద్దరూ సిన్మాకి పోవాలనుకో లేదూ!"

"మొత్తానికి చెల్లెలన్పించుకుంది. మొగుడూ పెళ్ళాలు సినిమా ప్రోగ్రామ్ వేసుకున్న విషయం కూడ చెప్పాలా?"

"నీలాంటి మొగుణ్ని చేసుకున్నాక చెప్పకపోతే

ఎలా?....నువ్వేదో చేస్తావనే అనుమానంతో థియేటర్ కి ఫోన్ చేసి కనుక్కున్నాను. నీతో ప్రతిమ రాలేదని మేనేజర్ చెప్పాడు.... చెప్పు. దార్లో దాన్నేం చేసావ్?"

"చంపేస్తానని భయపడ్డావా?"

"నీలాంటి కిరాతకుడు అంతకు తెగించడానిక్కూడ వెనుకాడడు...."

"పరశురామయ్యకి అల్లుణ్నికదా!....మరచాను. నీకు బ్రదరిన్ లానికూడ....! ఇప్పుడు నేనే అడుగుతున్నాను. జవాబు చెప్పు. నా భార్యనేం చేశావ్?"

"ప్లేటు మారుస్తున్నావా?"

"లేదు, మారిన ప్లేటును సరిచేస్తున్నాను...."

"సరిగా ఏడువ్...."

"ఎవరేడుస్తారో కాసేపట్లో తెలుస్తుంది. షాపింగ్ లో కొన్న వస్తువులు హోటల్ నటరాజ్ లోవున్న నీకిచ్చి ఇంటికి తీసుకుపొమ్మని చెప్పివస్తానని వెళ్ళింది. నేను థియేటర్ వద్దకి వెళ్ళాను. ఇంతవరకూ చూశాను. రాలేదు. నా మీద పగ ఇలా తీర్చుకుంటావనే అనుమానంతో నే వచ్చాను. నేర్పుగా నా పైకి తిప్పావన్నమాట!"

"హోటల్ నటరాజ్ లో నేను పావుగంటసేపు వున్నాను. అక్కడికెవ్వరూ రాలేదు."

"నమ్మేంత మూర్ఖుణ్నిగాను...."

"అబద్ధం చెప్పేంత పిరికివాణ్నికాను. నటరాజ్ కి రింగ్ చెయ్...."

"నటరాజ్ ఓనర్లు నీ మాటకెదురు చెప్పలేని వెధవలని తెలీని అమాయకుణ్ని గాను...."

"గతజల సేతుబంధనం ప్రస్తుతం అనవసరం. భాస్కర్ నా సర్వస్వం నీకు సమర్పిస్తాను. నా చెల్లెలెక్కడుందో

చెప్పు...."

"నువ్వు సమర్పించేదేమిటి? అది మొదట్నుండీ నాదే! ఫోను మోగుతోంటే అలా మొద్దులా నిల్చున్నావేం? ముందు దానికి జవాబు చెప్పి ఆ తర్వాత ప్రతిమ నేంచేశావో చెప్పు...."

ఉలిక్కిపడి మ్రోగుతున్న ఫోనువేపు అడుగులేశాడు మధుమూర్తి. అతని ముఖంలో క్షణక్షణానికీ రంగులు మారాయి, అవతలివ్యక్తి మాటలు విన్నంతసేపూ....

"ఏమిటలా పెట్టావ్ ముఖం....పాత చెప్పులా?"

"అనామకుడు....అనామకుడు...."

"వాడెవడు?"

"ప్రతిమ నెత్తుకుపోయాడు."

"వాట్?...."

"అనామకుడు నువ్వే ననుకున్నా నింతవరకూ...."

"ఏమిటా వాగుడు మాటకీ మాటకీ సంబంధం లేకుండా. అనామకుడేమిటి? ప్రతిమ నెత్తుకుపోవడమేమిటి? నేనే నని నువ్వనుమానించడమేమిటి?" ఆశ్చర్యంగా అన్నాడు భాస్కర్.

"నాలుగు రోజుల క్రితం అనామకుడనే పేరుతో వుత్తరం వచ్చింది. లక్షరూపాయలివ్వకపోతే మిమ్మల్నిద్దరినీ యెత్తుకుపోతానని వ్రాసాడు. నాపై కసితీర్చుకోటం కోసం నువ్వే రాసుంటావని ఉపేక్షించి నా అనుమానం డిటెక్టివ్ జలంధర్ వద్దకి పరుగుతీయించింది. పైకమిస్తే బ్లాక్ మెయిలింగ్ అలవాటు చేసినట్టవుతుందని, అనామకుణ్ని అలక్ష్యం చెయ్యమని జలంధర్ చెప్పాడు."

"ఇంతే చాలని సుప్సార కే వున్నావ్. ప్రతిమ జలంధర్ కి చుట్టమా పక్కమా? క్లయింటని ఈ కేసు చేపట్టినా

నీనుండి ఫీజు వసూలు చెయ్యడానికి తిరిగే సమయంలో మూడు కేసులైనా పరిశోధించ వచ్చని వాళ్ళకనుమానం వచ్చుంటుంది. సువ్వోట్టి పిసినిగొట్టువని ఆయన కూడా తెల్సిపోయిందన్నమాట...."

"మిమ్మల్నిద్దర్నీ జాగ్రత్తగా కనిపెట్టుకొని వుండమనీ ఏదేనా జరిగితే తనకి కబురు చెయ్యమనీ చెప్పాడు."

"ఇంతకీ ఆ అనామకుడు ఇప్పుడేమన్నాడు?"

"అన్నమాట ప్రకారం నేను లక్ష ఇవ్వలేదని, మూడు రోజులు వరసగా ఎదురుచూశానని.... చెల్లెలికన్నా ఎక్కువనుకున్న లక్షరూపాయల్ని నువ్వే వుంచుకొని లక్షణంగా వుండమనీ...."

"ప్రతిమ నేం చేసాడో చెప్పు" విసురుగా ఆత్రంగా అన్నాడు భాస్కర్.

"ఎత్తుకుపోయాడు. ఈ రాత్రి రెండులక్షలివ్వాలిట"

"ఎక్కడ?"

"ఇక్కడికి పదిమైళ్ళ దూరంలోవున్న పాడుబడ్డ గుడి దగ్గర."

"పైకం ఇస్తే....?"

"లక్షణంగా ప్రతిమని అప్పగిస్తానన్నాడు. లేకపోతే."

"లేకపోతే....?"

"ప్రతిమ శవాన్ని పార్సిల్ చేస్తానన్నాడు."

"మరేమనుకుంటున్నావ్?"

"భాస్కర్....నాలో కఠినత్వం వుండొచ్చు. ధన కాంక్ష వుండొచ్చు. కాని డబ్బుకోసం చెల్లెల్ని మృత్యు ముఖంలోకి పంపేంత నీచుణ్ని కాను...." రుద్ధ కంఠంతో అన్నాడు మధుమూర్తి.

"మరి రెండులక్షలు సర్దుకో."

"నేనక్కడికి వెడతాను. నువ్వు జలంధర్‌ని తీసుకొని అక్కడికి వచ్చేసేయ్...." ఆత్రంగా ఐరన్ సేఫ్ వున్న గదికేసి నడిచాడు మధుమూర్తి.

# 8

"నీలాంటి మూర్ఖులు అతితెలివి నుపయోగించి నాలాటి వాళ్ళకి లాభం చేకూరుస్తారు" నవ్వుతూ అన్నాడతను.

"సూటుకేసు తెచ్చాను" క్లుప్తంగా అన్నాడు మధుమూర్తి.

"అందులో డబ్బుందా?"

"మా ప్రతిమ యెక్కడ?"

"సూట్ కేసులో రెండులక్షలూ భద్రంగావుంటే నీ చెల్లెలూ భద్రంగా వుంటుంది."

"అయితే ఇదుగో డబ్బు. నా ప్రతిముని అప్పగించి, ఈ డబ్బుతీసుకో."

"బ్లాక్ మెయిలర్నయినా నీలా, మీ నాన్నలా గుండెలుతీసిన బంటునుమాత్రం కానులే" వ్యంగ్యంగా అన్నాడతను.

"నువ్వెవరు?" చెప్పడని తెలిసినా అడిగాడు మధుమూర్తి.

"కనపట్టంలా! ముసుగు మనిషిని."

"అది తెలుసు. నా వివరాలు నీకెలా తెలిశాయాని."

"నీ చరిత్రంతా తెల్సు నాకు."

"అందుకే యెవర్నువ్వు అనడుగుతోన్నాను."

"అది నువ్వు తెల్సుకోవాల్సిన అవసరంలేదు."

"ఇప్పుడు నిన్ను పోలీసులకి పట్టిస్తే నీకు దిక్కెవరు?"

"నీ చెల్లెలు."

"వాట్?"

"పోలీసుల్ని చూసిన మరుక్షణం ప్రతిమ ప్రాణవాయువులు అనంత వాయువుల్లో కల్సిపోతాయి."

తను వేసిన ప్రశ్నకు తన్ను తనే నిందించుకున్నాడు మధుమూర్తి. లేకపోతే ప్రతిమ తన అధీనంకాక ముందే అలాంటి ప్రశ్నలు వెయ్యటం అవివేకం కదూ?

"ప్రతిమని చూడాలి. పద...."

ఆ వాతావరణం చూడటానికే అసహ్యంగావుంది. చెత్త, చెదారం, బూజుపట్టిన గోడలు, శూన్యప్రదేశాన్ని అక్కడక్కడా ఆక్రమించుకొనివున్న సాలెగూళ్ళు. పై కప్పుకి వ్రేలాడుతోన్న గబ్బిలాలు-చీకటి-దుర్గంధం!

ఆ చీకట్లో చిన్నలాంతరు వెలుగుతోంది. ప్రతిమ రెండు చేతులూ ఓ స్థంభానికి కట్టివెయ్యబడి వున్నాయి వెనక్కి విరచబడి.

ఆ దృశ్యాన్ని చూడలేకపోయాడు మధుమూర్తి.

"ఎవరుతీసిన గోతిలో వాళ్ళే పడతారని, యెవరు చేసిన పాపం వాళ్ళనే కట్టికుడుపుతుందని పెద్దలనేవారు. నాన్న చేసిన పాపాలకి నేను శిక్ష అనుభవిస్తున్నాను. ఆడపిల్లననికూడా తలవకుండా ఈ కిరాతకుడు నన్ను.... నన్ను...." ఏడుస్తోంది ప్రతిమ ఆగకుండా.

"నిన్ను....? ఏం చేశాడమ్మా?" ఆత్రంగా, భయంగా అడిగాడు మధుమూర్తి.

"బంధించాడు."

తేలిగ్గా నిట్టూర్చాడు మధుమూర్తి. తనింకా ఏం జరిగిందో ననుకున్నాడు. అంతవరకూ నయమే!

అయినా బ్లాక్ మెయిల్ చేసేవాడు డబ్బుకక్కుర్తి

పడతాడు గానీ ఆడదాని శీలాన్ని కోరడు. ఇప్పుడు వీణ్ని యెలాగోలా బోల్తా కొట్టించాలి. భాస్కర్, జలంధర్ని పిల్చుకొచ్చే వరకూ మాటల్లోదింపాలి.

"ఏమిటాలోచిస్తోన్నావ్?" అన్నాడు ముసుగుమనిషి. "డబ్బు పోతేపోయింది-చెల్లెల్ని రక్షించుకుందామనా—లేక అమ్మో, బోడి చెల్లెలుకోసం రెండు లక్షలు వదులుకోవడమే అనా?"

"....అన్నయ్యా! నిజంగా నువ్వు అలానే ఆలోచిస్తోన్నావా?" వెక్కిళ్ళమధ్య అంది ప్రతిమ.

"లేదమ్మా! నీ కంటే ఏదీ ఎక్కువకాదు నాకు. నాన్న చేసిన పాపానికి....అని ఏదో అన్నావ్, నాన్నేం పాపం చేశాడమ్మా."

"ఏమో నాకేం తెల్సు? ఈ ముసుగు మనిషికి నాన్న వల్ల ఏదో జరగరానిది జరిగిందిట. అతనిలా కావటానికి కారణం నాన్నేనట. ఇంకా ఎంతమంది బలయ్యారో అంటోన్నాడు."

"దానికీ నిన్ను బంధించటానికి....?"

"సంబంధం నాన్న మరణించడమే. ఆయన లేడని ఆ కక్షనిలా...." ప్రతిమ కళ్ళలోంచి నీళ్ళు బుగ్గలమీదుగా జారాయి.

"ఏం చేశాడు మా నాన్న నీకు....?" ముసుగుమనిషి వేపుకి తిరిగాడు.

"ఇంకా ఏం చెయ్యాలి? మీ నాన్న ఫ్యాక్టరీలో మా నాన్న మేనేజర్గా వుండేవాడట. ఆ ఫ్యాక్టరీ మీ నాన్నది కాకముందు అంటే మీ మామయ్య శేషగిరిరావు దానికి స్వంతదారుగా వున్నప్పుడు ఆ ఫ్యాక్టరీ తన పేర వ్రాయించుకునే ప్రయత్నంలో మా నాన్న

సాయం కోరాడు.

"నీతికి నిజాయితికి ప్రతిరూపమైన మా నాన్న దానికి అంగీకరించలేదు. ఓ రోజు మీ నాన్న మా నాన్నని త్రాగించి కొన్ని కాయితాలపై సంతకాలు చేయించాడు. ఆ కాగితాలు యజమానికి తెలీకుండా ఫ్యాక్టరీలో తయారయ్యే సరకుని దొంగతనంగా విక్రయించడానికి సంబంధించిన ఒప్పందాలు!!!

"తెలివొచ్చాక మా నాన్న వాటిని చూసి అదిరిపోయాడు. ఆ తర్వాత మీ నాన్న బలవంతం పై అవినీతికి లొంగిపోయాడు. స్వార్థంతో కాదు. భయంతో!

"ఆ తర్వాత మా నాన్న సాయంతో మీ నాన్న ఫ్యాక్టరీ డబ్బు యెంతో వెనకేశాడు. ఎంతో మంది వుద్యోగుల్ని తన వేపుకి తిప్పుకున్నాడు. ఓ రోజు అసలు యజమానిని తెలివిగా చంపించి, ఆ తర్వాత ఆయన భార్యనీ మట్టుబెట్టాడు.

"మా నాన్న చేసిన సహాయానికి ప్రతిఫలంగా చిప్ప చేతికిచ్చాడు. అయ్ మీన్ దొంగతనం నేరం మోపి వెళ్ళగొట్టాడు.

"ఆ తర్వాత ఆయనపై హత్యాప్రయత్నాలు జరిగాయి. అది గ్రహించిన మా నాన్న ఫ్యామిలీతో సహా యీ వూర్నుండి మకాం మార్చేశాడు. ఆఖరుక్షణాల్లో నాకీ విషయాలు చెప్పి కక్ష తీర్చుకోమని ఆదేశించాడు. మరిగే రక్తంతో వచ్చానీ వూరు.

"మీ నాన్న చచ్చాడని తెల్సింది. నా కసి తీరలేదు. ఆ కక్షేదో నీపై తీర్చుకోవాలనిపించింది. అందుకు సాధనం ప్రతిమ! అందుకే ఆమెనెన్నుకున్నాను.

"....మీ నాన్నవల్ల మోసపోయిన వివరాలు మా

నాన్న నాతో చెప్పినట్టే, ఎవర్నెవర్నెలా మోసం చేసిందీ చచ్చేముందు మీ నాన్న నీతో చెప్పివుంటాడు. చెప్పు .... శేషగిరిరావుగారికి ఫ్యాక్టరీ వున్నసంగతి అబద్ధమా!? ఆయనవద్ద మా నాన్న పావనరావుగారు మేనేజర్‌గా వుండటం అబద్ధమా!? ఆయన్ని మోసం చెయ్యటం అబద్ధమా!? శేషగిరిరావుగార్ని, దుర్గమ్మగార్ని మీ నాన్న హత్యచెయ్యటం అబద్ధమా? చెప్పు. నిజం చెప్పకపోతే రివాల్వరే జవాబు చెబుతుంది."

జేబులోంచి రివాల్వర్ తీసి ప్రతిమ కణతపై ఆనించాడు ముసుగుమనిషి.

అసలే బొంగురుగొంతు. ఆపైన చేతిలో రివాల్వరు. పైగా ప్రతిమని ఏ క్షణంలోనైనా చంపటానికి సిద్ధంగా వుంది. పైపెచ్చు కంఠస్వరంలోని కఠినత్వాన్నిబట్టి ముసుగు మనిషి అన్నంతపనీ చేసేలావున్నాడు.

నిజం చెప్పడం వుత్తమం. జలంధర్ వచ్చేలోగా వీడికా డబ్బు యిచ్చి, ప్రతిమని విడిపించడం మంచిది.. కనీసం పరువైనా దక్కుతుంది....

"నిజమే. మా నాన్న చెప్పిన మాటలు నీ మాటలతో సరిపోయాయి. కావాలంటే యింకో లక్ష ఎక్కువిస్తాను. నా చెల్లెల్ని వదిలిపెట్టు...." దీనంగా అన్నాడు మధుమూర్తి.

"చచ్చినా నీ చెల్లెల్నొదిలిపెట్టను. కావాలంటే ఆ డబ్బు నువ్వే వుంచుకో."

"మిస్టర్ ....!" కోపంగా ఏదో అనబోయాడు మధుమూర్తి.

అతనికా అవకాశం యివ్వకుండా ముసుగుమనిషి ముసుగు తొలగించాడు.

"....భా....స్క....ర్...." అస్పష్టంగా గొణిగాడు అప్రతిభుడైన మధుమూర్తి.

"అవును బావా! ఎలావుంది నాటకం??"

"నువ్వు....జలంధర్...."

"నేను జలంధర్‌ని కాను. భాస్కర్‌ని. నీ చెల్లెలి మొగుడ్ని."

మధుమూర్తిని మరింత ఆశ్చర్యపరుస్తూ లాంటిన్ వెలుగు పరిధిలోకి డిటెక్టివ్ జలంధర్ ప్రవేశించాడు.

"అంతేకాదు మిస్టర్ మధుమూర్తీ! యితన్నీకు స్వయానా బావవుతాడు. అయ్ మీన్ మీ మామయ్య శేషగిరిరావు కుమారుడు. ప్రతిమతో కలిసి నాటకం ఆడటంద్వారా నీ కళ్ళు తెరిపించాడు; తనెవరో తెలియ పరచాడు."

"వాట్! ఇదంతా నాటకమా!?" ఆశ్చర్యం పట్టలేక పోయాడు మధుమూర్తి.

"అవునన్నయ్యా!" వుత్తుత్తి ముడిని అవలీలగా విడి పించుకొని నవ్వుతూ బంధనం నుండి బయటపడింది ప్రతిమ.

"పెళ్ళికి పూర్వం నా వద్దకొచ్చి బెదిరిస్తూ పరశు రామయ్య కొడుకువన్న విషయం గుర్తు చేసేసరికి నాకు గతం గుర్తుకి వచ్చింది. మామయ్య లేడు గనక నీలో పరి వర్తన కలిగించాలని ఈ పథకం వేశాను.

పెళ్ళికాగానే నేను ఎవరో్న ప్రతిమకి తెలియజేశాను. ఆ తర్వాత డిటెక్టివ్ గార్ని కలిశాను. నా పథకాన్ని ఎలా అమలు చెయ్యాలో చెప్పమని కోరాను. ఆయన చెప్పిన ప్రకారం నేను, నేను చెప్పిన ప్రకారం ప్రతిమ నడుచుకున్నాం.

నేనెవరోన్న నీకు వెంటనే చెప్పేస్తే నువ్వు బుకాయించటానికి ప్రయత్నిస్తావు. వాట్ని బలహీన పరచటానికి నా వద్ద ఆధారాలున్నా నిన్నో ఆట ఆడించాలనిపించింది. ముసుగుమనిషిగా నిన్ను ఫోనులో బెదిరించింది నా కంఠమే! అయితే అది ముందుగా డిటెక్టివ్ జలంధర్ గారి టేప్ రికార్డర్‌లో రికార్డు చెయ్యబడి నీకు వినిపించబడింది.

మీ నాన్న మా అమ్మని కూడ చంపాక దస్తగిరి నన్ను మరోచోటికి తీసికెళ్ళాడు. మా అమ్మ, నాన్న ఫోటోలుగల నా లాకెట్, కుడిపాదాని కెడంవేపునున్న పుట్టుమచ్చ, నేను శేషగిరిరావుగారి కుమారుణ్ణన్న నిజాన్ని నిరూపించే నిదర్శనాలు. చాలా? యింకా కావాలా?"

"మిస్టర్ మధుమూర్తీ! మీ నాన్న అదృష్టమో లేక న్యాయసంరక్షణశాఖల అసమర్థతో తెలీదుగాని ఆయన తను చేసిన అవినీతి పనులకు ఈ లోకంలో శిక్ష అనుభవించకుండానే వెళ్ళిపోయాడు. నువ్వు అయన అడుగుజాడల్లోనే నడిచే ప్రయత్నంలో వున్నావని తెలిసింది. ఆ ప్రయత్నమేదో విరమించుకుంటే నీ పరువు దక్కుతుంది. లేదా శ్రీకృష్ణ జన్మస్థానం దక్కుతుంది...." గంభీరంగా అన్నాడు డిటెక్టివ్ జలంధర్.

"లేదు జలంధర్ గారూ! నా లోని గర్వమంతా కరిగిపోయింది. తన కుటుంటానికి మా నాన్న యింత ద్రోహం చేసినా భాస్కర్ నిండుమనసుతో, నా ప్రతిమని భార్యగా స్వీకరించాడు. లోకంలో డబ్బుకాదు ప్రధానం. ఆప్యాయత, ఆత్మీయత అని తెలిసొచ్చింది!"

ఆనందబాష్పాలు రాలుతుండగా భాస్కర్ ని, ప్రతిమని అక్కున చేర్చుకున్నాడు సుధుమూర్తి ఆప్యాయంగా!

ఆ దృశ్యాన్ని చూసిన జలంధర్ తృప్తిగా తల పంకించాడు!

—: ఐపోయింది :—

సీరియల్

# అడుగు ముందుకు వేస్తే భస్మం




(గత సంచిక తరువాయి)

ప్రెసిడెంటుకు పరిస్థితి అర్థమయింది. "చూడండి, నేను మీ శ్రేయోభిలాషిని. ఈ దెయ్యాల ఏర్పాటు నేను చేసిందేనని ఒప్పుకొంటున్నాను. కానీ యెందుకు? మీ ప్రాణాలు రక్షించడానికే—మీరు ముందడుగువేస్తే మీ ప్రాణాలకు ముప్పువస్తుందని నాకు తెలుసు."

గురువులు నమ్మనట్లు చూశాడు. "మీకూ నాకూ యే విధమైన పరిచయమూ లేదు. అటువంటప్పుడు మీకు నా మీద ఇంత జాలి ఎందుకు?"

"నాకు పరిచయస్తులతో నిమిత్తంలేదు. తెలిసి యెవరినీ ప్రమాదంలో ఇరికించలేను. ఆ ఆటవికులను చూడ టానికి వెళ్ళిన వారెవ్వరూ ఇంతవరకూ తిరిగి రాలేదు" అన్నాడు ప్రెసిడెంట్.

"ఆ భయం నాకుండాలి. మీకెందుకు? నా కొక్కవల సింది ఆటవికుల గూడేనికి దారి...." అన్నాడు గురువులు.

"నాకు తెలిస్తే ఎప్పుడో చెప్పేవాణ్ని...."

"మీకు తెలుసు. అయినా చెప్పడంలేదు. ఈ రోజు నేను ఈ ఊరిపెద్దలయిన మిగతా తొమ్మండుగురినీ కలుసుకో బోతున్నాను. మీలో కొందరికి ఆటవికుల గురించి తెలుసునని నాకు నమ్మకంగా తెలిసింది. మీరేం చెప్పినా నేను నమ్మను. నేను కోరిన సమాచారం మీరు యిచ్చి తీరాలి" అన్నాడు గురువులు. అతని కంఠంలో తీవ్రత ధ్వనించింది.

"మీ మాట మీదే అయినప్పుడు నేను చేయగలిగిందేముంది. కుతూహలం కొద్దీ అడుగుతున్నాను. మీరు కోరిన సమాచారం లభించకపోతే ఏం చేద్దామనుకుంటున్నారు? ఏం చేయగలమనుకుంటున్నారు?" అన్నాడు ప్రెసిడెంటు. ఆ కంఠంలో హేళనవుంది.

"నేనేం చేసేదీ మాటలతో చెప్పను. కళ్ళతో చూస్తారు. ఇది మీకు నా హెచ్చరిక—" అన్నాడు గురువులు.

* * *

"మీతో ఒక్కమాట చెప్పాలి" అన్నాడు రామం.

"ఏమిటిది?" అన్నాడు ప్రెసిడెంటు. ఆయన ముఖంలో కుతూహలం లేదు.

"నేనీ గ్రామంనుంచి వెళ్ళిపోదామనుకున్నాను. కానీ గురువులు ఒప్పుకునేలా లేడు. మొదట్నించీ నాకీ ప్రయాణము ఇష్టంలేదు. అతను బెదిరించి బలవంతపెట్టి నన్ను తీసుకొచ్చాడు. ఇప్పుడు నేను వెనక్కి పోతానంటే నా ప్రాణాలు తీసేస్తాడు. మీ హెచ్చరికలు వింటూంటే నాకు చాలా భయంగావుంది. బ్రతికుంటే బలుసాకైనా తినవచ్చంటాను" అన్నాడు రామం.

"ఇదంతా నాకు ఎందుకు చెబుతున్నట్లు?"

"గురువులు ప్రమాదకరమైన మనిషి. నయాన అతణ్ని లొంగదీయడం కష్టం. ఒక్కసారిగా వెయ్యిమందికిసమాధానం చెప్పగలడు. అతన్ని మోసంతోనే జయించాలి" అన్నాడు రామం.

ప్రెసిడెంటులో రవంత ఆసక్తి కలిగింది—"ఎవరీ గురువులు?"

ఆరితేరిన గజదొంగ. పేరుపడిన హంతకుడు. చుట్టుముట్టిన పోలీసుల మీదనుంచి గెంతి వాళ్ళ జీపులోనే పారిపోయాడు. ఆ తర్వాత దురదృష్టంకొద్దీ యాక్సిడెంటుకు గురై పోలీసుల చేతిలోపడ్డాడు. జైల్లో పెట్టారు. జైల్లోంచి తప్పించుకుపోయాడు. బలవంతంగా మా ఇంట్లో ఆశ్రయం తీసుకున్నాడు. తనకొక నిధి రహస్యం తెలిసిందనీ దాన్ని సాధించడానికి తనకో తోడు కావాలనీ బలవంతంగా నన్ను తీసుకువచ్చాడు. ఇంతవరకూ యితడిని వదిలించుకునే అవకాశం నాకు రాలేదు" అని ఆగాడు రామం.

ప్రెసిడెంటు ముఖంలో కుతూహలం పెరిగింది"అయితే

చాలా ఘటికుడన్న మాట! ఏంచేస్తే యితగాడి పీడ వదులుంది....?"

"చాలా సింపుల్. ఇతగాడిక్కడున్నట్లు పోలీసులకు సమాచారం అందించారంటే వాళ్ళిక్కడికి వచ్చి క్షణాల మీద ఇతణ్ని అరెస్ట్ చేసి తీసుకుపోతారు. ఎటొచ్చీ పోలీసులు వస్తున్నట్లు గురువులుకు ముందుగా తెలియ కూడదు. అతను నిద్రపోతున్న సమయంలో చడీ చప్పుడూ లేకుండా వాళ్ళు రావాలి...."

ప్రెసిడెంటు అయిష్టంగా "పోలీసుల్నిక్కడికి పిలవడం నాకిష్టముండదు" అన్నాడు.

"కానీ తప్పదు. మీకూ నాకూ కూడా ఇతగాడి పీడ వదులుంది. మీకు నమ్మకమైన మనిషిద్వారా పోలీసులకు కబురుపెట్టండి" అన్నాడు రామం.

"అందుకు ఒకరోజు ఆగాలి. ఈలోగా నేను కొన్ని ఏర్పాట్లు చేసుకోవాలి."

"అలాగే! కానీ ఆలస్యం అమృతం విషం."

ప్రెసిడెంటు అనుమానంగా రామంవంక చూసి "మీ మాటలు నేను నమ్మవచ్చా?" అన్నాడు.

"ఎందుకలా అనుకుంటున్నారు?" అన్నాడు రామం ఆశ్చర్యంగా.

"గురువులు చాలా తెలివైనవాడిలా కనబడుతున్నాడు. మీకులాంటి నమ్మకద్రోహిని తనకు తోడుగా తెచ్చు కుంటాడా అని ఆలోచిస్తున్నాను."

"గురువులుకు తన శక్తి సామర్ధ్యాలమీద విపరీతమైన నమ్మకం. అదే గర్వం కూడా. ఆ గర్వమే అతని పతనానికి దారితీస్తుంది" అన్నాడు రామం.

* * *

గురువులు ఊరి పెద్దలందర్నీ కలిశాడు. అంతరూ తమకు ఏ నిధి గురించీ తెలియదని బుకాయించారు. అతను తను ప్రెసిడెంటును ఏ విధంగా హెచ్చరించాడో చెప్పి "మీరంతా ఆయనతో సంప్రదించి ఏంచేయాలో నిర్ణయించుకోండి. ఎంతో వ్యవధిలేదు" అన్నాడు.

తర్వాత అతను శ్రామిక జనాన్ని కలిశాడు. ఊరి పెద్దలమీద వారిలో ఎవ్వరికీ యిష్టంలేదని గ్రహించాడు. అక్కడి శ్రామికులందరికీ దుర్గయ్యే నాయకుడున్నాడు. అతడు గురువులుతో మాట్లాడేడు.

"కష్టజీవుల కష్టసుఖాలు గమనించి రమ్మనమని ప్రభుత్వం నన్ను పంపింది. దుర్మార్గులను శిక్షించడానికి నాకు సర్వాధికారాలూ యిచ్చింది. ఈ పరిస్థితి చూస్తూంటే నాకు కడుపు తరుక్కుపోతోంది. కొద్దిమంది కడుపులో చల్లకదలకుండా కూర్చుని సర్వసుఖాలూ అనుభవిస్తూంటే రెక్కలు ముక్కలు చేసుకునే శ్రామికజీవులు కడుపు నిండా తిండైనా దొరక్క అవస్థపడుతున్నారు. ఇందు క్కారణమేమిటి?" అన్నాడు గురువులు తీవ్రంగా. ఎంతో ఆవేదన ననుభవిస్తున్న అనుభూతి నతడు ముఖంలో ప్రదర్శించాడు.

"కారణం వేరే చెప్పాలా-దొరలు మమ్మల్ని దోచుకుంటున్నారు. మేమేమీ చెయ్యలేక నిస్సహాయంగా వూరుకున్నాము" అన్నాడు దుర్గయ్య.

"తిరగబడలేకపోయారా?"

"శక్తి చాలదు. వాళ్ళదగ్గర డబ్బుంది. మనుషులున్నారు. పలుకుబడివుంది. ఒకటేమిటి అన్నీ వున్నాయి. వాళ్ళనెదిర్చి మేము నిలబడలేము" అన్నాడు దుర్గయ్య.

దుర్గయ్య చెప్పిన కథలు వింటూంటే గురువులుకూడా

ఆవేశం కలిగింది.

ఒక పర్యాయం డాక్టరొకాయన శ్రామికుడింటికి వైద్యానికి వచ్చి శ్రామికుడి భార్యను బలవంతం చేయబోయాడు. సమయానికి ఎవ్వరో కలగజేసుకున్నారు. ఆ శ్రామికుడు తర్వాత డాక్టర్ వద్దకు వెళ్ళి నానా దుర్భాషలూ ఆడాడు. డాక్టర్ ప్రెసిడెంటుకు జెప్పుకున్నాడు. ప్రెసిడెంటు అంతా విని "డాక్టర్ అంతపని చేస్తాడంటే నేను నమ్మలేకుండా వున్నాను. నీ పెళ్ళాం అబద్ధమాడదని నాకు నమ్మకం. దాన్ని తీసుకునిరా. అది చెబితే నీ మాటలు నమ్ముతాను. డాక్టర్ని శిక్షిస్తాను" అన్నాడు.

శ్రామికుడు సంతోషపడి భార్యను తీసుకుని ప్రెసిడెంటు ఇంటికి వెళ్ళాడు.

"ఏమే-నీ మొగుడు చెబుతున్నది నిజమేనా?" అనడిగాడు ప్రెసిడెంటు.

"అవునండి" అంది శ్రామికుడి భార్య.

"నువ్వేమంటావయ్యా డాక్టరూ!" అన్నాడు ప్రెసిడెంటు.

"మీ మాటలు వినడం మినహా నాకింకేమీ తెలియదు" అన్నాడు డాక్టరు.

"ఆయన ప్రాణాలు నిలబెట్టే డాక్టరే! డాక్టరంటే దేవుడు. దేవుడు స్వయంగా వచ్చి చేతులు పట్టుకుంటే కాదంటావా-ఇప్పటికే చాలా పాపం వచ్చేసుంటుంది. వెళ్ళి ఆయన కాళ్ళట్టుకుని పొరపాటొప్పేసుకో"అన్నాడు ప్రెసిడెంటు.

శ్రామికుడు నివ్వెరబోయాడు ఈతీర్పుకు. ప్రెసిడెంటు చూస్తూండగా డాక్టరు శ్రామికుడి భార్యను బలవంతంగా ఓ గదిలోకి లాక్కుని వెళ్ళిపోయాడు. శ్రామికుడి పక్క-

ఇద్దరు బలాఢ్యులు నిలబడ్డారు.

"మా మోచేతి నీళ్ళు త్రాగి బ్రతికే వెధవలు, మాతో సమంగా ఉండాలనుకుంటున్నారా? మా నీతివేరు. మీ నీతివేరు. ఈసారి కింతటితో సరిపెట్టాను. ఇంకెప్పుడైనా ఊరిపెద్దల్ని తప్పుపట్టారంటే నీ రక్తం కళ్ళజూస్తాను" అన్నాడు ప్రెసిడెంటు.

శ్రామికుడి భార్య ఆ తర్వాత ఆత్మహత్య చేసుకోవాలనుకుంది. కానీ ఆ శ్రామికుడు ఆమెను దయతో ఏలుకున్నాడు. ఎప్పటికైనా పగతీర్చుకోవాలని చూస్తున్నాడు కానీ ఆ అవకాశం ఈ జన్మకు రాకపోవచ్చు.

"ఇలాంటి కథలు బోలెడున్నాయి బాబూ-గుర్తు తెచ్చుకుంటూంటే మా రక్తం మరిగిపోతూంటుంది" అన్నాడు దుర్గయ్య.

"నేనా డాక్టర్ని చంపేస్తే యెలావుంటుంది మీకు?"

"సంతోషంతో పండుగ జరుపుకుంటాం" అన్నాడు దుర్గయ్య.

"ఆ డాక్టర్ పెళ్ళాన్నవమానిస్తే."

దుర్గయ్య ఉత్సాహంగా ఈల వేశాడు.

"చూడు దుర్గయ్యా! మీ రుత్సాహంగా వుండండి. కొద్దిరోజుల్లోనే మీ ఆర్థికపరిస్థితి బాగుపడే యేర్పాటు నేను చేస్తాను. నేనెవ్వరికీ ప్రమాదం తలపెట్టను. ప్రెసిడెంటుకీ, పెద్దలకీ యెదురు తిరగడంవల్ల నాకు చాలా ప్రమాదముంటుంది. ప్రెసిడెంటు తన తెలివి తేటలన్నింటినీ వుపయోగించి మిమ్మల్ని నాపైన ఉసిగొల్పటానికి చూస్తాడు. మీరంతా నా పక్షానవుంటే చాలు. ప్రెసిడెంటు మనుషుల సంగతి నేను చూసుకుంటాను."

గురువులు అక్కణ్ణించి కదిలాడు. తన పథకం తప్పక

ఫలిస్తుందని అతనికి ఆశగా వుంది. ఊళ్ళోని శ్రామిక జనానికి ప్రెసిడెంటుపట్ల సుహృద్భావం లేకపోవడం తన అదృష్టం!

*　　*　　*

"పోలీస్ జీపు వచ్చిందండి" అన్నాడు పుల్లయ్య.

"ఎక్కడున్నారు పోలీసులు?" అన్నాడు ప్రెసిడెంటు.

"ఊరిపొలిమేరలో వున్నారండి" అన్నాడు పుల్లయ్య.

"సరేలే-నువ్వెళ్ళి అరుగుమీద కూర్చో—" అన్నాడు ప్రెసిడెంటు. ఆయన నెమ్మదిగా రామం, గురువులువున్న గది దగ్గరకు వెళ్ళాడు. గురువులు మంచంమీద కూర్చున్నాడు. వీపు గుమ్మంవైపుకు తిరిగివుంది. రామం మంచం మీద పడుకుని వున్నాడు. అతను ప్రెసిడెంటును చూశాడు.

ప్రెసిడెంటు రామానికి సైగచేశాడు. రామం నెమ్మదిగా మంచం దిగి గదిలోంచి బయటకు వచ్చాడు. ప్రెసిడెంటు అతన్ని మరికాస్త దూరంగా తీసుకొనిపోయి— "ఏం చేస్తున్నాడు గురువులు?" అనడిగాడు.

"ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు."

"మాకు రెండురోజులు గడువిచ్చాడుగా. అది తీరేక యేం చేయాలా అని ఆలోచిస్తూండి వుంటాడు. ఈలోగా అతగాడి రోజులు దగ్గరపడ్డాయి. పోలీసులు వచ్చారు. ఊరి పొలిమేరలో వున్నారు."

రామం కళ్ళు సంతోషంతో మెరిశాయి. తనకు గురువులు బాధ తప్పుతుంది. హాయిగావెళ్ళి లలితను పెళ్ళి చేసుకోవచ్చు. సుఖ భోజనం చేయవచ్చు. "నన్నిప్పుడేం చేయమంటారు?"

"గురువులు తొందరగా నిద్రపోయే మార్గంచూడు" అన్నాడు ప్రెసిడెంటు.

"అదేమంత కష్టంకాదు. నిన్న రాత్రల్లా మెలకువగా వున్నాడు. ఈరోజు మధ్యాహ్నంకూడా నిద్రపోలేదు. నేను మెలకువగా వుంటాననిచెబితే ఇప్పుడు నిద్రపోతాడు. గురువులు నిద్రకుపక్రమిస్తే నేను సన్నగా ఈల వేస్తాను. అప్పుడు మీరు పోలీసులకోసం బయల్దేరవచ్చు" అన్నాడు రామం.

"కానీ-జాగ్రత్త! అతను చాలా ప్రమాదకరమయిన మనిషి."

"ఆ విషయం మీకంటే నాకే బాగా తెలుసు...." అన్నాడు రామం. తర్వాత అతను తనగదిలోకి వెళ్లాడు. గురువులింకా అలా కూర్చుని ఆలోచిస్తూనే వున్నాడు.

"ప్రెసిడెంటు పిలిచాడా?" అన్నాడు గురువులు.

రామం ఉలిక్కిపడ్డాడు. వీపు తనవైపు పెట్టివున్నా గురువులు తను గదిలోంచి బయటకు వెళ్ళడాన్ని, తిరిగి రావడాన్ని చప్పుడునుబట్టి గ్రహించాడన్న మాట!

"అవును-పిలిచాడు" అన్నాడు రామం.

"ఎందుకు?" అన్నాడు గురువులు.

"నీకు తర్వాత తెలుస్తుంది. ఒకరి పథకాలొకరికి చెప్పుకో వద్దన్నావుగా."

"వెరీగుడ్" అని నవ్వి గురువులు రామంవైపు తిరిగేడు. "నేను నీ గురించే ఆలోచిస్తున్నాను రామం! నువ్వు నాలా రఫ్ అండ్ టఫ్‌గా పెరిగిన వాడివి కావు. నా గురించి ఇక్కడ నాకులాంటి జీవితమే గడుపుతూ కష్టపడుతు న్నావు. నిన్ను నువ్వు రక్షించుకోగలవా అన్న అనుమానము కూడా నాకుంది. నిన్ను కాపాడుతానని మీ

తాతకు మాటిచ్చాను. కనీసం నిధి చేరే వరకయినా నిన్ను కాపాడటం నా బాధ్యత!"

"నా గురించి బెంగ పెట్టుకోకు. నన్ను నేను కాపాడుకోగలను. నీ సంగతి నువ్వు చూసుకుంటే చాలు. ఆరోగ్యాన్ని మనిద్దరిలో యెవ్వరూ అశ్రద్ధ చేయకూడదు. నిన్న రాత్రి ఈరోజు మధ్యాహ్నంకూడా నీకు సరయిన నిద్రలేదు. ఇప్పుడు నిద్రపోయావంటే నేను కాపలా వుంటాను. మనకేమీ భయంలేదు" అన్నాడు రామం. అతని కంఠం అప్రయత్నంగా వణికింది.

"అదిసరే- నాకూ నిద్ర వస్తోంది. నీకే ఆపద కలిగినా వెంటనే నన్ను లేపు. ఒక్క క్షణంకూడా జాప్యం చేయకు. ఈరోజు నాకు కాస్త గాఢనిద్రకూడా వచ్చేలాగుంది" అన్నాడు గురువులు. అంటూనే అతను లేచి వెళ్లి గది తలుపులు వేశాడు. దీపం ఆర్పాడు. మంచం మీద పడుకున్నాడు.

గురువులు గురక గదిలో ప్రతిధ్వనించసాగింది. రామం సన్నగా ఈల వేశాడు. గది కిటికీ దగ్గర నిలబడి వున్న ప్రెసిడెంటుకు ఆ ఈల వినబడింది. ఆయన ఉత్సాహంగా అక్కణ్నించి కదిలాడు.

రామం మెలకువగానే వుండి అంకెలు లెక్కపెట్టుకుంటున్నాడు. ఎప్పుడు పోలీసులు వస్తారా, తనకు గురువులు బాధ తప్పుతుందా అని అతను ఆలోచిస్తున్నాడు. ఆలోచిస్తూండగానే అతడికి మగతగా నిద్ర పట్టింది.

తనమీద ఏదో చిన్న రాయి పడ్డట్లనిపించి రామానికి మెలకువ వచ్చింది. ఒక్కనిమిషం కళ్ళు నులుముకున్నాక అతడికి తన పథకం గుర్తుకొచ్చింది. చటుక్కున గురువులు వంక చూశాడు. అతగాడి గురక గదిలో యింకా ప్రతి

ధ్వనిస్తోంది.

రామం మంచంమీంచి లేచాడు. కిటికీదగ్గర నీడలు అతనికి కనబడుతున్నాయి. ప్రెసిడెంటు పోలీసులతో వచ్చేశాడన్నమాట! గది తీయబోతూ రామం వణికాడు. తప్పు చేస్తున్నానేమో నన్నభావం లిప్తకాలం అతడికి కలిగింది. రామం గది తలుపులు తీశాడు.

ప్రెసిడెంటు, పోలీసులు చప్పుడు చెయ్యకుండా గదిలో ప్రవేశించారు. ప్రెసిడెంటు స్విచ్ నొక్కి దీపం వేశాడు. పోలీసులు గురువులు మంచాన్ని చుట్టుముట్టేరు. మొత్తం యెనమండుగురు వున్నారు.

గురువులు బోర్లా తిరిగి నిద్రపోతున్నాడు. అతనింకా గురక పెడుతూనే వున్నాడు.

పోలీసుల్లో ఒకడు వంగి గురువులు వీపుమీద తట్టాడు. గురువులు కదల్లేదు. అతని గురకకూడా ఆగలేదు. ఇంకో పోలీసు మరికాస్త గట్టిగా కుదిపాడు.

గురువులు గురక ఆగింది. ఓ చేయి కదిలింది. అతను చటుక్కున లేచికూర్చుని కళ్ళు నులుముకున్నాడు.

ఎనమండుగురు పోలీసులూ తుపాకులు సిద్ధం చేసుకున్నారు. కొద్దిగా వెనక్కి వెళ్ళారు.

గురువులు పోలీసుల్ని చూసి గతుక్కుమన్నాడు. అప్రయత్నంగా అతడి దృష్టి రామంవైపుకు వెళ్ళింది. రామం తానేమీ యెరుగనన్నట్లుగా తల అడ్డంగాతిప్పి, కంగారుగా, దీనంగా గురువులువంక చూశాడు. తర్వాత గురువులు ప్రెసిండెంటువంక చూశాడు. ప్రెసిడెంటు వస్తున్న నవ్వు నాపుకుంటున్నాడు. ముఖంలో గర్వం చాలా యెక్కువగా వుంది.

గురువులు పోలీసులవంక చూస్తున్నాడు. పోలీస్ ఇన్

స్పెక్టర్ గురువుల్ని పరీక్షగా గుచ్చిగుచ్చి చూస్తున్నాడు.

"ఏమిటిదంతా? పోలీసులెందుకొచ్చారు?" అన్నాడు గురువులు.

"ఎందుకొస్తారు పోలీసులు?" అన్నాడు ప్రెసిడెంటు.

పోలీసు ఇన్‌స్పెక్టర్ తన జేబులోంచి ఒకఫోటో తీసి గురువుల్నీ ఫోటోనూ మార్చిమార్చి చూస్తున్నాడు.

"ఏమిటిదంతా? నేనెవర్ననుకుంటున్నారు?" అంటూ గద్దించాడు గురువులు.

అది మేకపోతు గాంభీర్యంలా వున్నదనీ, గురువులు తప్పించుకునేటందుకు దారి చూస్తున్నాడనీ ప్రెసిడెంటు గ్రహించాడు.

"నువ్వెవరివో యిక్కడ అందరికీ తెలుసు. అనవసరంగా గొంతు చించుకుని అరవకు. నీ ఆటకట్టింది" అన్నాడు ప్రెసిడెంటు.

పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఊరుకోమన్నట్లు ప్రెసిడెంటు భుజంతట్టి, గురువుల్ని సమీపించి ఎటెనన్షన్లో నిలబడి సెల్యూట్ చేశాడు-"సార్, మీరిక్కడిలా....?" అని అర్థోక్తిగా ఆగిపోయాడు.

ప్రెసిడెంటు, రామం ప్రమాన్పడిపోయారు.

గురువులు యిబ్బందిగా మంచంమీంచి కదిలి "ఎలా గుర్తుపట్టావ్?" అన్నాడు.

"గుర్తుపట్టడానికేముంది సార్? మీరెంత గొప్పగా మేకప్ చేసుకున్నప్పటికీ చచ్చినమనిషి బ్రతికొచ్చాడనుకోంలేగదా-అదీకాక మీరు గురువులు వేషంలో వున్నట్లు నిన్ననే మాకు సమాచారమందింది!"

"ఏమిటీ___గురువులు చచ్చిపోయాడా?" అన్నాడు రామం ఆశ్చర్యంగా. తనకు తెలిసిన వివరాలనుబట్టి, యిది

ఏ మాత్రమూ నమ్మదగనిగా తోచలేదు రామానికి.

పోలీస్ ఇన్‌స్పెక్టర్ నాలిక్కరుచుకున్నాడు.

గురువులు నవ్వుతూ "ఫర్వాలేదు మిస్టర్ సురేష్— గురువులు చచ్చిపోయాడనీ కొన్ని కార్యాలు సాధించడానికి ఒక పోలీసు అధికారి గురువులు రూపంలో తిరుగుతున్నాడనీ నీకు తెలిసిన విషయం ఇక్కడున్న వీళ్ళకు చెప్పినా యిబ్బందిలేదు. అది రహస్యంగానే వుంటుందని నీకు హామీ యిస్తున్నాను. ఎందుకంటే వీళ్ళంతా మనవాళ్ళే!" అన్నాడు.

"ఎవరు ఎవరైనప్పటికీ అది నేను దాచవలసిన రహస్యం. మీరెలాగూ చెప్పారు. అనవసరంగా మీకు శ్రమ యిచ్చినందుకు నన్ను మన్నించాలి. ఎప్పుడైనా మీకు యిబ్బంది కలిగితే కాకితో కబురు పంపితే వచ్చి వాలతాను. ప్రస్తుతానికి సెలవు తీసుకుంటాను. మీరు తలపెట్టిన కార్యం నిర్విఘ్నంగా నెరవేరగలదని ఆశిస్తున్నాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సురేష్.

అతను తన బలగంతో బయటకు వెడుతూంటే ప్రెసిడెంటు అనుసరించి "పొరపాటయింది. ఈయన పోలీసు అధికారి అని నాకు తెలియలేదు" అన్నాడు.

సురేష్ నవ్వి "ఇది మన్నించదగ్గ పొరపాటే-తెలియక చేసిన తప్పుకు క్షమించడం న్యాయం. ఇప్పుడు నిజం తెలిసింది కాబట్టి ఇలాంటి పొరపాటు మళ్ళీ చేయకండి. తెలిసి చేసిన తప్పును మా డిపార్టుమెంటు చాలా సీరియస్‌గా తీసుకుంటుంది" అన్నాడు.

* * *

"నన్ను మన్నించు....ఇంతకాలం నువ్వొక సామాన్యమైన దొంగవనే అనుకుంటున్నాను. కానీ బాధ్యతగల

పోలీసాక్షీసరువని తెలుసుకోలేదు" అన్నాడు రామం.

గురువులు నవ్వి వూరుకున్నాడు.

"నీ పేరు తెలుసుకోవచ్చా?" అన్నాడు రామం.

"నా పేరు గురువులు. అక్షరాలా గురువులు. నాకు పోలీస్ డిపార్టుమెంటులో ఏ విధమైన సంబంధమూ లేదు. నేను దొంగను, హంతకుణ్ణి!" అన్నాడు గురువులు గర్వంగా నవ్వుతూ.

"అంటే?"

"రామం నీకు చాలా థాంక్స్! నీకు గుర్తున్నదే అనుకుంటాను. శ్రీకృష్ణపరమాత్మ మొదట్లో అన్నాడు—గంగాపురంలోకి ఏదో ఒక పర్యాయం పోలీసుల అవసరం తీసుకురావాలనీ-అది మనకెంతో ప్రయోజనకారి కాగలదనీ! ఆ సలహాను దృష్టిలో వుంచుకుని నువ్వు నాకు బాగా సహాకరించావు. పోలీసుల్ని పిలవమని నువ్వేగదా ప్రెసిడెంటుకు సలహా ఇచ్చావు" అన్నాడు గురువులు.

"అవును" అన్నాడు రామం తల వంచుకుని.

"రామం నీ పద్ధతిలో నువ్వు ప్రయత్నాలు చేస్తాననడం బాగానే ఉంది కానీ మరీ అంత గుంభన పనికిరాదయ్యా-నీకు శ్రీకృష్ణపరమాత్మపైన వున్న విశ్వాసం మెచ్చుకోదగ్గది. మన నాటకం బాగా రక్తికట్టింది. ప్రెసిడెంటు పోలీసులకోసం కబురుపెట్టిన మనిషిని ఊరి పొలిమేరలలో శ్రీకృష్ణపరమాత్మ కలుసుకుని, తప్పుదారి పట్టించి—తన మనుషుల్ని పోలీసులుగా పంపించాడన్న విషయాన్ని ప్రెసిడెంటు ఈ జన్మకు కనుక్కో లేడు" అన్నాడు గురువులు పకపకా నవ్వుతూ.

రామం బాగా ఆశ్చర్యపడ్డాడు కానీ పైకి తేలలేదు. తను ఏ ఉద్దేశ్యంతో గురువుల మీదికి పోలీసులనుసి

గోల్చాలనుకున్నా అది అతనికే మంచిచేసింది. తను మంచి చేయాలనే అలా చేశానని అతననుకుంటున్నాడు.

రామానికి తాతయ్య హెచ్చరికలోని అర్థం అప్పటికి తెలిసివచ్చింది. గురువుల్నించి తప్పించుకోవడం అంత సులభమైన పనికాదు. తన మెదడుకు బాగా పదును పెట్టాలి.

"మరి నువ్వు నీకు తెలియని పోలీస్ ఇన్‌స్పెక్టర్ని పేరు పెట్టి ఎలా పిలిచావు?" అనడిగాడు రామం.

"అది మన సంకేతం. శ్రీకృష్ణ మొదటి పర్యాయం పంపించే పోలీస్ ఇన్‌స్పెక్టర్ని సురేష్ అని పిలవడం, ఆ పిలుపుకు అతను రెస్పాన్సివ్వడమూ పరస్పరం గుర్తించుకునేలా చేస్తుంది."

రామం బాగా ఆశ్చర్యపడ్డాడు.

"ఎక్కువగా ఆలోచించకు. ఈ పూటకు యిద్దరం పడుకోవచ్చు. ఇంకే ప్రమాదమూ వుండదు. నువ్వు కూడా నిశ్చింతగా వుండు" అన్నాడు గురువులు.

ఇద్దరూ నిద్రకుపడ్డారు. రాత్రి ఏ సంఘటనలూ జరగ లేదు. ఇద్దరూ కూడా కాస్త పెందరాళే లేచారు. కాల కృత్యాలు తీర్చుకున్నారు.

గురువులు ప్రెసిడెంటును పిలిచి పలకరించాడు "నా సంగతి చాలా వరకూ అర్థమయిందనుకుంటాను. ఈ రాత్రితో మీకిచ్చిన గడువు అయిపోతోంది. బాగా ఆలోచించుకోండి."

"నాకు తెలిసింది నే నెప్పుడో చెప్పాను. ఇంక ఆలోచించవలసినదేమీ లేదు."

"అయితే ఒక పోలీసు అధికారిగా ఆజ్ఞాపిస్తున్నాను. ఈ రాత్రి మీ ఇంట్లోని పెద్దహాల్లో ఊరిపెద్దలందరూ

సమావేశం కావాలి. నేను చెప్పదల్చుకుందీ, చెయ్యదల్చుకుందీ అప్పుడు మీకు తెలియజేస్తాను" అన్నాడు గురువులు.

"దానికేం భాగ్యం .... అలాగే!" అన్నాడు ప్రెసిడెంటు.

తర్వాత గురువులు ఊళ్ళో పనుందని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. రామం మాత్రం అక్కడే వుండి పోయాడు.

"నీ మాట పట్టుకున్నందుకు నాకు మంచి పరాభవమైందిలే. అయినా వాడి మనిషివని తెలిసుండీ నిన్ను నమ్మడం నా తెలివితక్కువ" అన్నాడు ప్రెసిడెంటు రామంవంక కసిగా చూస్తూ.

"నీ పరాభవానికి కారణం మీ తెలివితక్కువతనం. నేను కాదు" అన్నాడు రామం.

"ఆ మాటేకదా నేనూ ఒప్పుకున్నాను. నిన్ను నమ్మడం నా తెలివితక్కువే మరి!"

"నన్ను నమ్మడం కాదు" అని రామం నవ్వి "గురువులు పోలీసు అధికారి కాడు. నిన్న రాత్రి వచ్చింది పోలీసులూ కాదు. ఈ చుట్టుపక్కల మకాం పెట్టిన గురువులు మనుషులు. ఈ విషయం మీరు తెలుసుకోలేకపోయారు" అన్నాడు.

ప్రెసిడెంటు నోరావలించి "ఇదెలా సాధ్యం?" అన్నాడు.

"గురువులుకు చాలా సాధ్యపడతాయి. అతను సామాన్యుడు కాదని మీకెప్పుడో చెప్పాను. పోలీసు డిపార్టుమెంటు అతని కోసం గాలిస్తూ ఏమీ చేయలేకపోతోంది. మీరూ, నేనూ ఎంత? అతగాడి మనుషులు ఈ గ్రామం చుట్టూ వలపన్ని వున్నారని నా గట్టి నమ్మకం. వాళ్ళను భేదించుకుని అసలు పోలీసుల వద్దకు వెళ్ళడం యించు

మించు అసాధ్యం. ఇంకేమైనా వుపాయం పన్నాలి.''

"నీకేదయినా తోస్తే చెప్పు" అన్నాడు ప్రెసిడెంటు.

"ఎలాగో అలా నన్నిక్కణ్నించి తప్పించాలి మీరు. నేను బయటకు వెళ్ళానంటే మీకు చాలా సాయపడగల్గుతాను."

"నీ స్వార్థం నువ్వు చూసుకుంటున్నావ్. నువ్వు తప్పించుకుపోతే మళ్ళీ మమ్మల్ని పట్టించుకుంటావా?" అన్నాడు ప్రెసిడెంటు.

"అలా అయితే నిధి రహస్యం చెప్పక తప్పదు మీరు" అన్నాడు రామం.

"రహస్యం చెప్పడానికి నిధి అంటూ ఉండి ఏడిస్తే గదా!" అన్నాడు ప్రెసిడెంటు.

"అది గురువులూ, మీరూ చూసుకోవాల్సిన విషయం. ఇందులో నేను చేయగలిగిందేమీ లేదు"అన్నాడు రామం.

"నేనేం చేయాలో చెప్పు" అన్నాడు ప్రెసిడెంటు.

"నాకు ఆరోగ్యం బాగాలేదని చెబుతాను. డాక్టర్ని పిలిపించండి. ఆయన నన్ను పరీక్షించి నా పరిస్థితి తీవ్రంగా వుందని చెబుతాడు. మొదట నన్నాయన ఇంటికి తరలించండి. అక్కడో రెండురోజు లుంచుకొని రోగం అంతు బట్టడంలేదనీ పట్నం పంపాలనీ ఆయనంటాడు. నన్ను పట్నం పంపారంటే గురువులు పని అయిపోయినట్టే!" అన్నాడు రామం.

"గట్టి బుర్రేనయ్యా నీది!" అన్నాడు ప్రెసిడెంటు అభినందిస్తూ. "ఇందులో నీకూ ప్రమాదంలేదు, మాకూ ప్రమాదంలేదు. పని జరిగిందా సరేసరి. లేమా నష్టం లేదు. అలాగే చేస్తాను. కానీ నీ రోగం యెప్పుడు మొదలవుతుంది?" అన్నాడు ప్రెసిడెంటు.

"ఆలశ్యం, అమృతం, విషం....అన్నారు. ఈరాత్రి మీరంతా యెలాగూ మీటవుతున్నారు గదా! అదయిన కాస్సేపటికి నాకు కడుపునొప్పి వస్తుంది. బయట వాళ్లను నమ్మించగల అతి తక్కువ జబ్బుల్లో అదొకటి!" అన్నాడు రామం.

"బాగానేవుంది చూద్దాం ఈసారేమవుతుందో——" అన్నాడు ప్రెసిడెంటు.

* * *

"మీరంతా ఈ ఊరి పెద్దలు. ఈ ఊరికి మీ చేతనైన సహాయం చేస్తూ, ఫలితాల నందుకుంటూ జీవితం కొనసాగిస్తున్నారు. మీతో నాకేమీ శత్రుత్వంలేదు. ఒకపని గురించి నేనిక్కడకు వచ్చాను. అదేమిటో మీ అందరకు తెలుసు. నేను మీ అందరి సహకారం కోరుతున్నాను. అది నాకు లభించడంలేదు.

నేనెంత ప్రమాదకరమైన మనిషినో మీ రెవ్వరూ గుర్తించినట్లు లేదు. గుర్తించేలా చేయడంకూడా నా అభిలాష కాదు. కానీ తప్పేలా కనిపించడంలేదు. మీకు నే నిచ్చిన గడువు పూర్తికావస్తోంది. ఇప్పటికీ నే నడిగింది మీరు చెప్పని పక్షంలో తర్వాత జరిగే సంఘటనలకు బాధ్యత నాదికాదు. మీదే అవుతుంది" అన్నాడు గురువులు.

"ఏమిటీ బెదిరింపు. మేము నాగరిక ప్రపంచంలో వుంటున్నామా, అడవిలో వుంటున్నామా?" అన్నాడు కరణం.

"మీరున్నది నాగరిక ప్రపంచానికీ, అడవికీ మధ్యలో. మీ ప్రవర్తనకూడా మధ్యరకంగానే వుంటోంది. నాగ

దకులకున్న సౌఖ్యాలన్నీ అనుభవిస్తూనే తోటి మానవులను అనాగరికంగా హింసిస్తున్నారు.

మీ గురించి చాలా కథలు విన్నాను. మీలో వొక డాక్టరు వొక శ్రామికుడి భార్యను బలవంతంగా, మహా అవమానకరంగా అనుభవించి, అది తన హక్కుగా భావించాడు. మనసబుగారు జబ్బుతో బాధపడుతున్న ముసలాడిచేత గొడ్డు చాకిరీ చేయించుకొని వాడు చచ్చిపోతే ఆ పని వాడి కొడుకుచేత పూర్తి చేయించుకొని అప్పుడు శవాన్ని వాడికి అప్పగించాడు. చెప్పాలంటే యిలాంటి ఘోరాలు చాలా వున్నాయి. నేనిక్కడికి ఈ ఘోరాల నెదిరించడానికి రాలేదు. నా పనిమీద వచ్చాను. అనాగరికం గురించి మాట్లాడటానికి మీకు అర్హతలేదు....." అన్నారు గురువులు.

అందరూ కాసేపు నిశ్శబ్దం వహించారు.

ప్రెసిడెంటు కాసేపు ఆగి యిలా అన్నాడు. "మాకు తెలియని చోటుగురించి మమ్మల్నడిగితే మేమేం చెప్పేది. ఆ అడవిదారి అత్యంత ప్రమాదకరమైనది. అందులోకి వెళ్ళినవారు ప్రాణాలతో తిరిగి రాలేదు. మీ బాధ భరించలేక మాకు తోచిన తప్పుదారి యేదైనా చూపిస్తే మీరా దారిని వెళ్ళి చస్తారు. అది అమానుషంగా భావించి ఇంతవరకూ ఆ పని చేయడంలేదు. మీరు మరీ బలవంతపెడితే మేమింక ఆ పనే చేయాల్సి వుంటుంది."

"మీరు చెప్పినదారి పట్టుకుని ప్రమాదాల్లో ఇరుక్కోడానికి గురువులేమంత మూర్ఖుడుకాడు. ప్రయాణంలో మీ కత్యంత ప్రియమైనవారు, ఆసహాయులు వస్తారు" అంటూ నవ్వాడు గురువులు.

"అంటే?"

"బాలురుగానీ, బాలికలుగానీ...."

మళ్లీ కాసేపు యెవ్వరూ మాట్లాడలేదు.

నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ మనసబు యిలా అన్నాడు—"మాకు తెలియని రహస్యం మన్మల్ని అడుగుతున్నావ్. చెప్పలేక పోవడం మా తప్పుకాదు. అందుకు నువ్వేం చేయదల్చుకున్నావో చెప్పు. విని ఆనందిస్తాము."

"విని ఆనందించే మాట కాదది. అయినా ఈ గురువులు చేయదల్చుకున్నది నోటితో చెప్పడు. చేసి చూపిస్తాడు."

"చేస్తూంటే చూడటానికి కిక్కడెవ్వరూ గాజులు తొడుక్కు కూర్చోలేదు" అన్నాడో భూస్వామి కోపంగా. ఆయన కళ్ళు ఎర్రబడ్డాయి.

"పోనీ-అలా గాజులు తొడిగించుకుని కూర్చున్నవాళ్ళ జోలికే వెడతాను" అన్నాడు గురువులు.

అతడి మాటలకు ప్రెసిడెంటు ఉలిక్కిపడ్డాడు. ఏమిటి గురువులు అన్న మాటలకు అర్థం? ఇక్కడున్న పదిమందిలో గాజులు తొడిగించుక్కూర్చున్న వాళ్ళు కొందరున్నారనా? లేక.... లేక.... ఇతను ఆడవాళ్ళ జోలికెడతాడా? ఈ ఆలోచన రాగానే ప్రెసిడెంటు అనుమానంగా గురువులు వంక చూశాడు.

గురువులు కళ్ళలో పట్టుదల కనబడుతోంది. ఏమైనా చేయగల ధైర్యం అతనికుందని ఆ కళ్ళనుచూసి తెలుసుకోవచ్చు. "నీలాంటి మనిషి తటస్థపడతాడని-నేను జన్మలో అనుకోలేదు—" అనుకున్నాడు ప్రెసిడెంట్ మనసులో.

అందరూ నిశ్శబ్దంగా వున్నారు. ఆఖరుకు ఓ భూస్వామి లేచినిలబడి-"ఇతను మాటలు మీరుతున్నాడు.

తుదముట్టించడం మినహా చేయగలిగిందేమీ లేదు—" అన్నాడు.

"ఇలాంటి ఆలోచనలు మీకొస్తాయని నాకెప్పుడో తెలుసు. మీలో దమ్ములున్న వాళ్ళు రొమ్ము చరిచి నా ముందుకు రండి. నా తడాఖా చూపిస్తాను" అన్నాడు గురువులు. ఇప్పుడతని ముఖంలో ఆవేశం చోటు చేసుకుంది.

గురువులు సవాలుకు నలుగురయిదుగురు ఆవేశపడ్డారు. కానీ ప్రెసిడెంటు అందర్నీ వారించి—"ఈ ప్రదేశంలో హింసాకాండ నేను భరించలేను. ఎప్పుడైనా చీడపురుగు యెదురయితే దాన్ని నలిపేయడం తప్పని నేను అనుకోను. కానీ యెంతటి దురాత్ముడికీ ఒక అవకాశమివ్వడం మంచిది. కాబట్టి గురువులూ! నువ్వు మాకిచ్చిన గడువు తీరిపోయింది. ఇప్పుడు నేను నీకు చెప్పబోయే దేమిటంటే ఒకే ఒక్క రోజు గడువిస్తున్నాను. ఈ వూరు వదిలిపెట్టి వెళ్ళావా సరేసరి. లేకపోతే నల్లిని రాచినట్లు రాచిపారేస్తాను. నా సంగతి నీకింకా తెలియదు" అన్నాడు.

"అయితే మిమ్మల్నిక దేవుడుకూడా రక్షించలేడు. ఈ గురువులు కురుక్షేత్ర మహా సంగ్రామాని కిప్పుడే శంఖం పూరిస్తున్నాడు. సిద్ధపడండి!" అన్నాడు గురువులు.

* * *

ఒక రాత్రివేళ రామం "అబ్బా!" అని బాధగా అరిచాడు. గురువులు ఉలిక్కిపడి లేచాడు. లైటు వేసిచూసి "ఏమయింది రామం!" అన్నాడు.

"నొప్పి!" అన్నాడు రామం మెలికలు తిరిగిపోతూ.

గురువులు కంగారు పడ్డాడు. ఇక్కడ తమకు విష ప్రయోగం జరిగే అవకాశ మున్నదని అతనికి బాగా అనుమానంగా వుంది. అందుకే భోజనం విషయంలో ఎన్నో

జాగ్రత్తలు తీసుకుంటున్నాడు. రామాన్నికూడా హెచ్చరించాడు.

కానీ తామిద్దరమూ యెక్కువకాలం కలిసి వుండటం లేదు. తను సమయాన్ని యెక్కువగా శ్రామికులతో గడుపుతున్నాడు. రామం పెద్దమనుషులతో గడుపుతూ వున్నాడు. ఆ సమయంలో యెప్పుడైనా తొందరపడి కక్కూర్తి పడితే?

గురువులు, రామాన్ని సమీపించి పొట్ట నిమురుతూ "యెలావుంది రామం?" అన్నాడు.

"భరించలేక పోతున్నాను. చచ్చిపోతానేమోనని భయంగావుంది" అన్నాడు రామం. అతను స్థిరంగా వుండలేక పోతున్నాడు.

గురువులు గదిలోంచి బయటకు వెళ్ళి ప్రెసిడెంటు కోసం కేకపెట్టాడు. కొద్దిసేపట్లో ఆయన వచ్చాడు. అప్పటికికూడా రామం యింకా మెలికలు తిరిగిపోతూనే వున్నాడు.

అతని అవస్థ నాన్నూంటే ప్రెసిడెంటుకు అది వొంగ నొప్పి కాదేమోనని అనుమానం వచ్చింది. అతడు కదిలే విధానం, ముఖంలో కనిపించేబాధ చాలా సహజంగా వున్నాయి.

"ఏం జరిగింది?" అన్నాడు ప్రెసిడెంటు.

"కడుపునొప్పి అనుకుంటాను" అన్నాడు గురువులు— "త్వరగా డాక్టర్ని పిలిచి సరయిన వైద్యం జరిపించండి."

"ఇంత రాత్రి సమయంలో యే డాక్టరొస్తాడు? ప్రొద్దుటదాకా ఆగితే...."

"ప్రెసిడెంటుగారూ రోగులకూ, డాక్టరుకూ టైము

పట్టించుకోవద్దు. వెంటనే పిలిపించండి" అన్నాడు గురువులు.

ప్రెసిడెంటు తన పాలేర్ని లేపడానికి వెడుతూ, తప్పని సరి అయి వెడుతున్నట్లుగా యిబ్బంది మొహం పెట్టాడు.

గురువులు రామాన్ని సమీపించి, "రామం యేమైందో చెప్పు. నువ్వుగానీ పొరపాటున ప్రెసిడెంటు యింట్లో యేమైనా తినలేదుగదా" అన్నాడు.

రామం అడ్డంగా తలవూపి—"రాదలచి వచ్చిన నొప్పి యిది. ఉండుండి కడుపులో శూలాలతో గుచ్చినట్లు బాధ. ఈబాధ భరించడం కంటె ప్రాణాలు పోతే హాయిగా వుంటుందనిపిస్తోంది" అన్నాడు.

గురువులు కళ్ళలో ధైర్యం చోటుచేసుకుంది. రామానికి యేమీ కాకూడదని అతను మనసులో కోరుకొంటున్నాడు. తన గొడవలోపడి రామాన్ని అశ్రద్ధ చేశాననీ, అతన్ని అన్నివేళల్లోనూ తన వెంట బెట్టుకునే వుండవలసిందనీ అనుకుంటూ, ఆ మాటలే రామంతో అన్నాడు.

"భగవంతుడి దయవల్ల నీకీ గండం గడిస్తే-ఇక నిన్ను వొక్క క్షణంకూడా వదలను. అనుక్షణం నిన్నంటిపెట్టుకుని కంటికి రెప్పలా కాపాడుకుంటాను" అన్నాడు గురువులు.

రామంపై ఆ మాటలు వింత ప్రభావాన్ని చూపించాయి. గురువులలా అనకుండా ఉండివుంటే బాగుండునని అతనికి అనిపించింది. హృదయంలేని హంతకుడుగా గురువుల్ని తను భావిస్తున్నాడు. అందుకే అతనికి న్యాయం తలపెడుతున్నాడు. ఆ గురువులు తనని సోదరుడిలా అభిమానిస్తుంటే అది మనఃపూర్వకమైన అభిమానమే అయితే తన మనసు తను చేస్తున్న తప్పుకు తన్ను క్షమించదు.

(సశేషం)

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/-లు నగదు బహుమతి పంపుతాము.

# "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 7/-లకే మా ఏజెంట్ ద్వారాగాని, వి. పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరుగనవ సరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు, ఏడాది పైకము రు. 80/-లు ముందుగా పంపితే వారికి కాపీలు 'రికార్డెడ్ డెలివరీ'లో పంపగలము.



# క్రేమిలో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురించబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## బరువు

తాలూకా ఆఫీసులో కాగితాలు ఇచ్చి నాలుగు రోజులైనా పని జరుగకపోవడంచేత ఆఫీసు చుట్టూ చెప్పులరిగేలా తిరుగుతున్న సుబ్బారావును చూసిన ఆఫీసు బంట్రోతు ఒక రోజు సుబ్బారావును దగ్గరికి పిలచి సంగతి తెలుసుకొని—

"ఏమండీ మీరు ఎన్ని రోజులుతిరిగినా లాభముండదు" అంటూ రహస్యంగా ఏదో చెప్పి "అలా చేయండి క్షణంలో మీ పని జరిగిపోతుంది" అన్నాడు.

"అదెంత పని!" అంటూ వెళ్లిన సుబ్బారావు కొలది సేపటికి తలపై తాను మోయగలిగిన బరువుగల రాతిని తీసుకొని ఆఫీసులోనికి బయలుదేరాడు. అది చూచిన బంట్రోతు—

"ఏమండీ ఆ రాయి ఎందుకూ?" అంటూ ప్రశ్నించాడు.

"నీవే గదయ్యా బరువులేందే పనెలా జరుగుతుందన్నావు! క్షణంలో పని జరగాలంటే ఈ బరువు చాలదా!" అంటూ అమాయకంగా చూచాడు సుబ్బారావు.

ఆర్. వి. ప్రభాకరరావు, నోముల.

## ప్రాణమా? పోతున్నావా?

పిల్లవాడు: అమ్మా! ప్రాణం ఎక్కడనుండి పోతుందీ?

తల్లి: కళ్ళనుండి, నోటినుండి పోతుంది.

పిల్లవాడు: కాదు కిటికీనుండి.

తల్లి: నీకు ఎవరు చెప్పారు?

పిల్లవాడు: నాన్నగారు, రోజూ మన ఎదురింటి రెండు జడల అమ్మాయిని కిటికీ నుండి చూస్తూ నా ప్రాణమా! పోతున్నావా? అంటున్నారుగా!

—కె. ప్రసన్న, బొంబాయి.

## కత్తి పదును - ?

ఒక చైనావాడు, ఒక జపాన్‌వాడు తమ తమ దేశాల్లో తయారయ్యే కత్తుల పదును, వాటి గురించి మాట్లాడు కొంటున్నారు.

జపాన్‌వాడు తన కత్తి తీసి చైనావాడి వీపుమీద రాసి "చెప్పు, నీకేమైనా అనిపించిందా?" అని అడిగాడు.

"లేదు" అని చైనావాడు తల వూపాడు.

"అయితే నీ వీపు తడిమి చూసుకో" అన్నాడు జపాన్ వాడు.

చైనావాడు చేత్తో తడుముకొనేసరికి చెయ్యంతా రక్తం అంటుకుంది.

గర్వంగా చూస్తున్న జపాన్ వాడి పీకమీద చైనావాడు తన కత్తితో మెల్లగా రాసాడు.

"చెప్పు నీక్కూడా ఏమైనా కోసినట్లనిపించిందా?" అని అడిగాడు చైనావాడు.

లేదు అని తల అడ్డంగా ఊపేసరికి జపాన్‌వాడి బుర్ర కాస్తా క్రింద పడిపోయింది.

—ఎమ్.వి. రత్నం- దౌలతాబాద్.

—: o :—

